

ఏప్రిల్ 23 శ్రీమతి యస్. జానకి జన్మదిన సందర్భంగా
సంగీత ప్రియులందరి తరపున శుభాకాంక్షలతో...

హాసం

'హాసం'
హాస్య-సంగీత పత్రిక

# ఇవీ సంగతులు

Also available on net - www.haasam.com

# హాస్యం - సంగీతం



1. ఎస్.జానకికి ఫోటోల కర్టెసీ:
2, 62, 63, 64, 65 పేజీలు: శ్రీ సంజయ్ కిషోర్
66వ పేజీ: శ్రీ ప్రదీప్
2. ఎన్.టి.ఆర్. ఫోటో కర్టెసీ: శ్రీ నందగోపాల్





సినీ సంగీత ప్రియులకు ప్రత్యేక కానుకగా
'వాసు'
'లాహిరి లాహిరి లాహిరిలో...'
సినిమా పాటల పుస్తకాలు
'సెంటర్‌స్ప్రెడ్'లో

8 పేజీల ప్రత్యేక కానుకలో: ఎస్.జానకి గానం చేసిన సినీ గీతాలు ఇంకా
శ్రీరామ నవమి స్పెషల్‌గా: శ్రీరామునిపై సినీ గీతాలు

ముఖచిత్రం: లక్ష్మీసేన్ ('నీతోడుకావాలి' ఫేమ్)

# ప్రయోజనవాక్యం

మీ సర్వతోముఖప్రతిభ, పత్రికలోని ప్రతీ అంశంలోనూ, ప్రతీ అక్షరంలోనూ ద్యోతక మౌతూ వుంది. హార్దికాభినందనలు. ఈనాడు ఇలాంటి సర్వాంగ సౌందర్యనవనవరసమయి పత్రికకి సంపాదకత్వం నెఱపడం, చాలా గొప్ప సాధన. చదువుతూ వస్తూ (పోతూ కాదు) వుంటే, అడుగడుగునా, ఒక సమగ్ర రసాత్మక కావ్యం చదువుతున్నామని అనిపించే తీరున, తీరుగా, ముచ్చటగా, రూపుదిద్దుకుంటూ ఉంది. మన 'హాసం', నవరసాల్లోనూ, కళలలోనూ ప్రధానా లైన హాస్య సంగీతాల సముచిత సమ్మేళనం విశిష్ట సంతోషదాయకమూ రసజ్ఞులందరినీ రంజిల్ల జేయగల వినూత్న పత్రికా రత్నం అని ఋజువు చేసేందుకు కావలసిన్న అన్ని రంగుల తోనూ, హంగులతో విరాజిల్లుతోందనేది పరమ సత్యం, నిర్వివాదాంశం. ఈ పత్రికలో మహా మహులతో బాటు ఈ చిన్న కళారాధకుడికి ఒకింత స్థలం అందిస్తున్నందుకు హార్దిక కృతజ్ఞతలు మస్తుగా శుభమస్తు!

**-కళాసేవాపరాయణ పరమాణువు**
**మీ పి.బి.శ్రీనివాస్**

నేనిప్పటికి 13 సంచికలు అందుకున్నాను. అప్పుడే ఆర్నెలు పరిగెట్టేశాయన్న మాట. ఇంత శ్రమపడి, ప్రత్యేక లక్ష్యంతో పత్రిక నడుపుతున్న వారి నుండి నా బోటి వాడు బేవార్స్‌గా కాపీని కొట్టేయడం క్షంతవ్యం కాదు కనుక....

తొలి సంచికతో ప్రారంభించి 24 సంచికలకు రెండు సంవత్సరాల చందా ఇందులో పంపు తున్నాను. అన్యధా భావించకండి.

-చలసాని ప్రసాదరావు, హైదరాబాద్

పాతతరం సినీప్రేక్షకులు, నేటితరం ప్రేక్షకులకు సినీజ్ఞానము అందజేస్తున్న పుస్తకం ఇది ఒక్కటే. సినీ రికార్డులు దాచినట్లు కొంత మంది భవిష్యత్తులో ఇవి మ్యూజియం లాగ భద్రపరచుకొంటారు. నాకోసం "శ్రీ వెంకటేశ్వర మహాత్యం" ఎన్.టి.ఆర్., జయసుధ నటించిన "ఇది నా హృదయం" అనే పాట సాహిత్యం, దానికి ఒనగూర్చిన సంగీత విశేషాలు గురించి వ్రాయ గలరు. ఇందులో వీణ బిట్టులు నాకు యిష్టం.

-వి.మోహన్‌బాబు, అవనిగడ్డ

ఇలా మందమైన అట్టతో ఆయిల్ పెయింట్ ముఖచిత్రంతో 'హాసం' ఎప్పటినుంచో రావాలని అనుకునే వాళ్లం. మీకు ఇంకా ఆర్థిక భారం కాగలదేమోనని ఆ అభీష్టం మనసులోనే ఉంచు కున్నాం. ఇన్నాళ్లికిలా ఉగాది సందర్భంగా కొత్త అందాలు 'హాసం' కనువిందు చేసింది!! కోదండ పాణి, ఏ.ఎం.రాజాగార్ల ఫోటోలు అప్పుడే మాకు "అపురూపసేకరణ" ఆల్బంలో భద్రపరుచు కున్నాం.

-నేమాని సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్

పెన్షనర్ల సమావేశం సందర్భంగా మీరు వ్రాసిన సంపాద కీయం నన్ను స్పందింప జేసింది. ప్రస్తుతం మా తమ్ముడి దగ్గర వుంటున్న (న్యూఢిల్లీ) మా అమ్మగారు ఎంతో అభిరుచికల మనిషి. "హాసం" పత్రికలో వస్తోన్న విషయాలు ఆమెను తప్పక సంతోష పెడతాయని నా విశ్వాసం. ఆ మేరకు "హాసం" ప్రారంభ సంచిక నుంచి పోస్టు ద్వారా పంపేలాగున సంవత్సరం చందా రూ. 200/-లు డి.డి. పంపుతున్నాను. తప్పక ఈ దిగువ చిరునామాకు తొలి సంచిక నుంచి "హాసం" పోస్టు ద్వారా పంపించ గలందులకు అభ్యర్థిస్తున్నాను. ఇంతకాలంగా విస్మరించినందుకు చింతి స్తున్నాను.

-ఎన్.వి.ఎస్.చలపతి, విజయవాడ

'హాసం' పత్రికని మొదట్నించి చదువు తున్నాను. పత్రికని 'సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దడం' అనే మాట 'హాసం' విషయంలో నిజం. ఉడ్‌హౌస్ కథలు తెలుగులో వెయ్యడం, 'క్లాసిక్ రీటోల్డ్' లాంటివి చాలా మంచి ప్రయోగాలు. కర్ణాటక సంగీతం, హిందుస్తానీ, లలిత, సినిమా పాప్ సంగీతాలను సమపాళ్ళలో అందించడం మీ విజ్ఞతకు నిదర్శనం. అన్ని శీర్షికల పేర్లు చాలా బాగున్నాయి. మహాసంగీత దర్శకులు శ్రీ ఇళయరాజా గారి గురించి మీరు ఇంతవరకు వెయ్యనే లేదు. బహుశా ఆయన పుట్టినరోజు సందర్భంగా వ్యాసం రాస్తారేమో! ఆయన సంగీతం సమకూర్చిన పాటలన్నీ దేనికవే సాటి. ఆయన చేసిన గొప్ప పాటల గురించి ఒక్కో సంచికలో ఒక్కో పాటను విశ్లేషిస్తూ రాస్తే అదొక గొప్ప గ్రంథంగా రూపుదిద్దుకోగలదని నా విశ్వాసం. దయచేసి ఈ విషయంగూర్చి ఆలోచించ గలరు.

మాలాంటి సంగీతాభిమానులకు కలిగే సందేహాలు 'ప్రశ్న-జవాబు' రూపంలో తీరిస్తే అందరికీ ఉపయోగకరంగా ఉంటుందని నా అభిప్రాయం. మీరు ప్రచురిస్తున్న సంగీతజ్ఞుల ఫోటోలు చాలా బావుంటున్నాయి.

-ఇ.బి.ఎస్.శర్మ, హైదరాబాద్

'హాసం' పత్రిక చదువుతుంటే అనిర్వచనీయ మైన అనుభూతి, అలౌకికమైన ఆనందము కలుగుతోంది. తెలుగు సినీ సాహి త్యానికి, సంగీతానికి మరియు హాస్యానికి సంబం ధించినటువంటి పత్రిక లేదే అని బాధపడుతున్న సమయంలో 'హాసం' పత్రిక రావడంతో ఆ కొరత తీరినట్లయింది. ఆ కొరత తీర్చినటువంటి మీకు ధన్యవాదాలు. ఈ పత్రిక 'ఇంతై, ఇంతింతై, వటుడింతై' అన్నచందాన సర్క్యులేషన్ పెరగాలి. తెలుగువాడు అన్న ప్రతివాడు తప్పక చదవాలి. చదివించాలి. ఈ పత్రిక నూరు వసంతాలు పూర్తి చేసుకోవాలని కోరుకుంటున్నాను.

ఈ పత్రికలో శీర్షికలు అన్నీ నచ్చినవే, అన్నీ మెచ్చినవే, వేటికవేసాటి. అన్నింటిలో కెల్లా నన్నాకట్టుకొన్న శీర్షిక 'లలితం'. లలిత సంగీతం గురించి, లలిత సంగీతజ్ఞుల గురించి, ఏ రాగంలో స్వరపరచబడిందో, నొటేషన్స్‌తో సహా 'శ్రీ చిత్తరంజన్'గారు వివరిస్తున్నారు. వారికి నా ధన్యవాదాలు. ఔత్సాహికులకు ఇది చక్కటి వరం.

-వి.శ్రీనివాసకుమార్, విశాఖపట్నం

మీ 'హాసం' నిత్యనూత్న భాసమానమై లో లోపల గిలిగింతలు పెడుతూ, ఆపలేక - ఆగలేక నవ్వుల వెల్లువలె పైకుబికి దుమికి - మల్లెపూల గుబాళింపులా అమ్మ ఆలనగా పాలనగా మమ్ము అలరింపచేయాలని ఆశిస్తూ ఆశీర్వదిస్తూ -మీ హాస సంగీత ప్రియుడు

-డా. ఈశ్వర వేణుగోపాల్, శ్రీకాకుళం

ఏ పత్రిలకలోనైనా పనికొచ్చే శీర్షికలు ఒకటో అరో వుంటాయి. ఏకంగా పుస్తకమే దాచుకోవాలి మరి... ఎన్ని పాత సినీమాల సంగతులు, సన్ని వేశాలు, రాగాలు, పాటలు, ఓహ్...సింప్లీ సూపర్బ్. నాఏభై మూడేళ్ల జీవితంలో ఒక పత్రిక బాగుందని మనస్ఫూర్తిగా నేను వ్రాయడం ఇదే ప్రథమం. ఆపాత మధురం, అర్థం చేసుకుందాం - ఆస్వా దిద్దాం, కామెడీ స్కిట్, సినీమా హ్యూమరథం చక్కని శీర్షికలు. గజాలా ముఖ చిత్రంలో ఆకర్షణీ యంగా వుంది. రచయితలకు మీరిచ్చే గౌరవం 'ఇలపావులూరి' వారి ద్వారా తెలిసింది. నేను వివిధ పత్రికలకు కథలు వ్రాసే రచయితనే ఒక మంచి రచన చేసి పరిశీలనలోకి రావాలని వుంది.

-కూర్మాన వెంకట సుబ్బారావు, విశాఖపట్నం

సంపుటి :1 సంచిక: 14

16 - 30 ఏప్రిల్ 2002

పేజీలు: 68 + 8

వెల : రూ. 10-00

సంవత్సర చందా : రూ. 200

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక 14

మేనేజింగ్ ఎడిటర్
ఎమ్బీయస్ ప్రసాద్

ఎడిటర్
రాజా

రిఫరెన్స్ కర్టెసీ
డా॥ కె.వి.రావు
జె.మధుసూధన శర్మ

హాస్యం, సంగీతం ద్వారా వ్యక్తిగతమైన మానసికమైన ఒత్తిడి తగ్గించడమే తమ లక్ష్యమని చాటుకుంటూనే "హాసం" తన లక్ష్యానికి కుటుంబం మొత్తాన్ని కేంద్ర బిందువుగా చేసుకుంది. కుటుంబంలోని సభ్యులందరూ ఆనందోత్సాహాలతో విలసిల్లాలని, ఒకరితో ఒకరు కలిసి తానందించే ఆరోగ్యదాయకమైన హాసోల్లాసాలను పంచుకోవాలని ఆకాంక్షించింది.

భారతీయ సంస్కృతికి మూలస్తంభమైన కుటుంబ వ్యవస్థను బలోపేతం చేసి, కుటుంబ సభ్యుల మధ్య పరస్పర అవగాహన, ప్రేమాభిమానాలను పెంపొందించే మార్గంలోనే "హాసం" పయనిస్తోందని నిరూపించే సంఘటన ఒకటి ఈ మధ్య జరిగింది.

"హాసం" 11వ సంచిక (మార్చి 1-15, 2002)లోని సంపాదకీయంలో వయోవృద్ధుల అభిరుచుల గురించి ముచ్చటిస్తూ ".... 'మాకు కావలసిన అంశాలతోబాటు నీకిష్టమైన సంగతులు కూడా ఈ పత్రికలో ఉన్నాయి , నీ కోసం కొనుక్కుతెచ్చానని ఇచ్చే కుర్రాళ్ళు ఎవరున్నారండీ ఈ రోజుల్లో" అంటూ నిట్టూర్చే పెద్దవారు కూడా కనబడుతున్నారు. ఇది నిజమే అయితే ఇంతకంటే దురదృష్టకరం మరొకటి ఉండదు. ఇంట్లోని పెద్దవారి అభిరుచులకు అనుగుణంగా ఉన్న వస్తువు. అది పత్రిక కానివ్వండి మరొకటి కానివ్వండి... కంటబడినప్పుడు కొని ఇవ్వని చిన్నవారి కోసం కష్టపడిన పెద్దవారి శ్రమ వృథా అయినట్లే లెక్క! అంతేకాదు తనకు నచ్చిన పత్రికను పది రూపాయలు పెట్టి కొనుక్కోలేని పరిస్థితిలోకి తమను తాము నెట్టుకోవడం కూడా ముందు చూపు లేకపోవడానికి నిదర్శనమే!...."అని వ్రాయటం జరిగింది.

మధ్యవయస్కులు, వృద్ధులు తమవాళ్ళకై త్యాగాలు చేసే క్రమంలో తమ అభిరుచులను పూర్తిగా త్యాగం చేయనవసరం లేదని, కనీసం తమకు నచ్చిన పత్రికలైనా కొనుక్కొనే సావకాశం ఉంచుకోవాలని ఉద్బోధించే దిశలో పై వాక్యాలు వ్రాయడం జరిగింది.. ఆ వర్గం వారు ఈ వాక్యాలకు ఎలా స్పందించారో తెలియదు కానీ ఒక తల్లి కుమారుడు మాత్రం వాటిని చదివి ఉత్తేజితుడయ్యాడు. తన బాధ్యతను గుర్తు చేసుకున్నాడు. ఢిల్లీలో ఉన్న తన తల్లి పేర చందా కడుతూ ఇంతకాలం ఆ ఆలోచన రానందుకు సిగ్గుపడుతూ, ఇప్పటికైనా ఈ ఆలోచన రగిలించినందుకు "హాసం"కు కృతజ్ఞతలు తెలుపుతూ ఉత్తరం కూడా వ్రాశారు.

పాశ్చాత్య సమాజంలో తల్లిదండ్రులను దూరంగా ఉంచి అప్పుడప్పుడు గుర్తుకువచ్చినప్పుడు ఫోన్ చేసి యోగక్షేమాలు కనుక్కోవడమే సంతానం చేసే పని. ఓ ఏడాది మదర్స్‌డేకి ఒక ఫోన్ కంపెనీ వారు ఒక అడ్వర్టయిజ్‌మెంట్ ప్రచురించారు. - ఫోన్ పక్కనే ఆశగా ఎదురు చూస్తూన్న ఒక వృద్ధ మహిళ ఫోటో. "మీ తల్లి మీ ఫోన్‌కాల్ కోసం ఎదురు చూస్తోంది' అనే వ్యాఖ్య! అంతే! ఆ ప్రకటన ఎంతో మంది కుమారులను, కుమార్తెలను కదిలించింది. వెంటనే ఫోన్ వద్దకు పరిగెట్టి తమ తల్లిదండ్రులకు ఫోన్ చేసేశారు. ఆ ప్రకటన వేయడంలో టెలిఫోన్ కంపెనీ వారి వాణిజ్య ప్రయోజనం ఉండి వుండవచ్చు. కానీ ఎందరో తల్లిదండ్రులు మాత్రం దాని వల్ల లాభపడ్డారు. పిల్లల నుండి పిలుపునందుకుని ఆనందపడ్డారు.

అదేవిధంగా ఈ పాఠకుడి తల్లికూడా తప్పక సంతోషపడతారు. తన అభిరుచుల గురించి, తన అభీష్టం గురించి సంతానం పట్టించుకుని, కార్యాచరణకు ఉపక్రమించినందుకు ఒక మాతృమూర్తి అనుభవించే పులకింతకు "హాసం" సంపాదకీయం కారణభూతమైనదని అనుకుంటూ ఉంటే మాకు ఆనందంగా ఉంది. "హాసం" నచ్చిన ఒక పాఠక సోదరుడు తన సోదరికి, ఒక మరిది తన వదినకు నిస్సంకోచంగా సిఫార్సు చేయడం ఇంతకుముందే మా అనుభవంలోకి వచ్చినా ఈ తాజా సంఘటన మమ్మల్ని హర్షాశ్చర్యాలలో ముంచెత్తుతోంది. కుటుంబ వ్యవస్థకు దోహద పడుతున్నందుకు కించిత్తు గర్వపడేలా చేస్తోంది.



థాంక్యూ!!

HAASAM HAASYA SANGEETHA PATHRIKA
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 383 1388 / 657 0215

Printed and Published by:
K.I.Varaprasad Reddy
on behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018
Fax: 040-3541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82



# ఉందిలే మంచే కాలం ముందు ముందునా...



-సూరేపల్లి విజయ

2010వ సంవత్సరం

ట్రింగ్... ట్రింగ్

మాంచి నిద్రలో వున్న గోపాలకృష్ణకు ఒళ్ళు మండింది.

మళ్ళీ "ట్రింగ్... ట్రింగ్"

"హేవండీ.. బయటెవడో గన్నాయ్‌గాడు కాలింగ్ బెల్ నొక్కి నా నిద్ర చెడగొడుతున్నాడండీ... కాస్త చూడరూ!?" గోముగా అడిగింది నీరజ.

"ఖర్మ..... ఆడవాళ్ళయితే ఇదో అడ్వాంటేజి... అర్ధరాత్రి తలుపు తీసే డ్యూటీ నుంచి తప్పించుకోవచ్చు.....! హుఁ దేనికైనా పెట్టిపుట్టాలి" అను కుంటూ లేచివెళ్ళి తలుపు తీశాడు గోపాలకృష్ణ.

ఎదురుగా ప్రసాదబాబు.

తన భార్యకు స్వయాన అన్నయ్య, ఆ వెనకే అతగాడి భార్య.

"నువ్వా బావా?" అన్నాడు గోపాలకృష్ణ ఏ ఎక్స్‌ప్రెషనూ మొహం మీద కనిపించకుండా జాగ్రత్త పడుతూ.

"అదేంటి బావా ముఖంలో ఆ ఫీలింగేంటి!? నేను కాకుండా బందిపోటు దొంగలెవరైనా వస్తారని ఎక్స్‌పెక్ట్ చేసావా?? లేకుంటే నేనే బందిపోటు దొంగలా కనిపించానా???"

"ఛ... ఛ.... అవేం మాటలు బావా... రారా" అన్నాడు గుమ్మానికి అడ్డంగా నిలబడే.

"నువ్వు గుమ్మానికి అడ్డంగా నిలబడి పిలుస్తున్నావు బావా?" ప్రసాదబాబు గుర్తు చేయడంతో పక్కకు తప్పుకొని వాళ్ళకు దారి యిచ్చి వాళ్ళకు ఓ గది చూపించి మళ్ళీ తన పడగ్గదిలోకి వెళ్ళాడు గోపాలకృష్ణ.

** ** **

భర్త అడుగుల శబ్దం విని కళ్ళు తెరవకుండానే "ఏ గన్నాయ్ గాడు డియర్?" అని అడిగింది నీరజ.

"గన్నాయ్‌కి స్త్రీ లింగం ఏంటి?" భార్యని అడిగాడు గోపాలకృష్ణ

"ఇప్పుడా ప్రశ్న అంత అవసరమా డియర్... గన్నాయిని అనుకుంటా"

అప్పుడెప్పుడో తన తరపు వాళ్ళు వస్తే తన భార్య చేసిన సత్కారం గుర్తొచ్చి "వచ్చింది అన్నయ్య గన్నాయ్‌గాడు, మీ వదిన గన్నాయిని " అన్నాడు గోపాలకృష్ణ అక్కసుగా-

వెంటనే దుప్పటి గిరాటేసి, మొహాన్ని ఫ్లోరోసెంటు బల్బులా చేసేసుకుని "నిజమా" అంది నీరజ... గెస్ట్ రూంలోకి పరుగెడుతూ.

** ** **

కుశల ప్రశ్నలయ్యాక

"ఏంటి బావా.... ఏంటీ విశేషాలు?" అడిగాడు గోపాలకృష్ణ

"అంటే ఎందుకొచ్చారనేగా!?" బుంగమూతి పెట్టి అడిగి - తనే చెప్పాడు ప్రసాదబాబు "టాంక్‌బండ్... చార్మినార్... బిర్లామందిర్ చూద్దామని".

"హు..... సిటీకొచ్చి యిన్నేళ్ళయినా నేనే చూడ్లేదు" మనసులో అనుకొని పైకి మాత్రం "అలాగే బావా రేపుదయాన్నే చూద్దాం" అన్నాడు గోపాలకృష్ణ

దుబాయ్ నుంచి పదేళ్ళ తర్వాత



రచయితల సహనాన్ని పరీక్షించే పత్రికలే ఎక్కువగా ఉన్న ఈ టైములో, రచయితల కలం చివర దరహాసాన్ని ఒలికించి, కథా విలాసాన్ని బయటికి రప్పించి, హాస్యా కథా కాలక్షేపాన్ని సృష్టించి, ఆరోగ్యరహస్యాన్ని ఔపాసన పట్టి, మనసారా నవ్వుకునే, లవ్‌లీ కథలను రాసేవారి నుంచి రాబట్టే 'హాసం'కు... "పత్రికలను నమ్ముకోవటం వేస్టు" అనుకునే రచయితలు ఎంతైనా థాంక్స్ చెప్పవలసిందే.


**-సూరేపల్లి విజయ**

**1-9-12/3/హెచ్,**

**అజంపురా, మెదక్**

హైదరాబాద్‌కు వచ్చారా దంపతులు.

** ** **

"ఒరే అన్నయ్యా.. త్వరగా ఒళ్ళు తుడుచుకో, బయల్దేరాలి."

''ఒళ్ళు తుడుచుకోవడమేంటి?'' అయోమయంగా అడిగి "కొంపదీసి తెలుగుభాష మరిచిపోయావా?'' అన్నాడు.

"నేను కరెక్టే అన్నాను. ముందు పళ్ళు తుడుచుకో టిఫెన్



చేద్దావుగానీ ఆ తర్వాత, ఒళ్ళు తుడుచుకో.... అలా ఫ్రెష్షప్పయి బయటకు వెళ్ళొచ్చు".

"అదేంటి బ్రష్ చేసుకోకుండా పళ్ళు తుడుచుకోవడం ఏంటి అసయ్యంగా... త్వరగా నీళ్ళు సిద్ధం చెయ్..."

"బ్రష్ చేసుకోవడమా....!? నీళ్ళు సిద్ధం చెయ్యాలా....!?'' అంటూ నవ్వడం ప్రారంభించింది నీరజ.

చెల్లెలుకు పిచ్చిగానీ ఎక్కిందేమోనని డౌటొచ్చింది ప్రసాదబాబుకి.

అలా నవ్వి నవ్వి ఏడ్చేసిందామె.

వెంటనే గోపాలకృష్ణ గదిలోనుంచి బయటకు వచ్చి కంగారుగా తన భార్య భుజాలు కుదిపి "రిలాక్స్.... రిలాక్స్... నీరూ.... కాదు, కాదు... నీరజా" అంటూ తన బావ వైపు కోపంగా చూసి "ఎంత పన్జేసావ్ బావా" అన్నాడు.

"నేనేం చేసాను బావా" అయోమయంగా అడిగాడు ప్రసాదబాబు.

"ఏం చేసానని మెల్లగా అడుగుతున్నావా? పెళ్లయిన దగ్గర్నుంచీ ముద్దుగా పిలుచుకునే 'నీరూ' అనే పిలుపు మానేసి, నీరజా అని ఫుల్లు పేరుతో పిలుస్తున్నానే! ఆ మాత్రం అర్థం చేసుకోలేవా బావా?"

ఎప్పుడో మరిచిపోయిన విషయాన్ని గుర్తు చేసావు"

"మరిచిపోయిన విషయమేమిటి... నేను గుర్తు చేయడమేంటి?"

"నీళ్ళు... అని గుర్తు చేయ లేదూ!?"

"నీళ్ళంటే... తప్పేంటి?"

"పదేళ్ళుగా నీళ్ళకు మేమెంత మొహం వాచి వున్నామో, దుబాయ్‌లో వుండి యివ్వాళొచ్చిన నీకేం తెలుస్తుందిలే.

'అదేంటి... పదేళ్ళ క్రితం నేను యిక్కడికి వచ్చినప్పుడు బాగానే వుందిగా".

"అప్పుడు వేరు....వేరుతో సహా చెట్లను నరికేసారు. నీళ్ళని ధారాళంగా వృధా చేశారు. నీటి నిల్వలు తగ్గిపోయాయి. రెండ్రోజులకోసారి మంచి నీళ్ళు వదిలే అలవాటుని మెల్లమెల్లగా నాల్రోజులు చేశారు ... తర్వాత వారం రోజులు... యిప్పుడు నెలరోజులకోసారి వదులుతున్నారు నీళ్ళు."

''నెలరోజులకోసారా!?'' ఆశ్చర్యంగా అడిగాడు ప్రసాద్‌బాబు.

"అవును బావా.... కడుపు చించుకుంటే... నీళ్ళ మీద... సారీ కాళ్ళమీద పడుతుందని...



"హైదరాబాదుకి కృష్ణానది నుండి నీళ్లు తేవాలా, గోదావరి నుండి తేవాలా అని వాదించుకునేవారు... ఇదివరకు. ఇప్పుడా గొడవ లేమీ లేవులే. కృష్ణలోనూ నీళ్లు లేవు. గోదావరిలోనూ లేవు. సముద్రాలలో కాస్త మిగిలి వుంటే, జనాలంతా అక్కడికే వలసపోయి నీళ్లు చూసి తృప్తిపడు తున్నారు. డబ్బున్న వాళ్లు వాటర్‌ఫాల్స్ ఆయిల్ పెయింటింగ్స్ గోడల మీద వేయించుకుని రోజూ కాస్సేపు వాటికింద కూచున్నట్టు ఫీలవుతున్నారు".

"మరి మీరు స్నానం... వగైరా.. వగైరా..!?"

"స్నానమా.... అదెలా చేస్తారు!?" విరక్తిగా అడిగాడు గోపాలకృష్ణ.

అప్పుడు గమనించాడు ప్రసాదబాబు-

గోపాలకృష్ణ తలంతా పాయలు పాయలుగా అట్టలు కట్టి వుండడాన్ని! వెంటనే కెవ్వున కేకవేయబోయి, ఆపుకొని చెల్లెల్ని చూసాడు. యించుమించు ఆమె పొజిషన్ కూడా అంతే!

"ఇన్నిరోజులుగా స్నానం చేయకున్నా ఎలా మేనేజ్ చేయగలుగుతున్నారు బావా?" అడిగాడు ప్రసాదబాబు యింకా షాక్‌లో నుంచి తేరుకోకుండానే

"ఇలా...." అంటూ ఓ షెల్ఫ్ దగ్గరికి తీసుకెళ్ళి డోర్ ఓపెన్ చేసి చూపించాడు గోపాలకృష్ణ.

లోపల రకరకాల పెర్‌ఫ్యూమ్స్ వున్నాయి.

"రోజుకో స్ప్రే బాటిల్ కొట్టుకుంటాం"

నీరజ కిలకిలా నవ్వుతూ "నేను నీళ్ళోసుకుని మూడు నెలలవుతుందోచ్" అంది.

ఈసారి వామ్టింగ్ సెన్సేషన్ ప్రసాదబాబుకు వచ్చింది.

"నెలకోసారి పంపులో నీళ్ళు వచ్చినప్పుడు తడిగుడ్డతో వళ్ళంతా తుడుచుకుంటాం" నవ్వుతూ చెప్పాడు గోపాలకృష్ణ.

"హ్వావండీ... మనిమిప్పుడు స్నానం చేయడమెలా?'' భయంగా అడిగింది ప్రసాద్‌బాబుని అతని భార్య.

"అసలు పళ్ళు తోముకోవడం ఎలా అని నేను ఆలోచిస్తుంటే నీ సొదేంటి? మనం ఇండియా వస్తున్న హడావిడిలో ఏమీ గమనించలేదు. అసలు ప్రజల అవతారం ఎలా వుందో చూడాల్సిందే" అన్నాడు ప్రసాదబాబు - అతనికి కొత్త విషయాలు కనుగొనడమంటే బోల్డు సరదా.

పేస్ట్‌తో పళ్ళ మీద రాసుకొని, ఆ తర్వాత ఓ గుడ్డతో వళ్ళని తుడుచుకొని, బ్రషింగ్ అయిపోయిందనిపించాడు.

పెరట్లో ఎలుకలు చచ్చిన కంపుకొడితే ఏంటా అని చూసేడు.

విడిచేసిన బట్టలు... మళ్ళీ 'వాక్' అంటూ వామ్టింగ్ సెన్సేషన్ వచ్చేసింది.

"అబ్బ! ఇదేంటీ అయిదు నిమిషాలకోసారి నాకు.... వాక్... వామ్టింగ్ సెన్సేషన్ వస్తోంది" అంది ప్రసాదబాబు భార్య.

ఈలోగా గోపాలకృష్ణ టిఫెన్ చేయమంటూ పిలిచాడు.

** ** **

డైనింగ్ టేబుల్ దగ్గర ప్లేటులో ఉప్మాను చూసి

"యిదేంటి యిలా వుంది?" అడిగాడు చెల్లెల్ని ప్రసాద్‌బాబు - ఉప్మా కన్నా ముందు, ఖంగుతింటూ

"పాలతో ఉడికించాం... నీళ్ళు కరువుగా... హ్హిహ్హిహ్హి" అందామె.

చట్నీ చూసి షాకయ్యాడు.

"పాల చట్నీ" అంది మళ్ళీ 'హ్హిహ్హిహ్హి' అని నవ్వి.

"భయపడకు. ప్యూర్ మిల్క్, కల్తీ చేయడానికి నీళ్లు లేవుగా" అని హామీ కూడా ఇచ్చింది.

"అన్నం కూడానా?" భయంగా అడిగాడు.

"అన్నీను".

అతి కష్టమ్మీద ఉప్మా తిని... "దాహం" అన్నాడు.

వెంటనే గోపాలకృష్ణ లోపలికి పరుగెత్తి ఓ టాబ్లెటు తీస్కొచ్చి యిచ్చాడు.

"యిదేంటి?"

"దాహం వేసినప్పుడు ఈ టాబ్లెట్ మింగితే, మంచి నీళ్ళు తాగిన ఎఫెక్ట్ యిస్తుంది. స్పెషల్ ఎఫెక్ట్ అన్నమాట. ఒక్కో టాబ్లెట్ రెండున్నర రూపాయలు. మాకు రేషన్‌లో రూపాయి పావలాకు దొరుకుతుంది. ఆఫీసుకు వాటర్ బాటిల్‌కు బదులు ఈ టాబ్లెట్లు తీసుకెళ్తాం."

"అన్నయ్యా, లోభికి ఖర్చెక్కువ, దరిద్రుడికి ఆకలెక్కువాని మా ఆడపడుచు మొగుడు లేడూ ఆయనకు ఎక్కిళ్లరోగం. అవేం మాయ ఎక్కిళ్లో నీళ్లు తాగితేనే గానీ పోవు. పిసినారిలే. టాబ్లెట్లతో పోతుందేమోనని ఆశపడి ఐదారు మింగుతాడు. అబ్బే, అవీ మింగాలి. పైగా నీళ్లూ తాగాలి. గొల్లుమంటాడు. చూసి తీరాలి ఆయన ఏడుపు" నీరజ పగలబడి నవ్వుతూ చెబుతోంది. కానీ ప్రసాదబాబు అవన్నీ వినేస్థితిలో లేడు. ఏం వినాలసివస్తుందోనని భయపడుతూనే చెల్లెల్ని అడిగేడు.

"బట్టలెలా ఉతుక్కుంటారు?"

"ఉతుక్కోవడమేంటి? స్ప్రే చల్లి వేసుకుంటాం. మూడు నెలలకోసారి... ఉతుక్కుంటాం."

మళ్ళీ "వాక్"... అనుకున్నాడు ప్రసాద్‌బాబు.

ఆ రోజు హైదరాబాద్ అంతా చూపించాలని సెలవు పెట్టారు గోపాలకృష్ణ దంపతులు.

** ** **

"ఇదేంటి.... యిక్కడ హుస్సేన్ సాగర్ వుండాలి.... కనిపించదేం!?" టాంక్‌బండ్ దగ్గరికి వచ్చాక అడిగాడు ప్రసాదబాబు.



పది నిమిషాల సేపు పగలబడి నవ్వి- "అటు చూడు..." అంటూ చూపించాడు గోపాలకృష్ణ.

"అర్రె... బుద్ధ విగ్రహం... హుస్సేన్‌సాగర్ మధ్యలో కదా బుద్ధ విగ్రహం... యిదేంటి చుట్టూ కార్లు, బస్సులు, స్కూటర్లు వున్నాయి...!?" మరింత ఆశ్చర్యంగా అన్నాడు ప్రసాదబాబు.

"దుబాయ్‌కి వెళ్ళొచ్చాక బావగారు చిలిపిగా తయారయ్యారు. హుస్సేన్‌సాగర్‌లో నీళ్ళు ఎప్పుడో యింకిపోయాయి. దాన్నిప్పుడు షాపింగ్ కాంప్లెక్సులుగా, స్కూటర్, కార్ల పార్కింగ్ ప్లేస్‌గా మార్చారు".

సరిగ్గా అప్పుడే ముక్కుపుటాలు అదిరే దుర్గంధం మొదలైంది.

"మరి ఉస్మాన్‌సాగరు, హిమాయత్‌సాగరు..."

"ఆ సాగరాలలో గరంగరంలు తప్ప వేరేమీ లేవు. నెల్లాళ్ళకయినా నీళ్లివ్వాలని కాసిన్ని అట్టేపెట్టారు. దరిదాపులకు పోనీయరు. మైలు దూరం నుంచే సెక్యూరిటీ. చూడాలనుకుంటే గోల్కొండలో ఏర్పాటుచేసిన టెలిస్కోపు ద్వారా అక్కడి నీళ్లు చూడవచ్చు".

"సరిగ్గా నేను పది సంవత్సరాల క్రితం వచ్చినప్పుడు టాంక్‌బండ్ దగ్గర హుస్సేన్‌సాగర్ కంపు కొట్టినట్టే వుంది ఈ కంపు" అన్నాడు ప్రసాదబాబు.

"ఎగ్జాట్లీ... కాకపోతే చిన్నతేడా.... అది హుస్సేన్‌సాగర్ కంపు.... యిది నీళ్ళు లేకపోవడం వల్ల జనాలు ఏ ఆరు నెలలకో ఓ సారి స్నానం చేయడం వల్ల వచ్చే కంపు".

అప్పుడు గమనించాడు ప్రసాద్‌బాబు.

మురికి బట్టలు, జడలు జడలుగా కట్టిన జుట్టు ఉన్నవాళ్లు కొందరైతే - ఆ బాధ భరించలేక, ఆడా, మగా తేడా లేకుండా, గుండ్లు కొట్టించుకున్న వాళ్ళు వారు ఇంకొందరు.

** ** **

చార్మినార్ దగ్గరికి వెళ్ళారు గోపాలకృష్ణ, ప్రసాదబాబు దంపతులు.

పది నిమిషాలు గడిచాయ్ లేదో - పెద్ద అరుపులు, జనం కకావికలై పరుగెడుతున్నారు.

ప్రసాదబాబుకు బి.పి. రెయిజైంది

"బావా.... పరుగెత్తూ.. పాతబస్తీ గొడవలేమో కర్ఫ్యూ పెడతారేమో" భయంగా పారిపోతూ అరిచాడు ప్రసాదబాబు.

గోపాలకృష్ణ మరోసారి కిలకిలా నవ్వాడు. ఆ నవ్వుతో శృతి కలిపింది నీరజ.

"మతకల్లోలాలు.... గొడవలు చూస్తుంటే మీకు నవ్వులాటగా వుందా?" అన్నాడు ప్రసాదబాబు - ఆగి - మొహం చిన్నబుచ్చుకొని.

"అయ్యో బావా... హైదరాబాదులో మత కలహాలు ఎప్పుడో అంతరించాయి. యివి నీటి కలహాలు... ఈ మూడు నెలల తర్వాత యివ్వాళ ఈ ఏరియాలో నీళ్ళొస్తున్నాయి. ఈ నీళ్ళ గొడవలో ఓ పాతికమందైనా చస్తారు. యిది చాలా కామన్" చెప్పాడు గోపాలకృష్ణ.

తర్వాత ఓ హోటల్‌కు వెళ్తే పాలతో చేసిన ఇడ్లీ చట్నీ పెట్టారు. మంచినీళ్ళకు బదులు కలరా వుండల టైపులో ఉన్న గోళీలు ప్లేట్లలో పెట్టారు.

** ** **

అతి కష్టమ్మీద రెండ్రోజులు గడిచాయి.

ప్రసాదబాబుకు, అతని భార్యకు పిచ్చెక్కింది. బట్టలన్నీ మాసిపోయాయి. సరేనని కొత్తబట్టలు వేసుకున్నారు. పళ్ళు తోముకొని, కాగితాలతో తుడుచుకుంటున్నారు.

మొహం కడుక్కోవాలంటే ఎండలో నిలబడి, చెమట పట్టాక నబ్బురాసి, కర్చీఫ్‌తో తుడుచుకోవాలి. దాహం వేస్తే టాబ్లెట్ వేసుకోవాలి. పాలతో ఉడికించిన అన్నం, పాలతో తయారు చేసిన టిఫిన్లు.

ఇవన్నీ చాలనట్టు ఆ రాత్రి గోపాలకృష్ణ దంపతుల సంభాషణ వారి చెవిన పడింది.

"ఇదేమిటి నీరజా.... మీ వదిన 'ఏకాదశికి పూజ' చేయాలి. తలంటు పోసుకుంటానంటుంది. గుళ్లో శివుడికే అభిషేకాలు ఆపేశారు కదా. ఆ మాత్రం అర్థం చేసుకోదేమిటి?" అంటున్నాడు గోపాలకృష్ణ

"మీ చెల్లెలు మాత్రం తక్కువ తిందా? ఇక్కడికి వచ్చినప్పుడు పుట్టిన రోజంటూ తలంటు పోసుకుంటానని గోల పెట్టలేదూ? దుబాయ్‌లో రెండు పూట్లా స్నానం చేసే అలవాటు మా వదినది..."

"అంత అలవాటయితే సముద్రతీరాన్న ఓ గెస్ట్ హవుస్ కట్టమను. మనమూ వెళ్లి హాయిగా వారానికోసారి స్నానం చేసి వద్దాం. ప్రస్తుతానికి మాత్రం మన వల్లకావటం లేదు."

"మీరేం చెప్పనక్కరలేదు. ఇంట్లో టాబ్లెట్లు అయిపోవడం వదిన గ్రహిస్తూనే ఉంది. ఎప్పుడో ఒకప్పుడు వాళ్లే వెళ్లిపోతారు."

** ** **

"బావా... దుబాయ్‌కి... హ్హిహ్హిహ్హి.... ఎప్పుడు వెళ్తారు" అడిగాడు గోపాలకృష్ణ నిర్మొహమాటంగా.

"అప్పుడే అంత చేదయ్యామా.... సర్లే... బావా... మేమే వెళ్దామనుకున్నాం" అన్నాడు ప్రసాదబాబు

"ఏమనుకోకు బావా... మా పరిస్థితి అలాంటిది" అన్నాడు గోపాలకృష్ణ

అప్పటికే వాటర్ టాబ్లెట్స్ బోల్డు ఖర్చయ్యాయి.

** ** **

మర్నాడే దుబాయ్‌కి ఫ్లయిట్‌లో వెళ్ళిపోయారు ప్రసాదబాబు దంపతులు.

వాళ్ళు వెళ్ళిపోయాక బీరువాలో దాచుకున్న ఒకే ఒక వాటర్ బాటిల్ తీసి తనివి తీరా నాలుగు చుక్కల నీళ్ళు తాగారు గోపాలకృష్ణ దంపతులు.



## మార్చి 30న మరణించిన ఆనంద్ బక్షీకి నివాళిగా...



# గన్ వదలి పెన్‌తో అద్భుతాలు సాధించిన ఆనంద్ బక్షీ

జననం : 1920లో, రావల్పిండి (ప్రస్తుతం పాకిస్తాన్)లో, బ్యాంక్ మేనేజరు కుటుంబంలో

18వ యేట ఫీల్డ్ టెలిఫోన్ ఆపరేటర్‌గా ఆర్మీలో ప్రవేశం

దేశ విభజన సమయంలో కుటుంబం భారత్‌కు తరలివచ్చేసింది.

చిత్ర రంగ ప్రవేశం : మాస్టర్ భగవాన్ "బద్లా" (1943) చిత్రానికి సినేరిస్టుగా

కానీ సినిమారంగంలో కావల్సినంత పని దొరక్క మళ్ళీ ఆర్మీలో చేరి 1955 వరకు పని చేశారు.

సినీ రంగ పునః ప్రవేశం భగవాన్ "భలా ఆద్మీ" (1958)తో, ఈ సారి గీత రచయితగా

ఎన్ని రాసినా "అమర్ ప్రేమ్" (1972) తన ఉత్తమ చిత్రమనీ ముఖ్యంగా 'చింగారీ కోయీ భడ్‌కే' ఉత్తమ గీతమని అంటారాయన

"మోమ్ కీ గుడియాఁ" (1972) లో రెండు పాటలు కూడా పాడారు.

కొందరి గురించి వ్రాయడానికేమీ ఉండదు. కొందరిగురించి ఎంత రాసినా తరగదు. రెండో కోవకి చెందిన గొప్ప కళాకారుడు కీ॥శే॥ ఆనంద్ బక్షీ. ఆయన చక్కని కవి. అయినా కళాకారుడని ఎందు కంటున్నానంటే... జీవితాన్ని మలుచుకునే కళ ఆయనకి తెలుసు. రావల్పిండి (పాకిస్తాన్)లో జన్మించి రాయల్ ఆర్మీలో చేరి పార్టిషన్ తరవాత ఇండియాలో స్థిరపడి... 'గన్' వదిలి 'పెన్'తో అద్భుతాలు సాధించిన అరుదైన వ్యక్తి ఆనంద్. ఉత్తర-దక్షిణ సినీధృవాల్ని 'గీత' కారుడి కళ్ళతో చూడాలంటే సరిగ్గా పోల్చదగినవారు ఇద్దరు కనపడతారు. అటు ఆనంద్‌బక్షీ అయితే ఇటు వేటూరి. ఇద్దరూ ఇద్దరూ. వైవిధ్యానికి మారుపేర్లు. వారి కలం బలం అనంతం... శైలి అద్భుతం... ఆనంద్‌బక్షీ గారి గురించి వ్రాస్తూ వేటూరిగారి సంగతి ఎందుకు తీసుతెచ్చానంటే హిందీలో ఆయన వేటూరి. తెలుగులో వేటూరిగారు ఆంధ్రా ఆనంద్‌బక్షీ. ఒక రికార్డింగ్ కోసం ముంబైవెళ్ళినప్పుడు ఆనంద్‌బక్షీ గారినీ ఇందీవర్ గారినీ కలవటం జరిగింది. వారితో కొంతసేపు మాట్లాడే మహద్భాగ్యం లభించింది. మాట్లాడుతూ మాట్లాడుతూ 'ఆప్ కా వేటూరీ జీ కైసా హై' అని అడిగారు.



| ఆనంద్‌బక్షీ గీతాలలో కొన్ని | చిత్రం | సంగీతం | గానం |
|---|---|---|---|
| జిస గలీమే తెరా ఘర్ నహో బాల్మా... | కటీపతంగ్ | ఆర్.డి. బర్మన్ | ముఖేష్ |
| రామ్ కరే ఐసా హోజాయే... | మిలన్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్ |
| సావన్‌కా మహీనా... పవన్ కరేషోర్... | మిలన్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్ |
| ముబారక్‌హో సబ్‌కో సమాయే సుహానా... | మిలన్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్ |
| చాంద్ ఆహేఁ భరేగా... హులెదిల్ థామ్ లేంగే... | ఫూల్ బనే అంగారే | కల్యాణ్‌జీ, ఆనంద్‌జీ | ముఖేష్ |
| హంతో తేరే ఆషిక్ హై సదియోం ప్రరానే... | ఫర్జ్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్, లతా |
| ధీరే ధీరే బోల్ కోయీ సున్ - నాలే... | గోరా ఔర్ కాలా | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్, లతా |
| జెహమ్ తుమ్ చోరీ సే... | ధర్తీ కహే పుకార్ కే | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | ముఖేష్, లతా |
| ప్యార్ భరీ ఇక్ బాత్ చలీ... | ఇష్క్‌పర్ జోర్ నహీ | యస్.డి. బర్మన్ | ఆశాభోంస్లే |
| కిసీనా కిసీ సే హోగీ ముహబ్బత్... | ఇష్క్-ఇష్క్-ఇష్క్ | ఆర్.డి. బర్మన్ | ఆశాభోంస్లే |
| ఏదునియా వాలే పూఛేంగే... | మహల్ | ఆనంద్‌జీ, కల్యాణ్‌జీ | కిశోర్, ఆశాభోంస్లే |
| దమ్ మారో దమ్... | హరే కృష్ణ హరే రామ్ | ఆర్.డి. బర్మన్ | ఆశాభోంస్లే |
| మెహందీ లగే మేరేహాత్‌రే... (1962 బినాకా టాప్) | మెహందీ లగే మేరే హాత్ | ఆనంద్‌జీ, కల్యాణ్‌జీ | లతా |
| మేరే మెహబూబ్ కయామత్ హోగీ... (బినాకా టాప్) | మిస్టర్ ఎక్స్ ఇన్ బాంబే | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | కిశోర్ |
| పర్‌దేశి యోంసే నా అఖియా మిలానా (బినాకా టాప్ 182 పాయింట్స్) | జబ్ జబ్ ఫూల్ ఖిలే | ఆనంద్‌జీ, కల్యాణ్‌జీ | రఫీ |
| మేరే దుష్మన్ తూ మేరీ దోస్‌తీకో తరసే | ఆయేదిన్ బహార్‌కే | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | రఫీ |
| దిల్‌మిల్... ప్యార్ ద్వార్ మైక్యా జానూరే | షాగిర్ద్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | లతా |
| ఆ మేరీ హంజోలీ ఆ | జీనే కీ రాహ్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | రఫీ, లతా |
| ఏక్ తేరా సాథ్ హంకో దో జహాఁ సే ప్యారా హై | వాపస్ | లక్ష్మీకాంత్ -ప్యారేలాల్ | రఫీ, లతా |
| తుమ్ బిన్ జీవన్ కైసే జీవన్ | అనిత | లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ | మన్నాడే |
| ఏ... దోస్‌తీ... హం నహీ ఛోడేంగే... | షోలే | ఆర్.డి. బర్మన్ | కిశోర్, మన్నాడే |
| శామ్‌ఢలే జమునా కినారే... కినారే... | పుష్పాంజలి | లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ | మన్నాడే |
| గోరీ తేరీ పాంజనియా... | మెహబూబా | ఆర్.డి. బర్మన్ | మన్నాడే |
| అభీతో హాథ్‌మే జామ్ హై... | సీతా ఔర్ గీతా | ఆర్.డి. బర్మన్ | మన్నాడే |

ఆయన వేటూరి గారి గురించి అడగటం విని మనస్సు పులకించింది. ఆ ఆనందంలో కొన్ని వేటూరిగారి పల్లవులు హిందీలోకి ట్రాన్స్‌లేట్ చేసి చెప్పాను. రచయితకి తప్పని సరిగా ఉండవలసినది 'డిసిప్లిన్'. క్రమశిక్షణకి ఆయన మారుపేరు. అడిగిన వెంటనే పదినిముషాల్లో అద్భుతమైన పాట వ్రాసి ఇవ్వటం ఆనంద్ బక్షీ గారికే చెల్లింది. ఒకపక్క మజ్రూ... మరోపక్క షకీల్... ఇంకోపక్క హస్రత్ - శైలేంద్ర-రాజేంద్రకిషన్ లాంటి ఉద్దండులున్న టైమ్‌లో తుఫాన్ లా దూసుకొచ్చిన ఘనత ఆయనది. ఏ పాటకి ఆపాటే. ఒక టైమ్‌లో 'ఆషామాషీ' పాటలు రాసే రచయిత అని కొందరు పెద్దలు నొసలు విరిచినా వారే ఆయన్ని 'శభాష్' అని మెచ్చుకునేటట్లు చేసిన పట్టుదల బక్షీ గారిది.

చాలా సినిమాలు కేవలం ఆయన సాంగ్స్ వల్లే హిట్ అయ్యాయి. ఓ రచయితకి ఇంతకంటే ఎవార్డు ఏముంటుంది...!?

ఎ.బి. గార్కి స్నేహంతో కట్టిపడేసి వారి గీతాల్ని మక్కువతో ఎక్కువగా మలిచింది లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ గార్లు. వారి తరవాత కల్యాణ్‌జీ, ఆనంద్‌జీలు. అందరికీ పాటలు వ్రాసినా కొందరి దగ్గరే అవి స్వాతి ముత్యాలౌతాయి. మొదట్లో చెప్పినట్టు ఆనంద్‌బక్షీ గురించి ఎంత వ్రాసినా తరగదు...

ఈ సంగీత పయనం ఎన్నటికీ సశేషమే...

లాబీలు లేకుండా స్వశక్తితో మహోన్నత శిఖరాలు అధిరోహించిన ఆనంద్ బక్షీ జీవితం... ప్రతి యువగీత రచయితకీ ఓ ఆదర్శం కావాలని మనస్ఫూర్తిగా కోరుకుంటూ - వారి ఆత్మకి శాంతి కలగాలని భగవంతుడ్ని ప్రార్థిస్తూ వారి పాటలు మచ్చుకి కొన్ని మీకు గుర్తుచేస్తూ...



మీ
**భువనచంద్ర**



## 16-31 మార్చి 2002లో శ్రీ యం.వి.యస్.హరనాధరావు రాసిన 'ఖామెడీ స్కిట్' కథకు వచ్చిన స్పందన

ప్రతిఘటన, రేపటి పౌరులు, ధర్మచక్రం వంటి సీరియస్ చిత్రాలకు పదునుగా (సంభాషణ రచనలో) పని చేసిన మీ కలం చాలాకాలం ఖామోషి త్వాత కూడా తనకు పదునే కాదు ఖామెడీ కూడా చాతవును అని నిరూపించుకుంది. మీ ఫోటో వుండబట్టిగాని లేదంటే నమ్మేటట్టు లేదు. ఆద్యంతమూ అడుగడుక్కి సెటైరులలో కథేమిలేకుండా కామెడిని ఖామెడిగా పండించారు. త్రాగే టీని పీల్చి అని పీల్చే సిగరెట్టును చప్పరించి అని అంటూ చదువరులను మొదట్లోనే ఆకట్టేసుకొని తెల్లకాగితాల దాకా (చివరాఖరున) గుక్క తిప్పుకోకుండా చదివించేటట్లు చేయడమే ఈ రచన ప్రత్యేకత. లేని కథకు నవ్వులు, ఖాళీకప్పులతో టీతాగడాలు అడ్డం తిరిగిన రచయితగారి తాలూకు టెలిగ్రాం, ఆఫీసు కుర్రాడి అయోమయం ఆఫ్ఘనిస్తాన్‌లో పడడం ... వగైరా పద, సన్నివేశ ప్రయోగాలు నవ్విస్తే, మెంటలెక్కించిన భర్త భార్య కాళ్ళమీద పడడం, స్టూడెంటు తండ్రితో అన్న మాటలు కడుపు నొప్పి వచ్చేంత నవ్విస్తాయి.

యాష్‌ట్రే అనుకొని బుట్టమీద సిగరెట్టు పీకను రుద్దుకున్న రచయిత చేసుకొన్న ఆలోచన వాంతితో ప్రయోగించిన చావు తెలివిని, ప్రేక్షకులు పంపిన శ్రీరామ అని కూడా రాయని తెల్ల కాగితాలు చావుదెబ్బకొడ్తాయి. టాంకు బండులోని బుద్ధుడికి పట్టుబట్టలు కట్టబెడుతానని స్టూడెంటు అనుకున్నాడు అన్నది ఖామెడీ కోసమే అయినా బుద్ధుడి మీద ఒక నావెల్టి జోక్ అనుకోకుండా క్రియేటు అయింది. చాలా రోజులకు హాసం ధర్మమా అని మంచి ఆస్య (మీ ఖామెడీలాగా) కథ చదివించినందుకు మీకు అభినందనలు.

-జి.ప్రభాకర్‌రావు, ఇ.ఇ. టి.యస్.భవన్, హైదరాబాదు.

ప్రతిఘటన, దేవాలయం, స్వాతికిరణం వంటి చిత్రాలలో మీ కలం బలం ఆంధ్రదేశానికి రుచి చూపారు. కొంతకాలం పాటు మంచి హాస్య చిత్రాలు వచ్చి అందర్నీ అలరించాయి. అయితే, హాస్యం పేరుతో వెకిలితనాన్ని జనం మీద రుద్దేందుకు, కొందరు ప్రబుద్ధులు చేసిన, చేస్తున్న ప్రయత్నాన్ని, సున్నితంగా, చమత్కారంగా హాస్యాన్ని పండిస్తూ మీరందించి 'ఖామెడీ కథ' హాసం పత్రికలో మాకందించి అలరించినందుకు మీకు అభినందనలు.

-నీలంరాజు రాంబాబు, ఇందిరా నగర్, అద్దంకి

16-31 మార్చి 2002 'హాసం'లో నా అభిమాన రైటర్ యం.వి.ఎస్.హరనాధరావుగారు పోస్టల్ శాఖకు పేట్టే చురక నాకు మరీ మరీ నవ్వించింది. అదేవిధంగా సెన్సార్‌కి ఎన్ని సీన్లున్నా పరవాలేదు. గ్రీన్ సిగ్నల్ ఇస్తారు కానీ కామెడీలో కామన్‌గా 'కామం' అనే పదం వస్తుందని ఖామెడీలో మార్చుమనటం వెరైటీ. మరో ముఖ్యమైన వ్యాంప్ ఆఫీసు బాయ్.... క్రొత్త మలుపు ఏంటంటే బహుమానం నిర్ణయించే కమిటీ బాయ్‌కు అప్పజెప్పడం బహుమానం కూడా సరైన వ్యక్తికే నిర్ణయించటం క్లయిమాక్స్ సూపర్బ్. ఎందుకన్నానంటే ఓ కవి.... 'తెల్ల కాగితం - మనిషి జీవితం' అన్నాడు కాబట్టి. మనిషి జీవితాన్నే సరదగా... సింబాలిక్‌గా తెల్లకాగితాలు శ్రీరామ అనికూడా వ్రాయకుండా పంపటం బహుమతి గెల్చుకోవటం అమోఘం. అమ్మో ఈ నగ్నసత్యాన్ని కనిపెట్టిన నాకు బహుమతి ఇచ్చేయగలరు. వద్దు.

-రఫీ, కస్పావీధి, రాజాం, శ్రీకాకుళం.

> నవ్వడం - నవ్వించడం - నవ్వేట్లు రాయడం నా కిష్టం.
> పదిక్షణాల వయస్సున్న బిడ్డ ఏడుపు విని అందరూ
> నవ్వుతారు.
> అ. నవ్వే. అ పసికందుకు తొలి అక్షితాలు... అశీర్వాదాలు...
> హాస్యం చేసే నా మిత్రుడు చచ్చిపోయాడు... అహాస్యగాడి
> శవాన్ని చితిమీద వుంచి అందరం చుట్టూ చేరాం.
> అతని హాస్యం గుర్తు చేసుకుంటూ అందరం నవ్వుకున్నాం.
> నవ్వుకు కన్నీళ్ళొచ్చాయి. విషాదంలో నవ్వు రుచి తెలిసింది.
> కన్నీళ్లకు రెండు భాషలు...
> ఒకటి విషాదం... రెండోది వినోదం.
> జీవితానికి అరెండు భాషలు అవసరం - తీపి కారాల్లా!
> హాస్యం రైటరును కావాలనుకున్నాను. డాక్టరు
> కావాలనని యాక్టరయ్యానని చెప్పే సినీతార అబద్ధం అంత
> నిజం నామాట - నా రచనలు నన్ను సీరియస్ చేశాయి.
> రాయక తప్పలేదు. రాసి తప్పించుకోలేక పోయాను. నేనూ
> హాస్యం రాయగలననే నమ్మకం కనీళ్ళు పెట్టుకుంటుంటే
> 'హాసం' పలుకరించింది. అంతే... కథ రాశాను... చదివిన
> వాళ్లు నవ్వొచ్చిందన్నారు. నా హాస్యాన్ని అక్షరాలా అందించిన
> 'హాసానికి' ముళ్లపూడి అప్పారావులా ఋణపడ్డాను.
> పాఠకులకు అక్షర కార్టూన్లు అందిస్తానని...
> బాపుగారి పైపు మీద వొట్టేసి చెబుతున్నాను.
> -యం.వి.యస్.హరనాధరావు.

మార్చి 16-31 'హాసం' పత్రికలో యం.వి.యస్.హరనాధరావు గారు అందించిన 'ఖామెడీ కథ' చదివి వ్రాస్తున్న లెటర్ ఇది. ఈ కామెడీ కథ చాలా విచిత్రంగా ఉంది. సినిమాలో కథ లేకుండా ఉండడం, కథే కామెడీ కావడం భలే విచిత్రంగా ఉంది. ఈ కథ ఆద్యంతం ఆసక్తితో కొనసాగింది. కథ వ్రాసిన శైలి కూడా విలక్షణంగా ఉంది. నవ్వునాలుగు విధాల చేటు అంటారు. అప్పుడు, కాని ఇప్పుడు నవ్వు నాలుగు విధాల స్వీటు.

-ఎం.డి.ముస్తఖీమ్, ఛావిని వీధి, కొల్లాపూర్.

ప్రేక్షక మహానుభావులు ఈ సరిక్రొత్త "ఖామెడీ" చిత్రాన్ని యింటర్వెల్ దాకా పిచ్చిగా చూసి పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వి, "శుభం" కార్డు చూసి సినిమా అయిపోయిందని యిళ్ళకు పరుగులు తీసి పారిపోయారు. యం.వి.యస్.హరనాధరావు గారు రాసిన 'ఖామెడీ కథ' కథనం చదివి ప్రేక్షకులు నూతన ఉత్తేజం పొంది ఆరోగ్యం పొందారు. డాక్టర్లు బోర్డులు తిరగవేసే గతి పట్టిందట. ఇలాంటి మరిన్ని కథలు ప్రచురించగలరు. ఎక్కడ ఆరోగ్యం ఉంటే... అక్కడే హాసం పత్రిక ఉంటుంది.

-పక్కి బాలకృష్ణారావు, జహీరాబాద్

నమస్సుమాంజలి.... ఖామెడీ కథ... టైటిల్, ఆరంభం, కథనం, కొసమెరుపు లాంటి ముగింపు. అదే వొట్టి తెల్లకాయితాలకు అయిదు లక్షల బహుమానం. హాస్యాన్ని ఆద్యంతం పట్టు సడలకుండా నవ్వు పువ్వులు

రువ్విస్తూ ఆకట్టుకునేలా చేయగల సత్తా మీ రచనా పటిమకుందని అన్పించింది.

"అదేదో సినిమాలో "ఒక హీరో ... ఒక హీరోయిన్ ఒక విలన్... అదీ స్టోరీ..." అంటూ సినిమా కథను మూడు పాత్రలతో చెప్పించే సన్నివేశం" గుర్తుకొచ్చింది. విశ్రాంతి దగ్గర శుభం కార్డు శుభం దగ్గర విశ్రాంతి.. అలాగే... ఖాళీ కప్పులో టీ త్రాగి భలే టీ అని మెచ్చుకోవటం.... ఇవన్నీ గుర్తుకొచ్చినపుడల్లా నవ్వింపజేసే గుళికలే!! సెన్సార్ వారికి 'కామెడీ' అన్న పదాన్ని సెన్సార్ చేయటం. "అవసరమైనప్పుడు సెన్సార్ చెయ్యరు కాని అనవసర ప్రయాస పడ్తుంటారన్న విషయం" ద్యోతకమైంది! ఇక సినిమా చూసొచ్చాక ప్రేక్షకులకు పిచ్చెక్కి, భార్యకే పెళ్లి చేస్తాననటం, బుద్ధుడికి పట్టుబట్టలు పెడ్తాననటం వంటి పైత్యాలు కన్పించటం... కూడా హాస్యరసాన్ని చిందించిడం శ్లాఘనీయం. మొత్తాన్కి, మహారాజా - దేవతా వస్త్రాలు కథకు జ్ఞప్తికి తెచ్చారు నవ్వు కథ కమామీషుతో

-నేమాన సుభాష్ చంద్రబోస్, శ్రీకాకుళం టౌన్

మీరు వ్రాసిన కథను, ఎవరైనా కార్డు మీద వ్రాయెచ్చు. మధ్య తరగతి మందహాసీయుడు అయితే ఇన్‌ల్యాండ్‌లో వ్రాయెచ్చు. కేవలం అరచేతిలో మీరు నవ్వుల స్వర్గాన్ని సృష్టించారు. ఎన్నో అందమైన, అమోఘమైన ఉపమానాలు, ఉపమేయాలతో కథను సింబాలిక్ 'టానిక్'గా చేసారు. రకరకాల మాటల మసాలాలతో మొదటినుండి చివరి వరకు కథను ఘుమఘుమలాడించారు. ప్రతి వారిని వూరించారు. వర్షంలా హాస్యాన్ని కురిపించారు. ప్రతి వొక్కర్నీ మురిపించారు. మైమరిపించారు.

సాధారణమైన సిన్మా సన్నివేశాలతో, అసాధారణమైన రూపకల్పన గావించారు. చదివిన ప్రతిమాటకు నవ్వుకున్నాం. మీరు అన్నట్లే మాకు నవ్వుల "మలేరియా" పట్టుకొంది. పొట్టపగిలేటట్టు "కిలకిల" గలగలతో డయేరియా వచ్చినట్లు తట్టుకోలేకపోయాం. ఆయన గారి పళ్ళు "కార్టూన్లలా" వున్నాయన్నారు. కనిపించాయన్నారు. ఆ మాట నవ్వుకోవటానికి ఎంత ప్రమాదకరమైందో వేరే చెప్పనవసరం లేదు. అప్పుడు చదివి నవ్వుకొంటే ఇప్పుడు నవ్వుకొంటూనే వ్రాస్తున్నాం. మరో చోట "బూతులతో కొట్టాడు" అని అన్నారు. అందుకు అమితంగా నవ్వుకున్నాం.

ఎప్పుడో 15 సంవత్సరాలనాడు యిచ్చిన టెలిగ్రామ్, ఇప్పుడు వచ్చిందంటూ అమ్మ మరణ వార్త అని తెలిసినా, తెగ నవ్వుకోవటం సహజంగానే వున్నది. చావు కబురు చల్లగా చెప్పటం అంటే అదేనని గుర్తు చేశారు. అక్కడ ఎంతో "వర్తు" చూపించారు. ప్రతిచోట మాటల్లో నవ్వులు దొర్లుతూనే వున్నవి. అవి వాస్తవికతకు అద్దం పడుతూనే వున్నవి. ఒకే దెబ్బకు రెండు పిట్టలు అన్నట్టు, అటు కథను కామెడీ పరంగాను, ఇటు సంఘపరమైన సమస్యలను పేర్కొంటు కమనీయంగా కథ మలచబడింది.

-వెలివల సాంబశివరావు, గుంటూరు.

మీరు రాసిన చిలిపికథ -ఖామెడీకథ నిజంగా చిలిపిగానే ఉంది. సామాజిక కథలను, సెంటిమెంట్ కథలను ఎన్నో రాసిన మీరు హాసం కోసం రాసిన కామెడీ కథ మీలోని హాస్యరచయితను ఆవిష్కరిస్తుంది. అదే సినిమా కామెడీని ఆవిష్కరించి మీరు రాసిన కథ అందరినీ ఆకట్టుకునేదిగా ఉంది అనడంలో సందేహం లేదు. ఇక మీ ఖామెడీ కథలోకి వస్తే -ఇంటికి రాగానే... భర్త...భార్య కాళ్ళమీద పడ్డాడు. ఇదేంటి ఓ నవ్వు సినిమాకు వెళ్ళొచ్చి నాకు నమస్కారం చేస్తారా", "అలా అనకు నీలాటి పెళ్ళికాని భార్యను ఇంట్లో పెట్టుకుని... నలుగురు పిల్లలున్నారన్న సంగతి మర్చిపోయి, నీకు పెళ్ళి చేయకుండా ఖామెడీ సినిమాలు చూస్తున్న దుర్మార్గుడ్ని... నీకు పెళ్ళిచేసి... నీకు తండ్రిలేని లోటు నీ బిడ్డలకు... భర్తలేని లోటు తీరుస్తా" అనడం, సిన్మా చూసిన వో స్టూడెంట్ ఇంటికి రాగానే తండ్రిదగ్గరకు వెళ్ళాడు, "డాడీ... నాకోర్కె తీర్చవూ" "ఏంట్రా అది", "టాంక్‌బండ్‌లో బుద్ధ విగ్రహం వుందికదా", "వుంటే", "ఆ విగ్రహానికి ఆ సైజులో పట్టుబట్టలు కట్టబెడతానని మొక్కుకున్నాను", అవును నాన్నారు "ఖామెడీ సిన్మా"కు వెళ్ళి క్షేమంగా తిరిగివచ్చాను... నా మొక్కు తీర్చండి" అని అనడం, ఇలాంటి జోక్స్ వల్ల పాఠకులందరూ నవ్వడం ఖాయం. ఇలాంటి కొన్ని జోక్స్ మీ కథలో చాలా బాగా రాశారు. సెంటిమెంట్ కథల రచయితలు కూడా కామెడీ రాయగలరు అనడానికి మీ "ఖామెడీ"యే ఓ ఉదాహరణ! తమ కథలతో పాఠకులచేత కన్నీళ్ళు పెట్టించిన రచయితలు, నవ్వించడం కూడా చేయగలరు తమ రచనలతో అని తెలియడానికి మీలాంటి వారు రాసిన "ఖామెడీ కథ" యే ఉదాహరణ. సినీ పరిశ్రమలో ఓ మంచి కథారచయితగా పేరుబడిన మీరు, పత్రిక వినీలాకాశంలో ఓ మంచి కథారచయితగా కూడా నిలవాలని కోరుకుంటూ, మీ పదునైన కలం నుండి మరిన్ని కామెడీ కథలు వెలువడాలని ఆశిస్తూ...

- ఎం. మల్యాద్రి, కావలి, నెల్లూరు జిల్లా

జస్ట్ ఫర్ ఫన్

## గ్రామ సింహం

జెమినిలో 'వన్స్‌మోర్ ప్లీజ్' షూటింగ్‌కి టైమవుతోంది. ఉదయభాను ఇంకా రాలేదేమో అని పికప్ చేసినట్టు కూడా ఉంటుందని ఆమె ఇంటికి వెళ్ళి తలుపు కొట్టాడు. జూ॥ వేణుమాధవ్

తలుపు చప్పడైంది

"ఎవరూ?"

"నేను, సమరసింహారెడ్డిని" అన్నాడు బాలకృష్ణ వాయిస్‌తో

"మీ తండ్రి పేరు?"

"సర్దార్ పాపారాయుడు" అన్నారు కృష్ణంరాజు రేంజ్‌లో

"తాతపేరు?"

"బొబ్బిలిబ్రహ్మన్న"

"తల్లిపేరు?"

"కడప రెడ్డెమ్మ" అన్నారు శారద మాడ్యులేషన్‌లో

"సరే.... లోపలికి రా!"

"వద్దును గానీ, గుమ్మం దగ్గర

కుక్క ఉంది. కాస్త దాన్ని కట్టెయ్యండి" అన్నారు వేణుమాధవ్ తన ఒరిజినల్ టోన్‌లో



-గోపి

## ఈ సారి పిల్లలకోసం ప్రత్యేకంగా... సమ్మర్ స్పెషల్‌గా...




ఆ రాజుగారి ఇంటికి ఎదురుగుండా ఇంకో కృష్ణంరాజుగారుండేవారు - ఆయనకి ఓ కూతురు - ఇంచక్కా గానపెసూనాంబంత బాంటుంది
వాళ్ళిద్దరూ రోజూ ఇంచక్కా ఆడుకునేవారు - వాళ్ళమ్మ బెల్లప్పు జీళ్ళు చెగోడీలు. మన మరాయీ బొబ్బట్లు పెట్టేవి - రాజుగారింట్లో పెద్ద గది నిండా జీళ్ళూ, ఇంకో గది నిండా జాంగ్రీలు వుంటాయి గదాం
ముందెలి బుడీలు! మూడు చక్రాల సైకిళ్ళు
ఓ! అవి కూడా వుండా యాభయో వుంటాయి ఇంకా వాటాకు బొమ్మలు, రిబ్బన్లు - ఐస్‌క్రీములూ, కాజాలూ - బటాణీలూ, గోపిగాళ్లూ
ఇద చె..
సర్లె సర్లె సర్లె - ఆ రోజున యువరాణీ యువరాజూ ఆడుకుంటూ వుండగా ఏమైందంటే - ఆఁ - ఆఁ.
దాగుడుమూతాలాటల్లో యువరాజు కళ్ళుమూసుకుని వుండగా - ఓ బెద్ద రాక్షసుడు యిలా వచ్చేశాడు
వచ్చేసి యువరాణిని ఎత్తుకుని పారిపోయాడు - నాడి కోటలో దాచేశాడు. యువరాజు కళ్ళు తెరిచేసరికి రాణి ఏదీ! లేదు!!
'యమ్మో' అని ఏడుద్దామని అనుకునేలోపలే ఓ పేదరాసి పెద్దమ్మ వచ్చి 'ఎందుకేడుద్దామని అనుకుంటున్నావ్ అబ్బాయీ' అని అడిగింది చెప్పాడు.
'మీ సీత నాకు తెలుసు. రాక్షసుడి కోటలో ఏడుస్తోంది!' అంది పెద్దమ్మ మరి ఎలాగా అని ఏడిచేశాడు రాజు


బయలుదేరకు - నేను నీకు కొయ్యగుర్రం ఇస్తాను - అందుమీద వెళ్ళి రాక్షసుణ్ణి చంపేసి సీతని తెచ్చుకో అంది పెద్దమ్మ
ప్రేం ప్రేం ప్రూం
అప్పుడే మా యువరాజు ఆ కొయ్యగుర్రం ఎక్కి 'హై కొయ్యగుర్రం! రాక్షసుడింటికి పదా!' అనేసరికి అదేమో యిలా జుయ్యింమని ఎగిరి పోయింది
చల్ చల్
రాక్షసుడింటి దగ్గిర వదిలితే ఇంకో పెద్ద రాక్షసుడున్నాడు వాడు...
ఒరేయ్ యువరాజా- నీకుమరి 'సీతాముని నై చేతను' పద్యం వచ్చునా?
రాదు
అయితే పో వెధవా- పోయి చదూకో
యువరాజు ఇంటికొచ్చి వాళ్ళమ్మనడిగి ఆ పద్యం ఘుబ ఘుబ నేర్చేసుకుని - పరిగెత్తుకెళ్ళి రాక్షసుడికి అప్పచెప్పాడు సరేలని లోపలికి వదిలాడు వాడు
లోపల ఇంకో రాక్షసుడున్నాడు
ఒరేయ్. నీకు సిరి చక్రవర్తి పాటం వచ్చిందిరా? ఆర్యులనగా నెవరు?
అది మాబాబాయి బుల్లి పాటం - నన నేనాకు తెలేదు
మీకూవుంది- చదుకో- లేపోతే
వెళ్ళొ-
యువరాజు పరిగెత్తుకొచ్చి సిరి పాటం, ఆర్యులపాటం చదివేసి మళ్ళీ పరిగెత్తుకెళ్ళి అప్పచెప్పేసాడు. సర్లే లోపలకెళ్ళు అన్నాడు రాక్షసుడు


లోపల ఇంకో పెద్ద రాక్షసుడున్నాడు
సీతకి ప్రైవేటు చెప్పేస్తున్నాడు
ఒరే రాక్షసా! మా సీతని వదిలెయ్యి! లేపోతే ఈ కత్తితో నీ నడ్డిమీద ఛంపేస్తా యుద్ధం చెయ్
అవునెలాగా మరెలాగా ఇంకెలాగా
మరి యుద్ధం చెయ్యాపోతే ఎలా చంపుతావు నన్ను- ఎలాగంటు?
హాహాహా
సురేష్- మన్నలా గారిగా నవ్వకు
నాకు రాదే మా బాబాయి కూడా రాదని నా అవమానం
నాకూ రాదు
అయితే నేనే గెల్చాను. ష్హో- సీతని ఇవ్వను -పో రా- ష్హో- వెళ్ళిపో-
అప్పుడు యువరాజు సురేష్ ఇంటికి వెళ్ళి వీధిలోని వాళ్ళ బాబాయి నడిగాడు
ఇప్పుడు ఎక్కం లేదూ పిక్కం లేదు గొడవ చెయ్యకు - బిజీగా వున్నా - ఫో


వాళ్ల లావుపాటి పక్కింటి పిన్నిగారి మొగుడు, పకోడీల నారాయణక్కా వాళ బామ్మా, ఆఖరికి పేదరాసి పెద్దమ్మ కూడా తెలీదందీ -
తెలీదు
తెలీదు
తెలీదు
తెలీదు
చివరకి వాళ్ల నాన్నకి వచ్చని చెప్పారు. అప్పుడు పరిగెత్తుకుని వాళ్ల నాన్న దగ్గరికి వెళ్లాడు. వాడు ఎక్కాల బుక్కు తీసి ఎక్కం చెప్పాడు
అప్పుడా పదమూడో ఎక్కం ఘుభఘుభ ఇంతా పట్టేసి మళ్లీ రాక్షసుడి దగ్గర కెళ్లి ఇలా అన్నాడు - పదమూడొక్కట్ల పదమూడు పదమూడు పదులు నూటముఫ్ఫై అని గడగడా వప్పచెప్పేశాడు
అప్పుడు రాక్షసుడు హా! అని అరిచి కింద హాశ్చర్యపడి పోయాడు అప్పుడు రాజు సీతని ఎత్తుకుని ఇలా రక్షించేసి తీసుకొచ్చేశాడు
హాశ్చర్యం!
జై!
అప్పుడు రాజుకీ సీతకీ పెళ్లి అయిపోయింది - కాజాలూ, బూందీలూ జాంగ్రీలూ చేగోడీలు జీళ్లు అవీ వాళ్లకి ఇచ్చారు - వాళ్లు అవి ఇంకా తింటూనే ఉన్నారు
అయితే బుడుగూ నాకు అర్జెంటుగా పదమూడో ఎక్కం నేర్పెయ్ నేను వెళ్లి సీతని రక్షిస్తాను
అలా చెప్పకూడదు రా గోపీ - మీ ఇంటికెళ్లి ఎక్కాల బుక్కు తీస్కురా అది చూసి మంత్రం వేసి చెప్పాలి - ఎక్కాల బుక్కు చూసి చెప్పకపోతే దేవుడికి కోపం వస్తుంది
తెత్తా వుండు
బుడుగ్! ఈ కథ చదివేవాడూ - ఆ కథ చదివేవాడూ ఆ గోపిగాడు వస్తే నేను తొమ్మిదిజవాను వెళ్లి పోయాననీ చెప్పరా ఏం?
అయిపోయింది



## శాంతారాం శత జయంతిని పురస్కరించుకుని...

# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | |
|---|---|
| చిత్రం | : ఝనక్ ఝనక్ పాయల్ బాజే (1955) |
| బ్యానర్ | : రాజ్‌కమల్ కళామందిర్ |
| గీతం | : హసరత్ జైపురి |
| సంగీతం | : వసంత్ దేశాయ్ |
| పాడినది | : హేమంత్ కుమార్, లతా మంగేష్కర్ |
| అభినయం | : గోపీకృష్ణ, సంధ్య |



# నైన్ సే నైన్ నాహీ మిలావో...



నైన్ సే నైన్ నాహీ మిలావో (2)
దేఖత్ సూరత్ ఆవత్ లాజ్, సైయ్యాం
ప్యార్ సే ప్యార్ ఆకే సజావో (2)
మధుర్ మిలన్ గావత్ ఆజ్, గుఇయాం
నైన్ సే నైన్...

ఆ... ఖేంచో కమాన్ మారో జీ బాణ్
రుత్ హై జవాన్ ఓ మేరే ప్రాణ్
తుమ్‌నే చోరీ కర్ లీ కమాన్
కైసే మారూం ప్రీత్ కా బాణ్, గుఇయాం
నైన్ సే నైన్

నీలే గగన్ పే ఝూమేంగా ఆజ్
బాదల్ కా ప్యార్ దేఖేంగ్ ఆజ్
బాదల్ నైయ్యా హై బిజలీ పత్‌వార్
హమ్ తుమ్ చల్ దేం దునియా కే పార్
సైయ్యాం...
నైన్ సే నైన్













"హాసం" 7వ సంచిక (1-15 జనవరి, 2002)లో "నవరంగ్" చిత్రంలోని "ఆధా హై చంద్రమా" గురించి ఈ శీర్షికలో ముచ్చటించినప్పుడే "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" చిత్రం గురించి ప్రస్తావన వచ్చింది. ఈ సినిమాకు ముందు తీసిన సినిమాలు ఫెయిలయినా తన దగ్గరున్న డబ్బంతా పెట్టి భారీ ఎత్తున టెక్నికలర్లో ఈ సినిమా తీయడానికి నిశ్చయించుకున్నారు శాంతారాం. ఈ సినిమా కథకు కలర్ అవసరం అని ఆయన నిర్ణయించుకోవడం వల్లనే అంతటి సాహసానికి ఒడికట్టారు. ఆయన ఎంచుకున్న





కథల వైవిధ్యం, వాటిని ఆయన ప్రేక్షకులకు అందించిన విధానం తెలుసుకోవాలనే రసజ్ఞులకు హైదరాబాదు ఫిల్మ్ క్లబ్ ఒక చక్కటి అవకాశం కల్పిస్తోంది. పన్నెండు శాంతారాం సినిమాలను ఏప్రిల్ 20 నుండి 29 వరకు హైదరాబాదులోని హరిహరకళాభవన్‌లో ఉచితంగా ప్రదర్శిస్తోంది.

ఆ ఉత్సవంలో ప్రదర్శింపబడే తక్కిన సినిమాలన్నిటి కంటె "ఝనక్ ఝనక్ పాయల్ బాజే" కు ఎక్కువ ఆదరణ లభిస్తుందని సులభంగా చెప్పవచ్చు. కారణం - ఆ సినిమా థీమ్ మన హృదయాలకు చేరువగా ఉండేది కాబట్టి. భారతీయ సంస్కృతి అంటే మనందరికి కొద్దో, గొప్పో అభిమానం లోపల దాగి వుంటుంది. దానిని సరైన తీరులో, బలమైన కథ ద్వారా, చిక్కని డ్రామాతో మనకు అందించినపుడు మనం ఆ చిత్రాన్ని ఆదరిస్తాం. "శంకరాభరణం" విషయంలో జరిగినది అదే. శాస్త్రీయనృత్య కళాకారుడి చుట్టూ తిరిగే ఈ కథ మనకు అందుకనే నచ్చుతుంది. ముఖ్యంగా కళకు, ప్రేమకు ముడిపెట్టినప్పుడు డ్రామాకు కొదవేముంటుంది? విద్యను నేర్పి, తననింతటి కళాకారుణ్ణి చేసిన తండ్రి చెప్పినట్టు వినాలా, మనసు చెప్పినట్టు ప్రేమకు లొంగాలా? అన్న కథానాయకుడి ఘర్షణతో ప్రేక్షకుడు తాదాత్మ్యం పొందకుండా ఉండగలడా? ఈ సినిమా గురించి చెప్పుకోవడానికి చాలా విశేషాలున్నాయి.

## కథాంశం

ఈ సినిమాకు ముందు వర్కర్ల కష్టాల గురించి తీసిన 'సురంగ్', వితంతు పునర్వివాహం గురించి తీసిన 'సుబహ్ కా తారా' ఫెయిలయ్యాయి. తరువాతి సినిమాకు సబ్జక్ట్ గురించి శాంతారాం వెతుకుతుండగానే ఫిల్మ్‌డివిజన్ వారి కోరికపై "సింఫనీ ఆఫ్ లైఫ్" అనే డాక్యుమెంటరీ తీసిపెట్టవలసివచ్చింది. అన్ని భాషలవారికి అర్థం కావాలంటే డైలాగ్సు పెట్టకుండా నేపథ్యంలో శాస్త్రీయసంగీత రాగాలు వినిపిస్తే చాలనుకున్నారు శాంతారాం. ఆ ప్రయోగం విజయవంతమయి, ఆ డాక్యుమెంటరీ విదేశాలలో కూడా మన్ననలందడంతో ఆయనకు శాస్త్రీయసంగీత, నృత్యాల గురించి సినిమా ఎందుకు తీయకూడదు? అనిపించింది. అంతే దీవాన్ శరార్‌తో కలిసి కథ తయారుచేశారు శాంతారాం.

## కథ

మంగళ్ మహారాజ్ అనే డాన్సుటీచర్‌కు తన కొడుకు గిరిధర్ (హీరో)ను నృత్యవిద్యాప్రవీణుడిని చేసి, ప్రతీ నాలుగేళ్ళకు జరిగే నృత్యోత్సవంలో "భరత్ నటరాజ్" బిరుదు పొందేలా చెయ్యాలని ఆకాంక్ష. అతనికి పార్ట్‌నర్‌గా డాన్సు చేయగల అమ్మాయి గురించి వెతుకుతూంటే మణిబాబు అనే అతనివద్ద చీప్‌రకం డాన్సులు చేసే నీలా (హీరోయిన్) కనబడుతుంది. ఆమెను శిష్యురాలిగా స్వీకరించి డాన్సు నేర్పుతుండగానే గిరిధర్, నీలాలు ప్రేమలో పడతారు. హీరో లక్ష్యానికి నువ్వు అడ్డువస్తున్నావని గురూజీ హెచ్చరించడంతో హీరోయిన్ హీరోకు ఏదో అపోహ కలిగించి తొలగిపోతుంది. హీరో మరో అమ్మాయితో కలిసి ఉత్సవంలో పాల్గొని ఫెయిలయే దశలో తిరిగి రంగప్రవేశం చేసి హీరోకు బిరుదు సంపాదించిపెట్టి హీరోతండ్రి అనుమతితో అతన్ని పెళ్లి చేసుకుంటుంది.

## హీరో ఎంపిక

ఈ సినిమా హీరోకు కథక్ డాన్సు తెలిసివుండడం చాలా అవసరం కాబట్టి కథక్ నేర్చిన కుర్రాళ్ల గురించి వెతుకుతూండగానే సుఖ్‌దేవ్ మహారాజ్ అనే డాన్సు మేష్టరు తన మనుమడు గోపీకృష్ణను వెంటబెట్టుకుని వచ్చారు. గోపీకృష్ణ విషయంలో అన్నీ ఒకేయే గానీ గొంతులో ఆడంగితనం ఉంది. కాస్త తటాపటాయించిన తర్వాత శాంతారం అతన్ని హీరోగా అతని తాతను తెరమీద తండ్రిగా తీసుకున్నారు. డాన్సులు కంపోజ్ చేసే బాధ్యత కూడా అతనికి అప్పగించడం జరిగింది. ఒకసారి ఒక తరహా పదవిన్యాసం అతను సరిగ్గా చేయలేకపోతూ ఉంటే శాంతారాం తనంతట తనే డాన్సు చేయడం మొదలుపెట్టారు. తబలా మాష్టర్ శాంతా ప్రసాద్ ఒక ట్యూన్ తర్వాత మరో ట్యూన్ వాయించడం మొదలుపెట్టారు. ఈ జుగల్‌బందీ గంటన్నర సేపు సాగింది.

అంతా అయిన తర్వాత గోపీకృష్ణ శాంతారాం వద్దకు పరుగున వచ్చి "మీరు చేసిన దాంట్లో పావు వంతు చేసినా నాకు విజయం దక్కినట్టే" అన్నాడట.

## హీరోయిన్

సంధ్య అంతకు ముందు శాంతారాం తీసిన "అమర్‌భూపాలి" చిత్రంలో డాన్సు చేసింది కానీ అది ఫిల్మీ డాన్సు. అయినా క్లాసికల్ డాన్సు నేర్చుకుని ఈ పాత్రకు న్యాయం చేస్తానని సంధ్య హామీ ఇవ్వడంతో శాంతారాం ధైర్యం చేసి ఆమెకా పాత్ర ఇవ్వడం జరిగింది. దాంతో శాంతారాం భార్య జయశ్రీ అలిగింది. ఇంతటి భారీచిత్రంలో తన వంటి కమ్మర్షియల్ వాల్యూ ఉన్న స్టార్‌కు పాత్ర ఇవ్వకుండా సంధ్యకివ్వడమేమిటని ఆమె వాదన. "నువ్వు నటించిన సుబహ్‌కా తారా ఆడలేదు కదా!" అన్నారు శాంతారాం. వైజయంతిమాలనో, పద్మినినో తీసుకోవలసినదని దర్శకనిర్మాత మెహబూబ్‌ఖాన్ సలహా ఇచ్చారు. వాళ్ళెవరూ రోజుకు 12 గంటలు రిహార్సల్సు చేయలేరు కదాని శాంతారాం వాదించారు. ఒక దృశ్యంలో సంధ్య నుదిటిపై ఒక దీపం, భుజాల మీద, అరచేతుల్లోనే చెరో రెండేసి దీపాలు పెట్టుకుని వెనక్కి తలవంచి నేలను తాకవలసివచ్చింది. రిహార్సలు చేస్తూండగా వెన్నెముక విపరీతంగా నొప్పి పుట్టి ఆమె కెవ్వుమంది. వెన్నెముక విరిగితే ఆమె శాశ్వతంగా వికలాంగు రాలయిపోతుందని భయపడి శాంతారాం షూటింగు ఆపేయబోయారు. కానీ తనకు మరొక్క ఛాన్సు ఇమ్మనమని బతిమాలి సంధ్య ఆ ఫీటు చేసింది. ఇలాగే ఆ సినిమాలో మరికొన్ని కష్టమైన షాట్లు చేసిన సంధ్య సినిమా అనంతరం చాలా బాధపడింది. మూడు గంటల ఆపరేషన్, నాలుగు నెలలపాటు హాస్పటల్ వాసం ఖర్చులన్నీ శాంతారాం భరించారు. - డాక్టర్లు ఆమె నడవగలదు కానీ డాన్సు చేయలేదు అన్నా, తిరిగి పుంజుకుని అనేక సినిమాలలో అద్భుతమైన నృత్యాలు చేయగలగడం - ఇవన్నీ సంధ్య వంటి అంకితభావం కలిగిన కళాకారిణికే సాధ్యం.

## సంగీతం

శాంతారాం మిత్రులైన ఫిలిం ప్రొడ్యూసర్లు - విజయభట్, ఎస్. ముఖర్జీ, రాజ్‌కపూర్, మెహబూబ్‌ఖాన్ శాంతారాం చేస్తున్న ఈ సాహసం చూసి భయపడ్డారు. కొత్త హీరో, పెద్దగా పేరులేని హీరోయిన్. డాన్సుల గురించి భారీ సినిమా. "ఉదయశంకర్ కూడా డాన్సులు తీసిన 'కల్పన' సినిమా ఫెయిలయింది చూశావా?" అన్నారు. "చూశా, ఉదయశంకర్ గొప్ప నర్తకుడే



కానీ ఫిలిం మేకర్ కాదు. నేను ప్రధానంగా ఫిలింమేకర్‌ను. అందుచేత పోలికవద్దు." అన్నారు శాంతారాం. పోనీ ఓ పేరున్న కమ్మర్షియల్ మ్యూజిక్‌డైరక్టరు నయినా పెట్టుకో బొత్తిగా వసంత్‌దేశాయ్ ఏమిటి?" అన్నారు.

కానీ శాంతారాం వినలేదు. వసంత్‌దేశాయినే నమ్ముకున్నాడు. ఆయన కూడా ఆ నమ్మకాన్ని వమ్ముచేయలేదు. ఎంతోమంది ప్రతిభావంతులైన సంగీతకారులను రప్పించుకుని వారి సహకారం పొందాడు. సమతాప్రసాద్ (బెనారస్-తబలా), సుదర్శన్ (కలకత్తా-ఖయాల్) ఎటువంటి పాటలు, ఎటువంటి నేపథ్య సంగీతం వెలుగుచూశాయో వేరుగా రాయనవసరం లేదు. ఈ సినిమా తర్వాత తీసిన "తుఫాన్ ఔర్ దియా", "దో ఆంఖే బారా హాత్" సినిమాలకు కూడా వసంత్‌దేశాయే సంగీతాన్నిచ్చారు. "దో ఆంఖే బారా హాత్" (1957)లో ఆయన కంపోజ్ చేసిన "యే మాలిక్ తేరే బందే హమ్" పాట తలచుకోగానే చెవుల్లో మారుమ్రోగే పాట!

## సాంకేతిక నిపుణులు

ఆర్ట్ డైరక్టరు కానూ దేశాయ్ (ఆయనే ఈ సినిమా టైటిల్‌ను సూచించారు) సృష్టించిన సెట్ శాంతారాంకు నచ్చింది కానీ ఫ్లోరింగ్ మాత్రం డాన్సు చేయడానికి అనువుగా లేదని బోల్డంత ఖర్చుపెట్టి మార్పించారు. ఇలా శాంతారాం దేనిలోనూ రాజీపడలేదు. అలాగే టెక్నికలర్ విషయంలో కూడా. విదేశీ నిపుణులపై ఆధారపడకుండా స్వంత సిబ్బందికే శిక్షణనిప్పించడానికి అసిస్టెంటు డైరక్టర్ ప్రభాత్‌కుమార్, చీఫ్ టెక్నీషియన్ బి.ఎమ్.టాటా లను లండన్ పంపారు. వాళ్ళు తిరిగివచ్చి 15 లక్షల రూపాయల ఎక్విప్‌మెంటు కావాలన్నారు.

శాంతారాంకు అప్పటిదాకా పెట్టుబడి పెట్టిన షాపూర్‌జీ పలోంజీ (మొఘలే ఆజమ్‌కు పెట్టుబడి పెట్టినాయన) చేతులెత్తేశాడు. కపూర్‌చంద్ అనే బెంగాల్ డిస్ట్రిబ్యూటర్ డబ్బిస్తానన్నాడు కానీ అతను పెట్టిన షరతులు శాంతారాంకు నచ్చలేదు. ఇల్లు, స్టూడియో, సినిమా థియేటరు కుదువబెట్టి డబ్బుతెచ్చారు... అయినా సరిపోకపోతే ఇంటిఖర్చులు తగ్గించుకున్నారు.

## ఆర్థికపరమైన ఇబ్బందులు

సినిమా చివరికి వచ్చేసరికి డబ్బుసరిపోలేదు. ఎగ్జిబిటర్స్ డబ్బిస్తామన్నారు ఓ షరతు విధించారు. దాని ప్రకారం కలక్షన్స్‌లో 50శాతం వారికే పోతుంది. సినిమా ఫ్లాపయితే శాంతారాం సర్వనాశనమయిపోతారు. గత్యంతరం లేక సరేనన్నారు శాంతారాం. ఇంతలో లండన్‌లో తీసిన ఫస్ట్‌కాపీ రిజల్ట్స్ వచ్చాయి. కానీ ఘోరంగా ఉంది. ల్యాబ్‌వాళ్ళు మూడువారాల టైమిస్తే సరిచేస్తామన్నారు. అంటే నాలుగువారాలపాటు రిలీజ్ లేటవుతుంది. థియేటర్స్‌కి నష్టపరిహారం ఇవ్వాలి. పైగా నెల్లాళ్ళపాటు పబ్లిసిటీ కంటిన్యూ చేయాలి. నాణ్యతపై రాజీపడనివారు ఏం చేస్తారో శాంతారాం అదే చేశారు. చివరికి 1955 సెప్టెంబరు 30న సినిమా రిలీజయింది. చరిత్ర సృష్టించింది. ఒక థియేటర్‌లో 104 వారాలు ఆడింది. ఛైర్మన్ మావోకు ప్రత్యేక ప్రదర్శన ఏర్పాటు చేస్తే ఆయనకు కూడా బాగా నచ్చిందీ సినిమా.

## ఇక పాట గురించి

హీరో, హీరోయిన్లకు ప్రేమోదయం కలిగినప్పుడు రతీమన్మథుల్లా ఊహించుకుంటూ పాడే ఈ పాటను మాల్‌గుంజ్ రాగంలో కూర్చారు. ఈ పాట భాగేశ్రీ రాగంలో వుందనుకోవటానికి అవకాశం ఎంతో ఉంది. కానీ పాటలో సాధారణ గాంధారం, అంతర్గాంధారం (గ అన్న స్వరాలు) రెండిటినీ ఉపయోగించటం జరిగింది. భాగేశ్రీ రాగంలో సాధారణ గాంధారాన్ని మాత్రమే ఉపయోగిస్తారు. మాల్‌గుంజ్‌లో ఈ రెండు స్వరాల ప్రయోగం సాధ్యమే. అంచేత ఈ పాట మాల్‌గుంజ్ అనే రాగంలో ఉందనుకోవటం సబబు. బృందావన్ గార్డెన్స్‌లో చిత్రీకరించారు. హేమంత్‌కుమార్, లతామంగేష్కర్ హీరో, హీరోయిన్లకు గళమిచ్చారు. హేమంత్‌కుమార్ సంగీతదర్శకుడు మాత్రమే కాదు. చక్కటి గాయకుడు కూడా. స్వీయసంగీత దర్శకత్వంలోనే కాక ఇతరుల సారథ్యంలో కూడా చాలా పాటలు పాడేరు. కొన్ని రకాల పాటలకు ఆయన వాయిస్ చాలా చక్కగా సూట్ అవుతుంది. ముఖ్యంగా ఇలా మంద్రంగా సాగే పాటలకు మరీనూ...

పాటలో వాడిన మాటలు - సంస్కృత జన్యమైనవి కాబట్టి - మనకు చాలా భాగం అర్థమయ్యేవే. నైన్ అంటే నయనం, కన్ను, దేఖత్, ఆవత్, గావత్ వంటివి దేఖ్ (చూచు), ఆ (వచ్చు), గా (పాడు) అనే క్రియాపదాల మాండలిక రూపాలు. లాజ్ అంటే సిగ్గు సైయా అంటే నాథుడు అని అర్థం. సజానా అంటే అలంకరించడం గుఇయా॰ అంటే సఖీ అని అర్థం.

**'కళ్ళల్లో కళ్ళు కలపవద్దు, నాథా**
**చూస్తేనే సిగ్గు ముంచుకువస్తోంది' అని ఆమె ప్రాథేయపడితే అతడు**
**'దరికి చేరి ప్రేమను ప్రేమతోనే అలంకరిం ౘు, సఖీ**
**మధురమైన ఈ కలయిక పాటపాడుతోంది నేడు'**



**అని ఆహ్వానించాడు.**
**నీవు మన్మథుడివి కదా బాణం ఎక్కుపెట్టవేం మరి?**
**అని కవ్వించిందామె. కమాన్ అంటే విల్లు.**
**'విల్లు ఎక్కుపెట్టు, బాణం వేయి**
**యవ్వనపు ఋతువు కదా, ఓ ప్రాణనాథా' అందామె.**
**'నా విల్లు దొంగిలించావు సఖీ**
**ఎలా వేయను ప్రేమబాణాన్ని' అంటూ వాపోయాడతను.**
**ప్రకృతి అందాల వైపు దృష్టి సారించారు ప్రేమికులు.**
**నయ్యా అంటే నావ. పత్‌వార్ అంటే చుక్కాని.**
**'నీలిగగనాలలో ఆడదాం నేడు**
**మేఘాల సయ్యాటలు చూద్దాం నేడు**
**మబ్బులే నావ, మెరుపులే చుక్కాని**
**నువ్వూ-నేనూ, ఓ నాథా, వెళదాం**
**ప్రపంచపు అవతలి తీరానికి**

**-కమ్యూనికేటర్ ఫీచర్స్**

# ఇష్టపది

**మార్కెట్లో విరివిగా అమ్ముడుపోతున్న ఆడియోలపై అభిప్రాయాల వేదిక**

## నువ్వు లేక నేను లేను



'నువ్వు లేక నేను లేను' చిత్రంలోని పాటలు ఈ మధ్యకాలంలో తనని అమితంగా ఆకట్టుకున్నాయని మ్యూజిక్ డైరెక్టర్ చక్రి పేర్కొన్నారు.
"ఎలా ఎలా ఎలా ఎలా ఎలా తెలుపను? పాట సాహిత్యం, ట్యూన్ రెండింటిలోనూ మంచి ఫీల్ వుంది. 'ఏదో ఏదో అయిపోతుంది' పాట అయితే సింప్లీ సూపర్బ్. 'నిండు గోదారి కదా ఈ ప్రేమ' పాట అయితే క్లాస్ ఓరియంటేషన్‌తో సాగిన మాస్‌సాంగ్. ట్యూన్‌గాను, లిరిక్‌గాను చాలా ఈజీగా వుంది. చిన్న పిల్లల క్కూడా ఒక్కసారి వినగానే అర్థమవుతుంది. నాలుక మీద ఆడే పాట ఇది. మొత్తం మీద ఈ సినిమాలోని అన్ని పాటల్లోనూ ఆర్పీ ఈజ్ కొట్టొచ్చినట్టుగా ఉంది. సినిమా పేరు తెలీనివాళ్ళు కూడా ఈ పాటలు విని ఇది ఆర్పీ మ్యూజిక్ కదా అని అడుగుతారు" అని ఆర్పీని హార్ట్‌ఫుల్‌గా ప్రశంసించారు చక్రి.

## నీ ప్రేమకై



'ఈనాడు'లో పని చేసి 'మా పెళ్ళికి రండి' చిత్రంతో సంభాషణల రంగంలోకి ఎంటరయ్యారు సతీష్. పదునైన మాటలతో విరుపుల్ని సృష్టించి ప్రేక్షకులను ఆకట్టుకోవాలని తపించే సతీష్ 'నువ్వు వస్తావని', 'ప్రియా ఓ ప్రియా' చిత్రాలకు రచనా సహకారం అందించారు. 'నీ ప్రేమకై'లో నచ్చిన పాట గురించి ఆయన ఇలా చెబుతున్నారు. 'కోటి తారలా' పాట వినగానే నచ్చేసింది. మంచి మెలోడితో పాటు, మంచి ఫీల్ కూడా వుంది. అలాగే సాహిత్య పరంగా కూడా కొత్తగా వుంది. కులశేఖర్ కలంజోరు నచ్చింది. పిక్చరైజేషన్ కూడా స్మూత్‌గా వుండి చూస్తుంటే హేపీగా అనిపించింది."

## లాహిరి లాహిరి లాహిరిలో



దర్శకుడు వైవిఎస్ చౌదరి నిర్మాతగా కూడా మారి తొలిసారిగా చేసిన ప్రయత్నం 'లాహిరి లాహిరి లాహిరిలో'. చౌదరిలో మంచి మ్యూజిక్ టేస్ట్ వుందని కీరవాణి కూడా ప్రశంసించారు. ఈ చిత్రంలో మొత్తం ఏడు పాటలున్నాయి. ఏడూ ఏడు రకాల సిట్యుయేషన్స్ అని చౌదరి చెప్పారు. అందుకే వీటిలో ఏది బెస్ట్ అని ఈజీగా తేల్చడం కష్టమని చెబుతూ "పెళ్ళి మీద పాజిటివ్ థాట్‌తో 'మన వీర వెంకట సత్యన్నారాయణ పెళ్ళి' పాట, అనుబంధాలు, ఆత్మీయతల నేపథ్యంలో తొలి ప్రేమానుభూతుల్ని రంగరించి 'అ ఆ ఇ ఈ' పాట, అమ్మాయి అబ్బాయి మధ్య కలిగే వలపు గిలిగింతలతో 'కళ్ళలోకి' పాట, అమ్మాయిల్ని అబ్బాయిలు చేసే రొమాంటిక్ టీజ్‌తో 'కిలిమిరే' పాట, మెచ్యూర్టీ వున్న మూడు జంటల ప్రేమానుభావాలతో 'మంత్రమేదో వేసింది' పాట, మనసులో వున్న ప్రేమను వ్యక్తపరచలేక పడే బాధతో 'నేస్తమా' పాట, జంటలన్నీ కలిసి చిలకల్ని అడ్డుపెట్టుకుని ప్రేమ పలుకులు వల్లేవేస్తూ 'ఓ హోహో చిలకమ్మా' పాట చేయడం జరిగింది. నాకెంతో ఇష్టమైన సీతారామశాస్త్రి, కీరవాణిల కాంబినేషన్‌లో ఆ ఆల్బమ్ చేయడం నాకో అందమైన అనుభవం" అని పొయిటిక్‌గా తన మనసును ఆవిష్కరించారు చౌదరి.

## వాసు



ఇంజనీరింగ్ చదివి అభిరుచితో గేయ రచయితగా మారిన యువకుడు పోతుల రవికిరణ్. 'వాసు' చిత్రంలో నాలుగు పాటలు రాసారు. వెంకటేష్ సినిమాకి రాయడం తనకిదే తొలిసారని చెబుతూ, "తొలుత నా చేత 'పాటకు ప్రాణం పల్లవి' పాట రాయించారు. ఆ తర్వాత 'ఓ ప్రేమా', 'వాలే వాలే పొద్దులా', క్లయిమాక్స్ సాంగ్ 'పాడనా తీయగా కమ్మని ఒక పాట' రాయించారు" అని ఆనందం వెలిబుచ్చారు రవికిరణ్. ఈ నాలుగు పాటల్లో అగ్రతాంబూలం దేనికిస్తారని ప్రశ్నిస్తే నవ్వేస్తూ - "నాలుగు ఇష్టమే అయితే ముఖ్యంగా క్లయిమాక్స్ సాంగ్ చాలా రియల్‌గా ఫీలయ్యి రాసాను. కాలేజ్ ఏజ్‌లో లవ్ అనేది అందరికీ అనుభవైక వేద్యమే. ఓ పక్క చదువు, ఓ పక్క ప్రేమ, మరో ప్రక్క లక్ష్యం... వీటన్నిటితో కాలేజ్ ఏజ్ విచిత్రంగా అనిపిస్తుంది. అలాంటి ఫీలింగ్స్‌కి నా అనుభవాన్ని రంగరించి ఈ పాటలో నింపడం జరిగింది. డెఫినెట్‌గా పాటల రచయితగా వాసు నాకు మంచి పేరు తెచ్చిపెడుతుంది" అని వివరించారు.

## మౌనమేలనోయి



సచిన్, సంపదలను హీరోహీరోయిన్లుగా, శ్యామ్‌ప్రసాద్‌ని దర్శకునిగా పరిచయం చేస్తూ మనీషా ఆర్ట్స్ అండ్ మీడియా ప్రైవేట్ లిమిటెడ్ బేనర్‌పై ఈ చిత్రాన్ని నిర్మించారు కిషోర్ రాఠీ. ఈ సినిమా మ్యూజిక్ గురించి అడిగితే 'మాటల్లో సంగీతాన్ని వర్ణించడం కష్టం' అన్నారు నవ్వుతూ.

"రమణ గోగుల గురించి ప్రత్యేకంగా చెప్పనసరం లేదు. పర్సనల్ ఇంట్రస్ట్‌తో ఎక్కువ టైం తీసుకుని మరీ 'మౌనమేలనోయి'కి ఎక్స్‌ట్రార్డినరీ మ్యూజిక్ ఇచ్చారు రమణ గోగుల. నచ్చిన పాట అని ఒక్కటి తేల్చి చెప్పడం కష్టం. అన్నీ నాకు బాగా నచ్చాయి. ఒక దాన్ని మించి మరొకటి వున్నాయి. ఈ ఆడియోకి వేటూరి గారు హార్ట్" అని చెప్పారు చిత్ర సమర్పకులు కిషోర్‌రాఠీ.

## ఓ చినదాన



'ఓ చినదాన'లో మీకు నచ్చిన పాట ఏదని బిజీ కమెడియన్ అయిన ఎమ్మెస్ నారాయణని అడిగితే - "అందరికీ బాగా నచ్చిన పాట నాకు నచ్చింది"అని చిన్నగా పజిల్ ఇచ్చారు. తర్వాత నవ్వేస్తూ - "టైటిల్ సాంగ్ అందరికీ బాగా నచ్చింది. ఎక్కడ విన్నా ఇదే పాట వినిపిస్తుది. సాధారణంగా కొన్ని పాటలు క్లాస్‌కి, మరికొన్ని మాస్‌కి నచ్చుతాయి. రెండు వర్గాలకీ నచ్చే పాటలు చాలా తక్కువ వుంటాయి. ఈ టైటిల్ సాంగ్ క్లాస్‌కి, మాస్‌కి నచ్చింది. కొత్త గాయకుడు దేవాశిష్ పాట పాడిన తీరు బాగుంది. అచ్చం మహ్మద్ రఫీ పాడినట్టు అనిపించింది" అని వివరించారాయన.

## ఆడుతూ... పాడుతూ



శ్రీహరి 'దాసు'తో దర్శకుడిగా పరిచయమైన దేవీ ప్రసాద్‌కిది రెండో చిత్రం. ప్రేక్షకుల్ని నవ్వుల్లో ముంచెత్తుతున్న ఈ చిత్రాన్ని కేవలం కామెడీని దృష్టిలో పెట్టుకునే చేసానంటున్నారాయన.

"నవ్వవే చిలకమ్మా' అంటూ శ్రీహర్ష రాసిన పాటంటే నాకు బాగా ఇష్టం. గేయ రచయిత శ్రీహర్షని పిలిచి నవ్వుగురించి పాజిటివ్ థింకింగ్‌లో పాట రాయమని చెప్పాను. ఆయన రాసిన ఫస్ట్‌వెర్షన్ ఓకే అయ్యింది. మంచి సాహిత్యపు విలువలున్న పాట ఇది. 'ఈ బతుకే చిన్నది భామా/ అది నవ్వుకె చాలదు లేమ్మా /ఇక బాధకు చోటూ ఎక్కడ ఉందమ్మా/ శతమానం మానవజన్మ/ బహుమానం నవ్వేనమ్మా/ అభిమానం చూపి ఇచ్చెను ఆ బ్రహ్మ' అంటూ సాగిన చరణాలు అద్భుతం. మానవ జీవితంలో నవ్వు ప్రాధ్యాత గురించి చాలా గొప్పగా లిఖించిన పాట ఇది. నవ్వంటే ఇష్టపడే నాకు నవ్వు మీద రాసిన ఈ పాటను అందుకనే అంత బాగా ఇష్టపడ్డానేమో" అంటూ తనకు నచ్చిన పాట గురించి అభిప్రాయం వ్యక్తపరిచారు దేవీ ప్రసాద్.

## నీ తోడు కావాలి

కంప్యూటర్ పోస్టు గ్రాడ్యుయేషన్ చేసి చిన్న వయసునుంచే సౌండ్ ఇంజనీరింగ్‌లో మెళుకువలు తెలుసుకుని ఎక్స్‌పర్ట్ అని పించుకున్న ఇరవైరెళ్ళ కుర్రాడు శేషు తన ముగ్గురు స్నేహితు లతో కలిసి ఈ చిత్రానికి సంగీతం అందించారు. తన మనసు దోచుకున్న పాట గురించి శేషు ఏమంటున్నారంటే- "శ్వాసల్లో శ్వాసల్లే ఆశల్లో ఆశల్లే" పాటలోని సాహిత్యం నన్ను బాగా ఆకట్టుకుంది. రెండో చరణంలో 'రాతికైనా నేర్పించుకుంటే మాట పలుకుతుందే, కాటినైనా బతిమాలుకుంటే మంటలార్పుతుందే' అన్న వాక్యాలు ఇప్పటికీ నా మనసులో కదులుతూనే వున్నాయి. పాట స్లోరిథమ్‌తో సాగుతున్నట్టు అనిపించినా గానీ, ఏదో తెలీని వేగం మాత్రం మనసుని తాకుతుంది. ఈ పాటని తొలుత రికార్డ్ చేసి విన్నాక ఆర్కెస్ట్రయిజేషన్ బాగా సెట్ కాలేదనిపించి దర్శక నిర్మాత భీమినేని గారితో మళ్ళీ చేస్తామని చెప్పాం. రెండోసారి బాగా కుదిరింది. మొత్తం అన్ని పాటల్లోకెల్లా ఈ పాటకే ఎక్కువ కష్టపడ్డాం. అందరూ కూడా ఈ పాటే ఎక్కువ నచ్చిందని చెబుతున్నారు" అని చెప్పుకొచ్చారు శేషు.



## సవ్వడి



'సవ్వడి'లో ఏడు పాటలూ రాసిన భాస్కరభట్ల రవి కుమార్ తన అభిప్రాయం ఇలా వెల్లడించారు. "ఇట్లు.... శ్రావణిసుబ్రమణ్యం"లో 'రామ సక్కని బంగారు బొమ్మ...' పాట హిట్ కావడంతో నేను మాస్ సాంగ్సే బాగా రాయగలననే అనుకుంటూ వుండే వాణ్ణి. అలాంటి పరిస్థితుల్లో 'సవ్వడి' పాటలు రాసే బాధ్యతను దర్శకుడు శివ నా మీద వుంచినపుడు ముందు కాస్త తటపటాయించిన మాట వాస్తవం. ఈ సినిమాలోనివన్నీ సందర్భానుసారంగా వచ్చే పాటలే. ఎంతో ఛాలెంజ్‌గా తీసుకుని రాయడం ప్రారంభించాను. ఒక్కో పాట కోసం నాలుగైదు రోజులు టైం తీసుకొని రాస్తుంటే.... నా మీద నాకే ఆశ్చర్యమేసింది. వాటిల్లో నాకు బాగా నచ్చిన పాట 'నన్ను నాకు పరిచయం చేసినావె గొప్పగా'.. ఈ పాటకి గొప్ప ఇన్‌స్పిరేషన్‌గా చెప్పాల్సింది - 'పట్టుదల' సినిమాలో మా గురువుగారు సీతారామశాస్త్రిగారు రాసిన 'ఎప్పుడు ఒప్పుకోవద్దురా ఓటమి' పాటే. 5 డైమన్షన్స్‌లో సాగే ఈ పాటకు పల్లవి, చరణం అనే ఫార్ములా లేకుండా రఘుకౌశిక్ సంగీతాన్ని సమకూర్చారు. తనికెళ్ళ భరణి "చాలా బాగుందిరా... రైటర్‌గా ఈ పాట నీకో మైలురాయి అవుతుంది" అని మెచ్చుకోవడం నేను గర్వంగా భావించే అంశం.

## మనసుంటే చాలు



ప్రముఖ గాయకుడు రామకృష్ణ తనయుడైన సాయికిరణ్ 'నువ్వేకావాలి' చిత్రంతో కథా నాయకుడిగా మారారు. ఉషా కిరణ్ మూవీస్ బేనర్‌తో జొన్నల గడ్డ శ్రీనివాసరావు దర్శకత్వంలో రూపొందిన 'మనసుంటే చాలు' చిత్రం ఆడియో ఇటీవలే విడుదలైంది. హీరో సాయికిరణ్‌ని ఈ ఆడియోలో మీ ఫేవరెట్స్ ఏవి అనడిగితే- "అనాలని వుంది నీతో" పాటలో ప్రేయసీ ప్రియుల మధ్య నుండే అందమైన ప్రేమ బంధాన్ని చాలా బ్యూటిఫుల్‌గా వివరించారు. చాలా అందంగా ఆలోచించి చేసిన, తీసిన పాట ఇది. సాధారణంగా పాట అనగానే వెంటనే ఊహాలోకంలోకి వెళ్ళిపోవడం జరుగుతుంది. ఇక్కడ అలా జరగదు. అమ్మాయికి తన మనసులోని ప్రేమని మాటల్లో కాకుండా ఇలా పాట రూపంలో వివరిస్తాడు అబ్బాయి. అలాగే 'రా చిలకా... రా చిలకా" పాట కూడా నాకు బాగా నచ్చింది. బాలుగారు ఈ పాటని అదరగొట్టేసారు. అంతకన్నా ఎవరూ బాగా పాడలేరనిపించింది. ఆ పాట వింటూ మైమరచిపోయి నేను బాగా నటించేసానపించింది" అన్నారు నవ్వుతూ సాయికిరణ్.



# తాగుబోతుల స్పెషల్



"ఏంటయ్యా బేరర్. ఈ టేబుల్ యిలా ఊగిపోతోంది?"

"ఇందాక ఎవరో కస్టమర్ ఇక్కడ కూర్చుని మందుకొడుతుంటే కొంచెం ఒలికినట్టుంది సార్..."






ఓ తాగుబోతు పోలీసు దగ్గరకు వెళ్ళి.....

"నేను ఎక్కడున్నానో కొంచెం చెప్పు" అని అడిగేడు.

"ఆర్టీసి క్రాస్ రోడ్స్ దగ్గర ఉన్నావయ్యా."

"క్రాస్ రోడ్స్ అంటే సెంటర్‌కి ఏ పక్క..!? తూర్పువైపా, పడమర వైపా, ఉత్తరం వైపా, దక్షిణం వైపా".

"అవన్నీ నాకు తెలీవు కానీ ఓ వైపు సుదర్శన్, దేవి, ఓడియన్ థియేటర్లు ఉన్నాయి. ఇంకో వైపు సప్తగిరి థియేటర్ వుంది. మరో వైపు సంధ్య థియేటర్ ఉంది. కరక్ట్‌గా అక్కడున్నావయ్యా."

"ఇన్ని వివరాలు చెప్పినవాళ్ళు.... అసలు ఇది ఏవూరో ఎందుకు చెప్పరు సార్...!?" మళ్ళీ అడిగాడు తాగుబోతు.



ఒక నిర్మానుష్యమైన దీవిలో చిక్కుకుని పోయారు ముగ్గురు మనుషులు. వాళ్ళ దగ్గర తినటానికి ఏమీలేదు. కేవలం 'కొట్టడానికి' ఓ 'మందు' సీసా మాత్రం వుంది. దాన్నే సరి సమానంగా ముగ్గురూ మూడు భాగాలుగా చేసుకోవాలని నిశ్చయించుకున్నారు. అలా అనుకుని నిద్రకు వుపక్రమించారు. తెల్లవారి లేచి చూసేసరికి ఆ మందు సీసా ఖాళీగా పడి వుంది.

"ఆ సీసాలో మందు ఏమైంది?" కోపంగా అడిగేరు మొదటి యిద్దరూ మూడోవాడిని.

"నా భాగం నాకు తాగాలనిపించింది. అందరికన్నా నేను చిన్నవాడిని కనుక నా భాగం అడుగున వుంటుంది కాబట్టి అది తాగే ప్రయత్నంలో విధిలేక మీ యిద్దరి భాగాలూ తాగాల్సి వచ్చింది...." అన్నాడు మూడోవాడు.



ఓ నడి వయస్కుడు బార్లోకి హడావిడిగా వస్తూ....

"బాబోయ్... బాబోయ్... గొడవ మొదలయ్యేలోపే అర్జెంటుగా నేనో పెగ్గు మందు కొట్టాలి..." అన్నాడు.

అతగాడికో పెగ్గు పోస్తే - తాగేసి మళ్ళీ....

"నాయనోయ్.... ఇది చాలదురోయ్.... గొడవ మొదలయ్యేలోగా ఇంకో పెగ్గు వేస్కోవాల్రోయ్...." అన్నాడు.

అతగాడు అలా పెగ్గుమీద పెగ్గు పోయించుకుని మందుకొట్టేస్తూ వుంటే "ఇంతకీ... గొడవేంటి సార్?" అని ప్రశ్నించాడు బేరర్. 'ఏం లేదయ్యా బాబూ.... నా దగ్గర డబ్బుల్లేవు. డబ్బుల్లేకుండా తాగినందుకు ఇప్పుడు మీతో గొడవ పడొద్దూ" చల్లగా చెప్పాడు.



"రక్షించండి... రక్షించండి... నాకు ఈత రాదు..." సముద్రంలో మునిగిపోతూ అరుస్తున్నాడు ఓ వ్యక్తి.

"అయితే ఏంటయ్యా.... నాకు వయొలిన్ వాయించటం రాదు... ఆ మాత్రం దానికి నేను గట్టిగా అరచి చెబుతున్నానా" అన్నాడు అటుగా వెళ్తున్న ఓ తాగుబోతు.



భర్తగారు రోజూ తాగి రావటం, భార్యగారు పోట్లాటేసుకోవటం ఆ ఇంట్లో రివాజయిపోయింది. ఓ రోజు వారి పోట్లాట తారస్థాయికి చేరుకుంది.

"ఏముందని అలా తాగుతారు"!? అంటూ వేధించడం మొదలుపెట్టింది. భర్త జేబులోంచి మరో క్వార్టర్ బాటిల్ తీశాడు. సీల్ ఓపెన్ చేసి, భార్యనోట్లో బలవంతాన పోశాడు.

"యాక్! థూ!!" అంటూ ఉమ్మేసిందావిడ. "ఎలా తాగుతున్నారీ చాంధాలాన్ని!?" అంది వాంతి చేసుకుంటూ... "చూశావా మరి... నేనేదో తాగి తెగ సుఖపడిపోతున్నట్టు ఎందుకు రోజూ అలా కుళ్ళిపోతావు!? ఇప్పటికైనా తెలుసుకో నేనెంత కష్టాన్ని దిగమింగుతున్నానో!?" అంటూ మిగిలిన బాటిల్‌ని పూర్తిచేసి మంచంపై వాలిపోయాడా భర్త పుంగవుడు.



# తాగు Bothల స్పెషల్



"మందులో ఐస్ వాటరెందుకు కలుపుకుంటారంటావ్!?"
"ఏదో వేన్నీళ్ళకు చన్నీళ్ళు తోడుగా ఉంటాయని".



మందు కొట్టడం వలన కలిగే అనర్థాలను గురించి వివరంగా చెబుతూ "చూశారా... తాగడం వలన ఎన్ని నష్టాలు కలుగుతున్నాయో. మీకు పూర్తిగా తెలియదు. ఒక బకెట్‌లో నీళ్ళు, మరో బకెట్‌లో మందు పోసి దారిన పోయే గాడిద ముందు పెడితే ఏం తాగుతుందో తెలుసా" ప్రశ్నించారు స్వామీజీ.

"నీళ్ళే.... నీళ్ళే...." ముక్తకంఠంతో బదులిచ్చారు సభికులంతా!

"ఎందుకో తెలుసా?" మళ్ళీ ప్రశ్నించారు స్వామీజీ - తన ప్రసంగం వలన జనాల్లో అప్పుడే మార్పు వస్తోందన్న ఆనందంతో!

"అది బుద్ధిలేని గాడిద కాబట్టి...." సభికుల్లోంచి అరిచేడు ఓ గడుగ్గాయి.





"నాకున్న బాధలతో అసలు నిద్రే పట్టటం లేదోయ్. చుట్టూ వున్న అప్పులు, ఉద్యోగంలో ఎదురౌతున్న ఒత్తిళ్ళు, పిల్లల అల్లరి - వీటితో నాకు మతిపోతోంది. పక్క మీద పడుకోటమే కాని నిద్రంటూ పట్టటం లేదు" అంటూ తన గోడును ఓ మిత్రుని దగ్గర వెళ్ళబోసుకుంటున్నాడు కుచేల్రావ్. "అయితే ఓ పని చెయ్యి.... పడుకునే ముందు ఓ గ్లాసు మందు పట్టించు" సలహా యిచ్చాడు మిత్రుడు.

"తాగితే నిద్ర పడుతుందా?" అడిగేడు కుచేల్రావ్ ఆశగా.

"పట్టదు. కాని తాగిన తరువాత నీకున్న కష్టాలన్నీ అసలు కష్టాల్లా అనిపించవు....".



విమానాశ్రయంలో ప్రయాణీకుడిని తనిఖీ చేస్తున్నారు కస్టమ్స్ అధికారి. అతని దగ్గర దొరికిన ఓ పెద్ద సీసాను చూపిస్తూ....

"ఇందులో ఏముంది?" అడిగేడు అధికారి.

"నేను యాత్ర ముగించుకుని తిరిగి వస్తున్నాను. అందులో వున్నది పవిత్రమైన నదీ జలం...." చెప్పాడు అతగాడు.

"నదీ జలమా.... ఏదీ కొంచెం నోట్లో పోసుకుని చూద్దాం..... మరి నాకూ కొంచెం పుణ్యం రావాలిగా..." అంటూ నాలుగు చుక్కలు నోట్లో వేసుకుని "ఎందుకయ్యా..... పెద్దమనిషివై ఉండి అబద్ధాలాడతావ్.... ఇది విస్కీ కాదూ....." కోపంగా అన్నాడు తనిఖీ అధికారి.

"దేవుడా ఎంత గొప్పవాడివయ్యా.... నీ భక్తుల్ని నమ్మని వాళ్ళకి తెలియచెప్పడం కోసం, వాళ్ళని పాపకూపంలో తొయ్యడం కోసం ఎంత గొప్ప అద్భుతాన్ని సృష్టించావ్...!?" అంటూ గట్టిగా అరవడం మొదలు పెట్టాడు ఆ వ్యక్తి.



"ఆ బీరెందుకురా అలా సీసాల మీద సీసాలు పట్టించేస్తున్నావ్?"
"బుగ్గలు రంగు దేల్తాయని".
"అయితే ఆకు కూరలు బాగా తిన్రా....బుగ్గలు రంగు దేల్తాయి."
"పోప్పోరా ఆకు పచ్చ రంగు బుగ్గలు ఎవడికి కావాలి?".



ఓ ఆసామి బార్‌లో టేబుల్ ముందుకు వంగి కూర్చొని బ్రాందీకి ఆర్డర్ చేశాడు. నడుం వంగి పోయింది. శరీరం ముడతలు పడింది. తల ముగ్గుబట్టలా నెరిసి పోయింది. అయినా గ్లాసు మీద గ్లాసు పట్టిస్తుంటే వెయిటర్ ఆశ్చర్యపోయాడు.

"ఇంత వయసొచ్చినా మీరిలా ఉషారుగా వున్నారు. గ్లాసు మీద గ్లాసు పట్టించేస్తున్నారు. ఇంతకీ మీ ఆరోగ్య రహస్యమేమిటి?" అని అడిగేడు.

"ఏముందీ... నేను దేన్ని గురించీ ఎక్కువగా ఆలోచించను. చైన్‌స్మోకర్‌ను. మందుభాయీని, వ్యాయామం జోలికి పోను. రోజూ మీ బార్‌కి వచ్చి బీరూ బ్రాందీలు కలిపి మరీ పట్టిస్తాను. అదే నా ఆరోగ్య రహస్యం...." అన్నాడు.

"అలాగా యింతకీ మీ వయస్సెంత?" అని అడిగేడు వెయిటర్.

"పాతికేళ్ళు...." వణుకుతూ జవాబిచ్చాడా - బీరుబ్రాందీలు కలిపి పట్టించే 'తాగు Both'.

సీరియల్ 6



-మల్లాది వెంకట కృష్ణమూర్తి

కాఫీ పెర్కొలేటర్ విజిల్ వినిపించింది. బామ్మ లేచి వంటగదిలోకి వెళ్ళి కొద్ది నిముషాల్లో రెండు కాఫీ గ్లాసులతో వచ్చింది.

"ఏ జన్మలోనో నీకు వారం వారం ఓ కప్పు కాఫీ బాకీనయ్యా" నవ్వుతూ కాఫీ గ్లాస్ అందించింది. దాంట్లోని ఇక రావద్దన్న సూచనని గ్రహించి దాన్ని తిరస్కరిస్తూ చెప్పాడు సుబ్బారావు-

"బామ్మగారూ హవాయ్ దీవుల నించి తిరుగు ప్రయాణంలో లండన్‌లో ఆగండి. మంచి బోన్‌చైనా క్రోకరీ కూడా దొరుకుతుంది. రెండు మూడు పౌండ్లకి చక్కటి కాఫీ కప్పులు వస్తాయి".



## జరిగిన కథ

అనగనగా ఓ బామ్మ మయసుతో సంబంధం లేని కుర్రమనసామెది. అనన్య ఆ బామ్మకు మనవ రాలు. భక్తి ఎక్కువ. అయితే సినీ తారల పోరా గీక గెటప్పుల లోని ఛాయా చిత్రాలను పూజించే తత్వం. అనన్య పనిచేసే బాంక్‌లోనే ఆఫీసర్‌గా పని చేస్తున్న నిరుపమ్‌కి ప్రతిరోజు కట్ చేసిన ఫోటోభాగాలు వెనక 'ఐ లవ్ యూ' రాసి, పోస్ట్‌లో వస్తుంటాయి. నిరుమమ్ అన్నయ్య వెంకట రత్నం ఓ పెద్ద ఇల్లు ఆ ఊళ్ళోనే వుందని అతి త్వరలో అది తమకు రాబోతుందని అందరితోనూ చెబుతూ వుంటాడు. 'నీకు అక్క చెల్లెళ్ళు ఉన్నారా' అన్న అనన్య ప్రశ్నకు జవాబుగా జాంబవతి గురించి బామ్మ చెప్పడం మొదలు పెడుతుంది. జాంబవతికి పాముల్ని పెంచే అలవాటు ఉండడం వలన ఆమెకు వచ్చిన పెళ్ళి సంబంధాలన్నీ తప్పి పోతూ ఉంటాయి. అలా బామ్మ తరపు బంధువులలో అనన్య తప్ప వేరే వారసులెవరూ లేక పోవటం జరుగుతూ ఉంటుంది. ఈ కథ అంతా బామ్మ చెబుతతుండగా వచ్చిన లింగ మయ్య చూడగానే బామ్మ అనారోగ్యం నటిస్తుంది. అనన్య ఎంత అడిగిన వివరాలు చెప్ప కుండా దాట వేస్తుందామె.

"నన్ను ఊరించలేవు సుబ్బారావ్. ఈ ఇల్లు అమ్మను. ఇక నించి రాకా" చెప్పింది బామ్మ చిన్నగా నవ్వుతూ.

సుబ్బారావు బదులుగా చిన్నగా నవ్వాడంతే.

ఆ ఇల్లున్న స్థలం ఏ బిల్డర్ చేతికొచ్చినా కనీసం కోటిన్నర రూపాయల లాభం ఏడాదిన్నరలో గేరంటీ. అందుకని సుబ్బారావుకి రావద్దని వున్నా, అతనిలోని వ్యాపారస్థుడు వారానికోసారి బామ్మ దగ్గరికి తరుముతుంటాడు.

కాఫీ తాగాక చెప్పాడు.

"ఇక రానులెండి. నాకూ కూసింత ఆత్మగౌరవం వుంది. కాని మీరు మాత్రం దాన్ని బేరం పెట్టదలచుకుంటే మాత్రం నాకు ఫోన్ కొట్టండి. బ్లాక్ అమౌంట్ మొత్తం ముందిచ్చి అగ్రిమెంట్ రోజు మీకు హవాయ్‌కి తిరుగు టిక్కెట్టు ఇస్తాను బామ్మగారూ".

"ఏం చేస్తాం? ఆ రోజు రాదు నాయనా" కొద్దిగా బాధగానే చెప్పింది ఆవిడ.

సుబ్బారావు ఆవిడ కంఠంలో మొదటిసారిగా ధ్వనించిన బాధని పసికట్టాడు.

"అదేంటండీ అలా అంటున్నారు? ఆ రోజు వస్తుందని మీరేగా ఇందాక చెప్పారుగా".

"నేనెక్కడ చెప్పాను?"

"నేను ఆశాజీవినని సర్టిఫై చేసారుగా. అది చాలదూ, ఆ రోజు వస్తుందని నేను అనుకోడానికి"

"అదా?" నవ్వేసిందావిడ.

"మీ ఇంటిని ఎందుకు అమ్మదలచుకోలేదని ఎప్పుడడిగినా ఎందుకు చెప్పరూ?" ప్రశ్నించాడు సుబ్బారావు.

"చెప్పడానికేం వుంది సుబ్బారావ్"

"అది కాదండి సెంటిమెంటల్‌గా, ఈ ఇంట్లోనే పోవాలి లాంటి రీజన్స్ లేదన్నారు. ఈ ఇల్లు అమ్మకూడదని మీ నాన్నగారు నియమాలు పెట్టలేదన్నారు. మీరు ఎక్కడా సేల్ డీడ్ అగ్రిమెంట్ మీద సైన్ చేయలేదన్నారు. ఇంకెందుకు అమ్మదలచుకోలేదో చెప్పరేం? లోకంలో ఇల్లు అమ్మక పోవడానికి ఇంతకంటే పెద్ద కారణాలు నాకేం కనపడం లేదండి".

"అది సస్పెన్స్" నవ్వింది బామ్మ.

"ఫూల్స్ బిల్డ్ హౌసెస్ అండ్ వైజ్‌మెన్ లివిన్ అన్నాడు తెల్లదొర. నేను ఫూల్‌నై ఎంచక్కా మీకో పెంట్‌హౌస్ కట్టిస్తే, మీరు దాంట్లో వైజ్ లేడీలా లివిన్ అవచ్చుకదండి".

"పెంట్‌హౌస్ అంటే, అన్నిటికన్నా పైన వుండేదే కదా?" అడిగింది బామ్మ.

"అవును. ఆ రూఫ్ మీద ఇంకో ఇల్లు పడకుండా టైల్స్‌తో గోపురంలా కట్టేస్తాం. ఆ ఫ్లోర్ మొత్తానికి అదొక్కటే కాబట్టి చుట్టూ బోలెడంత ఆరుబయలు".

"వడియాలు ఎండబెట్టుకోవచ్చు కాని కాకులు రాకుండా ఎండలో కాపలాకి చావాలి. అంతకంటే ఏర్ కండిషన్డ్ జైంట్ హైపర్ మార్కెట్‌లో వాటిని కొనుక్కోవడం బెటర్".

"పెట్టేసారే బామ్మ గారు. నేను వడియాలు ఎండబెట్టుకోవచ్చని చెప్తానని" నవ్వాడు సుబ్బారావు.

"నిన్నివాళా చూస్తున్నది? నాలుగేళ్ళుగా వారానికోసారి చూస్తున్నా కాబట్టి నువ్వు నెక్స్ట్ ఏం మాట్లాడతావో, ఏం ఆలోచిస్తావో నాకు తెలుసు. పెంట్‌హౌస్‌లోకి నీళ్ళేకాదు కరెంట్ కూడా ఎక్కదుగా".

"కరెంట్ ఎందుకు ఎక్కదండి?" ఆశ్చర్య పోయాడు సుబ్బారావు.

"కరెంట్ కట్ అప్పుడు కరెంట్ ఎక్కుతుందా ఏమిటి? సిటీలో హాఫ్ ది టైం కరెంట్ కట్టేగా బాబూ" నవ్వింది.

సుబ్బారావు కూడా నవ్వాడు. కాఫీ పూర్తిగా తాగాక ఆ గ్లాసు నేల మీద కుర్చీ కింద పెట్టి లేచి నిలబడి చెప్పాడు.

"సరే అయితే వెళ్లొస్తాను బామ్మ గారూ".

"వెళ్ళు గానీ, మళ్ళీరాకు నాయనా. నీ టైం వేస్ట్"

"మీకు కాఫీ కూడా వేస్ట్ అని తెలుసు. రాకుండా వుండడానికే ప్రయత్నిస్తాను కాని నా కారు చక్రాలు ఇటు వైపు వచ్చినప్పుడల్లా నాకు తెలీకుండానే మీ ఇంటికి లాక్కొస్తాయి. చుట్టూ న్యూయార్క్‌లా ఫ్లాట్స్, మధ్యలో మీ పాత ఇల్లొక్కటే".

సుబ్బారావు వెళ్ళాక బామ్మ తలుపు లేసుకుంది. చిన్నగా నిట్టూర్చింది. టి.వి ముందు కూర్చున్నా ఆవిడ మనసు టి.విలోని ఏ.ఆర్. రెహమాన్ కాన్సర్ట్ మీద నిలవలేదు. అది ఇది వరకు ఫిల్మ్‌ఫేర్ అవార్డుల సందర్భంలో చూసినందువల్ల కాదు. దాన్ని ఇంకో నాలుగైదు సార్లు యమ ఇంట్రెస్ట్‌గా చూడగలదు. కాని ఆవిడ మనసు గతంలోకి వెళ్ళిపోయింది.

కొద్దిసేపటికి టి.వి. ఆఫ్ చేసి, లేచి ఆ గతం తాలూకు గుర్తయిన ఓ కాగితం కోసం ఇనుప బీరువా తెరిచింది. దానికి కింద వున్న రహస్య లాకర్ తలుపు తెరిచింది. కేవలం వంద రూపాయల కట్ట పట్టేంత మందం గల ఆ చిన్న లాకర్‌లోంచి ఓ కవర్ తీసింది. అందులోంచి ఓ కాగితం తీసి దాన్ని శ్రద్ధగా చదివింది. చేతివ్రాత ఎంతో నీట్‌గా వున్న ఆ కాగితం పూర్తిగా చదివాక ఇంకోసారి నిట్టూర్చింది. ఆవిడ కొద్దిసేపు మౌనంగా ఆలోచనల్లో వుండిపోయింది. తర్వాత ఆ కాగితాన్ని కవర్లో వుంచి దాన్ని యథాస్థానంలో వుంచింది. లాకర్ తలుపు మూసేసింది.

***

వాసవి తన ఇంట్లో ఓ తెలుగు ఛానల్‌లో కుకరీషో చూస్తోంది. ఉల్లిపాయలతో పకోడీలు ఎలా చేసుకోవాలో చెప్తోంది లావుగా, అందంగా వున్న ఓ మహిళ.

"ఉల్లిపాయలని ఇలా చక్రాలుగా కోసుకుని వేసుకుంటే, అవి ఆనియన్ రింగ్స్ అవుతాయి. ఇలా మధ్యకి, మళ్ళీ మధ్యకి, మళ్ళీ ఇంకోసారి మధ్యకి కోసుకుని వేసుకుంటే అవి పకోడీలవుతాయి".

వాసవి కొడుకు రాజు స్కూలు నించి తెచ్చే రిక్షా దిగి లోపలికి పరిగెత్తుకొచ్చాడు. వాడి చేతిలో పది రూపాయల కాగితం వుంది.

"అమ్మా అమ్మా.... " వాడి కంఠం ఎంతో ఎక్సయిటింట్‌గా వుంది.

"ఉండరా" అని వాసవి ఆ టి.వీ. కార్యక్రమం



ఆసక్తిగా చూడడంలో నిమగ్నమైంది.

"....చూసారా నా కళ్ళలో నీళ్ళు? మావారు నన్నేమైనా అన్నారనుకోకండి. ఆయనకి అంత దమ్మలేదు.... ఉల్లిపాయలు తరిగేప్పుడు కళ్ళలో నీళ్ళు రాకుండా వుండడానికి ఓ మంచి చిట్కా చెప్పనా? వాటిని నీళ్ళలో తరిగితే అప్పుడు కళ్ళల్లో నీళ్ళురావు".

"పిచ్చి పిల్లా. అప్పుడు ఊపిరెలా పీల్చు కుంటాం? పైగా నీళ్ళల్లోకి దిగగానే మన బట్టలన్నీ తడిసిపోవూ?" రిమోట్‌తో టి.వి. ఆఫ్‌చేసి చెప్పాడు రాజు.

"రాజూ" కోపంగా అరిచింది వాసవి.

"ఇదిగో చూడు" పది రూపాయల నోటు చూపించాడు రాజు ఆనందంగా.

"ఎక్కడిదిది?"

"స్కూల్ అయ్యాక ఇంటికి రావడానికి రిక్షా కోసం వెయిట్ చేస్తుంటే, రోడ్డు మీద దొరికింది".

"దొరికిందా? పాపం ఎవరు పారేసుకున్నారో!"

"మా వాణి టీచర్".

"నీకెలా తెలుసు?"

"వెదుక్కుంటుంటే చూసాను"

"మరి వాణి టీచర్‌కి ఇచ్చెయ్యలేదా?"

"నాకు దొరికింది కాబట్టి నాది. అదీగాక నిన్న రాత్రికల్లో షిర్డిసాయిబాబా కనబడి నాకు ఇవాళ పది రూపాయలు దొరుకుతాయని చెప్పారని పొద్దున స్కూల్‌కి వెళుతూ చెప్పానా? అలాగే దొరికింది" గర్వంగా చెప్పాడు రాజు.

వాడివంక అయోమయంగా చూసింది వాసవి.

"పారేసుకున్న వాళ్ళ పేరు చెప్పి బాబా ఆ నోటు తిరిగి వాళ్ళకివ్వమని నాకు చెప్పలేదు కదా. చెప్పి వుంటే ఇచ్చేవాడ్నేమో!"

"నిజంగా నీకిది రోడ్డు మీద దొరికిందా? లేక ఎక్కడైనా కొట్టేసావా?" అడిగింది వాసవి కొద్దిగా భయంగా.

"చెప్తే నమ్మకపోతే నేనేం చేసేది? ఇంద. మనం బయటకి వెళ్ళినప్పుడు నాకు కోన్ ఐస్‌క్రీం కొనిపెట్టు" రాజు ఆ నోటుని తల్లికి ఇచ్చేసాడు.

ఆ రాత్రి రోజులాగా కేంప్ నించి వాసవి భర్త ఎస్.టి.డి చేసాడు. మాటల్లో వాసవి ఆ పది రూపాయల నోటు గురించి చెప్పింది.

"అది నిజంగా దొరికిందంటారా? లేక వాడు కొట్టేసి వుంటాడా?" అడిగింది.

"మన ఇంట్లోది కాదుగా అది?"

"ఊహు. నా హేండ్‌బేగ్ చెక్ చేసాను. డబ్బు సరిగ్గానే వుంది".

"అయితే ఆ కల నిజమై వుండచ్చు"

"లేదా కాకతాళీయం అయివుండచ్చు".

"సాయిబాబాని కొట్టి పారేయలేం. రాజమండ్రిలో ఒకాయన ఇంట్లో సీలింగ్, గోడల నించి విబూది వస్తుండగా చూసానని మీ అక్క మరిది చెప్పాడు గుర్తుందా?"

"అవునవును. నక్కబొక్కలపాడులో ఒకావిడకి బాబా దయవల్ల ఆయన మీద భక్తి పాటలు స్ఫురిస్తాయని మీ అక్క మరిది కూడా చెప్పాడు గుర్తుందా? అర్ధరాత్రి మెలకువరాగానే ఆ పాట పలక మీద రాసేసుకుంటుందిట, తెల్లారికి గుర్తుండదని, కాని మనవాడు ఆ పది ఎక్కడో కొట్టేసి ఇలా కల ప్లాన్ వేసి, ఐస్‌క్రీం కొనమని నాకిచ్చాడేమోనని నా ఆశ అండి. ఈ వయసులోనే ఇంత అల్లరి చిల్లరిగా వుండగలిగితే, రేపు పెద్దయ్యాక ఏ ఫైనాన్స్ మినిస్టరో అవచ్చుకదండి" ఉత్సాహంగా చెప్పింది వాసవి.

"బొత్తిగా లైఫ్ సెక్యూరిటీ లేని ఉద్యోగం వాడికొద్దు. హెలికాప్టర్‌లో వుండగా అది కూలో, కొత్తకారులో ప్రమాణిస్తుంటే బాంబు పేలో టపీ మంటాడు. సాయిబాబాకి నమస్కారం పెట్టుకో, నిజంగా ఆయన కలలో కనబడే చెప్పాడన్నదే నిజం చేయమని".

ఆ విషయం మీద మరో నిముషం చర్చించుకున్నాక ఫోన్ పెట్టేసాడు వాసవి భర్త.

****

బేంక్‌లో పని చేసుకుంటున్న నిరుపమ్ ఫోన్ మోగగానే రిసీవర్ ఎత్తి చెప్పాడు.

"హల్లో... అలాగా?" ఒక్క నిముషం" అని లేచి గోళ్ళకి పూనుకున్న రంగుని ఆరబెట్టుకుంటున్న అనన్య దగ్గరికి వెళ్ళి చెప్పాడు.

"మీకు ఫోన్"

"థాంక్సండి. చూడండి మన మేనేజరు. లంచ్‌టైంలో కదా నేను గోళ్ళకి రంగేసుకుంది. అసలెందుకు వేసుకున్నావని అడుగుతున్నాడు."

"మేనేజర్లంతా అంతే. మీకున్న అందమైన గోళ్ళని చూస్తే ఈర్ష్య. తమ పెళ్ళాలకి అంత క్యూట్ ఫింగర్ నెయిల్స్ వుండవని" సర్దిచెప్పాడు నిరుపమ్.

తన సీట్‌లోని ఫోన్ రిసీవర్ అందుకుంది అనన్య.

"హలో.. ఎవరిది?" అడిగింది.

"అనన్యేనా అమ్మా?" అడిగిందో మగకంఠం అటునించి

"అవునండి. మీరు?"

"సుబ్బారావునమ్మ"

"ఓ మీరా! చెప్పండి ఏమిటి. మా బామ్మని మళ్ళీ కలిసారా?"

"ఇందాక మీ ఇంటికెళ్ళానమ్మా"

"ఏమంది?" "ఎప్పుడు పాడే పాటే. ఇల్లు అమ్మనంది"

"అయ్యో! నేనూ మా బామ్మకి చాలాసార్లు, మనిషికి చెప్పినట్లు చెప్పి చూసాను సుబ్బారావుగారూ. ఇల్లు ససేమిరా అమ్మనంటుంది".

"ఎందుకంత ఇది?"

"అదీ చెప్పి చావదు" విసుగ్గా చెప్పింది అనన్య.

"దాదాపు కోటికి పైగానే వస్తుందమ్మా ఆ ఇంటికి. ఇప్పటికే చాలాకాలం బ్రతికింది. ఇంకెంత కాలం బ్రతుకుతుంది? ఆ డబ్బుతో ఆఖరి దశలో హాయిగా జీవించవచ్చు కదమ్మా. ఇల్లేం వెంట తీసుకుపోలేంగా అంటే వినదు".

"నేను ఇదే మాటంటాను బామ్మతో. ఇల్లు అమ్మడానికి ఒప్పుకోదు".

"మనిషి చచ్చినా ఆశ చావదని ఇలాంటి వాళ్ళని చూసిన వాళ్ళే అనుంటారు. పూర్వం లక్ష ఎంతో ఇప్పుడు కోటి అంత. నీకు ఐఏఎస్ లేదా ఐపిఎస్ ఆఫీసర్ పెళ్ళి కొడుగ్గా వస్తాడు. లేదా అమెరికాలోనో, ఆస్ట్రేలియాలోని పని చేసే గ్రీన్ కార్డ్ హోల్డర్ ఆ కోటిలో సగం కట్నంగా ఇస్తే ఆ డబ్బుని కళ్ళకద్దుకుని నిన్ను చేసుకుంటాడు".

"అదే కదండి నా ఆశ. కాని మా బామ్మ కో ఆపరేట్ చేయడం లేదు"

## జస్ట్ ఫర్ ఫన్

### తేల్చుకుందాం, రా!

కక్షిదారుల కేసు ఓపిగ్గా విని "ఏమయ్యా? మీ తగువు కోర్టు దాకా రావాలా? ఆ మాత్రం పరిష్కారం చేసుకోలేరూ?" అని ప్రశ్నించాడు జడ్జి.

"చిత్తం. మేమా పని మీదే



ఉన్నామండి. ఈలోగా పోలీసులొచ్చి పట్టేశారండి" ముక్తకంఠంతో జవాబిచ్చారు కక్షిదారులు.

-గోపి

"సర్లేమ్మా. ఎప్పటికి అది నాకు రాసి పెట్టి వుంటే అప్పటికే దక్కుతుంది".

అవతలి వైపు ఫోన్ పెట్టేసాడు సుబ్బారావు. అనన్య కూడా రిసీవర్ పెట్టేసింది.

వాళ్ళిద్దరు రిసీవర్ పెట్టాక, అంతదాకా వాళ్ళ సంభాషణని జాగ్రత్తగా, రహస్యంగా విన్న నిరుపమ్ కూడా తన టేబుల్ మీది ఎక్స్‌టెన్షన్ ఫోన్ రిసీవర్‌ని క్రెడిల్ మీద పెట్టేసాడు.

ఆ సుబ్బారావు ఎప్పుడు ఫోన్ చేసినా, ఆ ఇంటి గురించి, కోటి గురించి, ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్., లేదా గ్రీన్ కార్డ్ హోల్డర్ గురించో మాట్లాడుతూండడం, అనన్యకు కూడా అలాంటి వుద్దేశమే వున్నట్లుగా మాట్లాడడం గమనిస్తున్నాడు నిరుపమ్.

అనన్యని ఫస్ట్‌గేర్‌లో ప్రేమిస్తున్న నిరుపమ్‌ని, ఆ ఇల్లు, ఆ కోటి తర్డ్‌గేర్‌లోకి తీసుకెళ్ళాయి. ఎలాగైనా అనన్యని తన స్వంతం చేసుకుని తద్వారా ఆ కోటిని కూడా తన స్వంతం చేసుకోవాలన్నది అతని ఆశ. అసలా ఇల్లెలా వుంటుందో ఓ సారి చూడాలని కూడా వుంది అతనికి. అయితే అనన్య మాత్రం ఎన్నడూ తనని వాళ్ళింటికి పిలిచేలా లేదు అనిపిస్తోందతనికి.

నిరుపమ్‌కి తనకున్న బలహీనత తెలుసు. ఏ ఆడపిల్లతోనూ ముఖాముఖి 'ఐ లవ్ యూ' అని చెప్పలేడు. అందుకు సిగ్గు, మొహమాటం, భయం లాంటి ఎన్నో మానసిక లక్షణాలు అతనిలో కలగా పులగంగా బలంగా నాటుకుని అడ్డుపడుతున్నాయి. కాని తనాముక్క అనకుండా ఏ అమ్మాయి కూడా తనని ప్రేమించదని, ఇలాంటి వాటిలో ఇనీషియేషన్ ముందు మగాళ్ళనించే రావాలని ఆడపిల్ల అనుకుంటుందని కూడా నిరుపమ్‌కి తెలుసు.

చెప్పలేక పోతే పోయే. ఉత్తరం ద్వారా తెలియచేయచ్చుగా అనుకున్నాడు. అయితే లెటర్స్ రాయడం అంటే నిరుపమ్‌కి ఎంతో బద్ధకం. పైగా లవ్ లెటర్స్ ఎలా రాయాలో కూడా తెలీదు. ఆ మధ్యోసారి బుక్ ఎగ్జిబిషన్‌లో బిజినెస్ లెటర్స్ అన్న పుస్తకం చూసి 'లవ్ లెటర్స్' మీద కూడా ఇలాంటి బుక్ వుందా అని అడిగితే లేదన్నాడు షాపువాడు.

అప్పుడతనికి గుర్తుకొచ్చింది. తనకి జిగురు అనే మిత్రుడున్నాడని, అతను ఎన్నో పత్రికల్లో సబ్ ఎడిటర్‌గా పని చేసాడని, అతని చేత లవ్‌లెటర్ రాయించడం ఉత్తమోత్తమం అన్న అభిప్రాయానికి రాగానే నిరుపమ్‌కి సంతోషమేసింది.

***

జిగురు ప్రసాద్ అసలు పేరు జి.గురుప్రసాద్. అయితే తెలుగు భారతి అనే స్కూలులో టి.సి.లో అతనిపేరు ఎక్కించిన క్లర్క్, జిపక్కన ఫుల్‌స్టాప్ తీసేసి కాపీ చేయడంతో జిగురుప్రసాద్ అయింది. జి.గురుప్రసాద్ కూడా అది చూసుకోలేదు. దాంతో రికార్డుల్లో, అతని పేరు జిగురుప్రసాద్‌గా మారింది. అంతా జిగురు ఇంటిపేరు అనుకోసాగారు. చివరికి ఇతను దాన్నే తన ఇంటి పేరుగా చేసుకుని జిగురు పేరుతో జర్నలిస్ట్‌గా ప్రసిద్ధి కెక్కాడు. అతను పని చెయ్యని పత్రిక లేదు.

విషయం విన్నాక జిగురు చెప్పాడు నిరుపమ్‌తో

"దాందేముంది? ఏ రకం ప్రేమలేఖ కావాలంటే ఆ రకంవి రాసివ్వగలను ఎలాంటిది కావాలి?"

"నాకు ఆ వ్యవహారాలు అంతగా తెలీవు. లవ్ లెటర్స్‌లో ఎన్ని రకాలున్నాయి?" అడిగాడు నిరుపమ్

"నేనెన్ని పత్రికల్లో పని చేసానో అన్ని రకాలు! కాకపోతే ఈ సమయానికి నాకు ఈ రాత్రికి రాయల్ ఛాలెంజ్ బీర్ కొట్టిస్తానని మాట ఇవ్వాలి".

"సరే?" అలాగే".

"బీర్ అంటే, ప్లూరల్ కాని సింగ్లర్ కాదు నా డిక్షనరిలో"

"అలాగే"

"బీర్‌తో పాటు మిర్చి బజ్జీలు కూడా. మా ప్రెస్‌క్లబ్‌లో అవి అద్భుతంగా వండుతారు".

"అలాగే"

"త్రిబుల్ ఫైవ్ సిగరెట్ పాకెట్ అక్కడ అమ్మరు. బయటే కొనుక్కుని రావాలి నాకు".

"అలాగే"

"తర్వాత 'దర్బార్ హైద్రాబాది' రెస్టారెంట్‌లో బిర్యానీ కూడా ఇప్పించాలబ్బాయ్"

"ఓ.కే. ఓ.కే. సరే. ఇక విషయానికొస్తారా"

"అదేం?"

"నన్ను ఇంటి దగ్గర స్కూటర్ మీద డ్రాప్ చెయ్యాల్సింది నువ్వే కదా?"

"బీర్ తాగినంత మాత్రాన స్కూటర్ నడపలేరా ఎక్కడైనా?"

"నడప గలరు. కాని మా జర్నలిస్ట్‌లలో ఒకరిద్దరు అలా నడిపి స్కూటర్‌ని పడేసారు. ఒకరు హాస్పటల్‌లోంచి ఇంటికి వెళ్తే, ఇంకొకరు మార్చురీలోకి వెళ్ళారు.

"అసలు హాస్పటల్‌కే వెళ్ళకుండా సరాసరి ఇళ్ళకి వెళ్ళే వాళ్ళని ఉదాహరణగా తీసుకోవాలెప్పుడూ!

"సరే" అని జిగురు ఓ సిగరెట్ వెలిగించి రెండు దమ్ములు లాగి, నాలుగుసార్లు దగ్గి, కళ్ళ జోడు సర్దుకుని, ఆఫీసు నించి ఇంటికి కొట్టేసుకొచ్చిన న్యూస్‌ప్రింట్‌తో చేసిన స్క్రిబ్లింగ్ పేడ్ మీద పెన్ను పెట్టాడు.

పెట్టిన పెన్నుని దించకుండా అతగాడు టకటక పేజీ తర్వాత పేజీని రాయడం చూసాక అనిపించింది నిరుపమ్‌కి. ఇంత వేగంగా రాయకపోతే దినపత్రిక టైంకి రాదని.

అరగంట తర్వాత అతను తన కళ్ళజోడుపై నించి చూస్తూ చెప్పాడు.

"వరసగా చదువుతాను విను"

నరేంద్ర ఆసక్తిగా ముందుకి వంగాడు. జిగురు రెండు సార్లు దగ్గి సిగరెట్‌ని ఆర్పేసి చదవసాగాడు.

-(ఇంకా వుంది)



# లలిత సంగీతం

## చరణములే నమ్మితి నీ దివ్య



ప॥ చరణములే నమ్మితి నీ దివ్య ॥చరణములే॥

1. చ॥ వనమున రాతిని వనితగజేసిన
చరణము శరణము శరణము నీ దివ్య ॥చరణములే॥

2. చ॥ వారధి గట్టిన వరభద్రాచల
వరదా వరదా వరదా నీ దివ్య ॥చరణములే॥

3. చ॥ పాదార విందమే ఆధారమని నేను
పడితి పడితి పడితి నీ దివ్య ॥చరణములే॥

4. చ॥ బాగుగ నన్నేలు భద్రాచలరామ
దాసుడ దాసుడ దాసుడ నీ దివ్య ॥చరణములే॥


ప్రముఖ గాయకుడు,
స్వరకర్త లలిత సంగీత
విద్వాంసుడు, వాగ్గేయకారుడు
**ఎం.చిత్తరంజన్**
సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-7402993


ప॥
; రిమానిపా గా, రి సారి | సా ; ; ; సగా రి గామ గ ॥
. చర ణాము లే.. నమ్మి | తి . . . నీ . . దివ్యా . ॥
మా పసానిసా నిపా గా, రి సారి | సా ; ; ; ; ; ; ; ॥
. చ . ర . ణాము లే . . నమ్మి | తి . . . . . . . ॥

చ॥
; పనీ మ పా నీ ; సాసా | ; ప గా రిగా సారి స నీసా ॥
. వన మున రా . తి ని | . వని త గ జే . సి . న ॥
; దీనీ రి సా ; దీ నీ మ పా | ; గ మా నిపా గారి గామగ ॥
. చర ణాము . శర ణము | . శర ణాము నీ . దివ్యా . ॥

మా
. ॥ చరణాము లే ॥

మిగిలిన చరణాలు మొదటి చరణమువలె పాడుకోవాలి.

ని = కైశికి నిషాదం
నీ = కాకలి నిషాదం
దీ = చతుశ్రుతి దైవతం
గ = అంతర గాంధారం

భద్రాచల రామదాసు కీర్తన
సంప్రదాయ సంగీతం

| | | | |
|---|---|---|---|
| రాగం: | కాపి 22వ మేళకర్త | పీలు | |
| | ఖరహర ప్రియరాగ జన్యం | (హిందుస్తాని సంగీతం) | |
| తాళం : | ఆది (కర్ణాటక సంగీతం) | కహరువా: | (హిందుస్తాని సంగీతం) |

వక్రసంచారంగల రాగం

ఆరోహణ : స రి మ ప ని(2) స

అవరోహణ : స ని(1) ద(2) ని(1) ప ద(1) ప మ గ(2) మ గ(1) రి స

| | | |
|---|---|---|
| ని(1)=కైశికినిషాదం | ద(1)=శుద్దదైవతం | గ(1)=సాధారణ గాంధారం |
| ని(2)=కాకలి నిషాదం | ద(2)= చతుశృతి దైవతం | గ(2)=అంతరగాంధారం |

ఆరోహణలో - షడ్జము, చతుశృతి రిషభం, శుద్ధమధ్యమం, పంచమం, కాకలి నిషాదం.

అవరోహణలో - షడ్జము, కైశికి నిషాదము, చతుశృతి దైవతము, కైశికి నిషాదము, పంచమం, శుద్ధదైవతం, పంచమం,

# రామభక్త శిఖామణి రామదాసు



"తారకమంత్రము కోరిన దొరికెను ధన్యుడనైతిని ఓరన్నా" అని పరమానంద భరితుడైన కంచర్ల గోపన్న రామ తారకమంత్రాన్ని ఉపదేశించిన గురువు కబీర్. ఆ మంత్ర జపంతో మైమరచిన గోపన్న "శ్రీరామ నీనామ మేమిరుచిరా" అంటూ ఆనందాన్ని, ఆశ్చర్యాన్ని పొందాడు. శ్రీరాముని పట్ల గోపన్నకు అచంచలమైన విశ్వాసం కుదిరింది. అది బలపడింది. గోపన్న రామదాసు అయినాడు. "తక్కువేమీ మనకు రాముండొక్కడుండు వరకు" అంటూ తన దృఢ భక్తిని ప్రకటించాడు. ఎలుగెత్తి చాటాడు. ఆ భక్తితోనే భద్రాచలంలో ఆలయ నిర్మాణానికి చందాలు వసూలు చేసిన పైకం సరిపడక పోగా సర్కారు సొమ్ము వినియోగించాడు. తత్ఫలితంగా గోలకొండ నవాబైన తానీషా రామదాసుకు పన్నెండు సంవత్సరాల కారాగార శిక్ష విధించాడు.

కారాగారంలో రామదాసు అనేక బాధలు పడుతూ "రక్షించే దొరవని నమ్మితి - నన్ను శిక్షింప తప్పేమిజేసితి", "పాహిమాం శ్రీరామా అంటే పలుకవైతివి", "పలుకె బంగారమాయెనా కోదండ పాణి", "రామచంద్రులు నాపై చలము చేసినారు - సీతమ్మా చెప్పవమ్మా", "నను బ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" అంటూ పరిపరివిధాల తన వెతలను తనకు సర్వస్వము అయిన శ్రీరామునితో మొర పెట్టుకున్నాడు. ఎంత వేడినా తనపై రామునికి దయరాలేదని "ఇక్ష్వాకుల తిలకా యికనైన పలుకవే రామచంద్రా -నను రక్షింపకున్నను రక్షకు లెవరింక" అని నిలదీశాడు. "సీతమ్మకు చేయిస్తి చింతాకు పతకము, లక్ష్మణునకు చేయిస్తి ముత్యాల పతకము" అంటూ తాను చేసిన కైంకర్యాలన్నీ ఏకరువు పెట్టాడు. చివరికి బాధలు భరించలేక "కులుకుచు తిరిగేవు ఎవడబ్బ సొమ్మని రామచంద్రా" అంటూ కోపం ప్రకటించి, అంతలోనే "అబ్బా తిట్టితినని ఆయాస పడబోకు రామచంద్రా - ఆ దెబ్బల కోర్వక అబ్బా తిట్టితినయ్యా రామచంద్రా" అంటూ క్షమాపణలు చెప్పుకున్నాడు. కడకు శ్రీరామలక్ష్మణులు స్వయముగా వచ్చి తానీషాకు దర్శనమిచ్చి ధనమిచ్చి, గోపన్న రామదాసు అని రుజువు చేశారు.

భగవంతుడు భక్తపరతంత్రుడనే సత్యాన్ని మరొక్కసారి నిరూపించిన మహాభక్తుడు రామదాసు. ఆయన హృదయం భక్తి రసార్ణవం. అందులోంచి మనకు లభించిన అమూల్య మాణిక్యాలే మనం వినే రామదాసు కీర్తనలు.

అజరామరమైన ఆ మహాభక్తుని రామకీర్తనలు తరతరాలుగా మన ఆంధ్రావని ప్రతి గృహంలోనూ నినదిస్తూ మనలను పునీతం చేస్తున్నవి.

శుద్ధమధ్యమం, అంతర గాంధారం, శుద్ధమధ్యమం, సాధారణ గాంధారం, చతుశృతి రిషభం.

వక్ర సంచారం గల యీ రాగంలోని స్వరాలన్నీ వివిధ రకాలుగా ప్రయోగించబడతాయి. హిందుస్తానీ రాగం పీలులో యివే స్వరాలున్నా రాగ సంచారంలోను, ప్రయోగాలలోను స్వరాల పోకడలు వైవిధ్యంతో రక్తిని కలిగిస్తాయి. ఆరోహణ పని సరిగా అంటూ మంద్రస్థాయిలో ప్రారంభమై, అవరోహణ సనిదప అంటూ కాకలి నిషాదాన్ని, శుద్ధదైవతాన్ని కలుపుకుని ట్రీట్‌మెంటులో కాపిరాగానికి కొంత భేదంగా వుండి వింత అందాలను సంతరించుకుంటుంది పీలురాగం. కాపీలో కంటే పీలులో సాధారణ గాంధార ప్రయోగం ఎక్కువగా కనిపిస్తుంది. సంగీతంలో వున్న మొత్తం 12 స్వరాలలో 10 స్వరాలు యీ కాపి, పీలు రాగాలలో వున్నాయి. ఎక్కువ స్వరాలుండడం చేత రాగ విస్తృతికి అవకాశం కూడా ఎక్కువగా వుంటుంది. కాపిరాగం భక్తి, శృంగారాలకు అనువైనది. అలాగే పీలూ కూడా. లలిత సంగీతానికి బాగా ఉపయోగపడే రాగాలు యీ రెండు.

ఎంతో భావుకతతోను, ఆర్తితోను, భక్తి పారవశ్యంతోను, రామదాసు పలికిన ప్రతి కీర్తనా ఆణిముత్యమే. "పలుకే బంగారమాయెనా", "నన్నుబ్రోవమని చెప్పవే సీతమ్మ తల్లీ" అంటూ మామూలు మాటలే అయినా ఆ కీర్తనలలో ఆయన హృదయావేదన ఎంతటిదో మనము అర్థం చేసుకోవచ్చు. "చరణములే నమ్మితి" అనే యీ కీర్తనలో "వనమున రాతిని వనితగ జేసిన చరణము శరణము శరణము" అని, "పాదారవిందమే ఆధారమని నేను పడితి పడితి పడితి నీదివ్యచరణములే నమ్మితి" అని ఆయన హృదయం నుండి దూసుకువచ్చే ఆ పదాలు ఎటువంటివారినైనా యిట్టే ఆకట్టుకుంటాయి. భజన సంప్రదాయ పద్ధతిలో యీ కీర్తనలన్నీ మన ఆంధ్రదేశంలో ఎంతో కాలం నుండి శాస్త్రీయ సంగీత విద్వాంసులు, లలిత సంగీత కళాకారులు , భజన బృందాలు తన్మయతతో గానం చేస్తూనే వున్నారు. అలా బహుళ ప్రచారాన్ని పొందిన కీర్తనలలోయీ కాపి రాగకీర్తన కూడా ఒకటి.

## కాపీ రాగంలో తెలుగు చిత్రాలలోని కొన్ని పాటలు

| | | చిత్రం | గానం | సంగీత దర్శకుడు |
|---|---|---|---|---|
| 1. | పిలిచిన బిగువటరా | మల్లీశ్వరి | భానుమతి | ఎస్.రాజేశ్వరరావు |
| 2. | వద్దురా కన్నయ్య | అర్ధాంగి | జిక్కి | భీమవరపు నరసింహారావు |
| 3. | అందాలబొమ్మతో | అమరశిల్పి జక్కన్న | సుశీల | ఎస్.రాజేశ్వరరావు |
| 4. | లాలినమకన్నయ్య | పెద్దరికాలు | ఆర్.బాలసరస్వతి | మాస్టర్ వేణు |
| 5. | నా చెలిరోజావే | రోజా | బాలు, సుజాత | ఎ.ఆర్.రెహమాన్ |
| | | పీలురాగం | | |
| 1. | ఎక్కడమ్మా చంద్రుడు | అర్ధాంగి | జిక్కి | భీమవరపు నరసింహారావు |
| 2. | పిల్లనగ్రోవి పిలుపు | శ్రీకృష్ణవిజయము | ఘంటసాల, సుశీల | పెండ్యాల |
| 3. | ప్రభుగిరిధారి శౌరిరావయా | పురువు - ప్రతిష్ట | సుశీల | పెండ్యాల |
| 4. | ఏ దివిలో విరిసిన పారిజాతమో | కన్నెవయసు | జానకి/బాలు | సత్యం |
| 5. | ఎన్నాళ్ళని నా కన్నులు కాయగ | వేంకటేశ్వరమహాత్మ్యం | పి.శాంతకుమారి | పెండ్యాల |
| 6. | వటపత్రశాయికి వరహాల లాలి | స్వాతిముత్యం | సుశీల | ఇళయరాజా |
| 7. | నీలాల కన్నుల్లో మెలమెల్లగా | నాటకాలరాయుడు | సుశీల | జి.కె.వెంకటేశ్ |
| 8. | ఓ పంచవన్నెల చిలకా | అప్పుచేసి పప్పుకూడు | ఘంటసాల/స్వర్ణలత | ఎస్.రాజేశ్వరరావు |

## పీలూరాగంలో హిందీ చిత్రాలలోని పాటలు

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ధీరోసే ఆజారే | అల్బేలా | లత, చితల్కార్ | సి.రామచంద్ర |
| 2. | ఝూలేమే పవన్‌కే | బైజూబావరా | లత, రఫీ | నౌషాద్ |
| 3. | లేజామేరీ దువాయేఁ | దీదార్ | లత | నౌషాద్ |
| 4. | యాకహ్‌దే హమ్ ఇన్‌సాన్ నహీఁ | ఛాయా | రఫీ | సలిల్‌చౌదరి |
| 5. | ముఖ్‌మోడ్ నలేనా సాజ్‌నా | | లత | మదన్‌మోహన్ |
| 6. | జిన్హే నాజ్‌హై హింద్ పర్ వోకహాఁహై | ప్యాసా | రఫీ | ఎస్.డి.బర్మన్ |
| 7. | చందన్‌కాపల్‌నా రేషమ్‌కీ డోరీ | షబాబ్ | లత, హేమంత్‌కుమార్ | నౌషాద్ |
| 8. | బన్‌వారీరేజీనే కాసహారా తేరా నామ్‌రే | ఏక్‌ఫూల్‌చార్‌కాంటే | లత | శంకర్‌జైకిషన్ |
| 9. | మురలీబైరన్‌బయీ | నయీదిల్లీ | లత | శంకర్‌జైకిషన్ |



# రాంపండు లీలలు

## రాంపండూ - ఐస్‌దిండూ

కానీ రాంపండు ఇదంతా పూర్తిగా వినలేదు. అనంత్‌ను చూడగానే పకపక నవ్వు. 'మా ఆఫీసు బాయ్‌ని హడల గొట్టేసేవుట! నువ్వూ నీ మైదానూ! వాడు ఆఫీసులో అందరికీ చెప్పి ఒకటే నవ్వించడం. మా సబెడిటరు గారు మరీ హుషారు. 'మీ ఫ్రెండు ప్రహసనం మన 'జల్సా'లో వేద్దామండి' అంటూ ఒకటే గోల".

అనంత్ ఉడుక్కున్నాడు. "అదంతా పక్కన బెట్టు. అసలు మీ రామ...".

"....ఆయన్ని నేను రానిచ్చేదేముందిరా? ఆయన ఇష్టం వచ్చిన రూట్లో వస్తాడు, పోతాడు. ఆయన నెత్తిమీద పడాలని పెట్టిన మూడు కిలోల మైదా నీ నెత్తిమీదే పడిందటగా, అచలపతి చెప్పాడులే" అన్నాడు రాంపండు.

".... ఇదంతా నీ కోసం చేశానన్న విషయమైనా నీ నవ్వును ఆపలేదా?" కసిగా అడిగాడు అనంత్.

రాంపండుకి అదేమీ ఎక్కినట్లు లేదు. "ఒరేయ్ ఇవాళ సుమనోహరి ఇదంతా చెప్తే ఎంతలా నవ్విందో తెలుసా? దీనిమీద ఓ గేయం రాస్తానంది. ప్రస్తుతం సోంపల్లి వెళ్తోంది. వీలైతే నాటకం రాసి, అక్కడ ప్రదర్శిస్తుందంట. నువ్వు ఒప్పుకుంటే హీరో వేషం నీదేనట.."

అనంత్ ఇంకా ఎగురుతూనే ఉన్నాడు "మీ సుమనోహరికి పని లేదా? అక్కడికెందుకు వెళ్లడం? అది మా ఫ్యామిలీ ఫ్రెండ్స్ ఇల్లు".

రాంపండు నవ్వు ఇగిరిపోయింది. "ఒరేయ్, కొంపదీసి ఈ అమ్మాయితో కూడా వరస కలిపేస్తావా? నేను ఎవర్ని లవ్ చేసినా వాళ్లు నీకు కావలసిన వాళ్లు అయి కూచుంటున్నారు. దీనికి అడ్డుతగిలితే మాత్రం నేనూరుకోను చెప్తున్నా. ఈ శనాదివారాల్లో నేను తనతో అక్కడికి వెళుతున్నా. వెంటరాకు".

అరేబియన్ నైట్స్‌లో రాకుమారుడి వంటి

> "ఊటీ ప్రయాణానికి ఏర్పాట్లన్నీ సిద్ధంగా ఉన్నాయి సర్"
>
> ఈ విషయాన్ని అచలపతి చెప్పడం అప్పటికే మూడోసారి. కానీ అనంత్ బదులు చెప్పలేదు. రాంపండు మీద ఎలా కక్ష తీర్చుకోవాలన్నదే అతని తక్షణ కర్తవ్యం అయి కూచుంది.
>
> "రాంపండు ఇంకా దొరకలేదా? ఆఫీసులో ఏమంటున్నారు?"
>
> "రాత్రి సుమనోహరిగారిని డిన్నర్‌కు తీసుకుని వెళ్లడం వలన ఆఫీసుకు లేటుగా వస్తానని చెప్పారటండి".
>
> "హు" అని బుసకొట్టాడు అనంత్. 'డిన్నర్లు వాడికి, మైదా స్నానాలు తనకు... రానీ చెప్తాను' అనుకున్నాడు పదిహేనోసారి.
>
> రాగానే చెప్పాడు కూడా, 'చూడు రాంపండూ, నీ పద్ధతి బాగాలేదు. నీ కోసం, నీ ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ పోగొట్టడం కోసం కష్టపడి నేను ప్లాను వేస్తే చెడగొడతావా? మీ రామబ్రహ్మం మేష్టారుని నీ ప్రైవేటు డోర్‌లోంచి ఎందుకు రానిచ్చావురా?"

వాడు అనంత్. ' ఈ గదిలో వున్న 778తలుపుల్లో మాత్రం ఏది తెరిచినా మానినా 436వది మాత్రం తెరవకు' అంటే ముందు అదే తెరిచి చూసేరకం. రాంపండు ప్రేమ సఫలం కావడానికి తను ఇంత చేస్తే తన త్యాగాన్ని గుర్తించక పోగా లవర్‌తో కలిసి తన మీద జోకులేస్తాడా?' అని కోపం వచ్చి సోంపల్లికి వెళ్లితీరదామని అనుకున్నాడు. కానీ అతని సహజమైన బద్ధకం, ఊటీ ప్రయాణానికి అచలపతి చూపే ఉబలాటం అతన్ని జోకొట్టాయి. అదైనా మాంకాళి అత్తయ్యనుండి ఫోన్ వచ్చేవరకే.



### ఉడ్‌హౌస్ ఘర యూ

ఆరోజు సాయంత్రం "మీ మాంకాళి అత్తయ్యగారి నుండి ఫోన్ సర్" అంటూ అచలపతి రిసీవరు అందివ్వగానే అనంత్ కాస్త వణికాడు. 'మళ్లీ ఏం ముప్పు వచ్చి పడిందిరా' అనుకుంటూ.

హల్లో, హల్లో, హల్లో ... నేను అనంత్‌ని, హల్లో"

"నువ్వేమైనా చిలకవా ఏమిట్రా. హల్లో హల్లో అంటూ వల్లె వేయడానికి! చిలకయినా బాగుండి పోను. జోస్యం కార్డులు కరక్టుగా తీసేలా ప్రాక్టీస్ చేసేవాడివి. ఇప్పుడదీ లేదు. "మాంకాళి అత్తయ్య గొంతు చించుకుంటోంది.

"ఇది చెప్పడానికేనా ఫోన్ చేశావ్?" అనంత్ అడిగీ, అడగనట్లు అడిగాడు.

"ఏమిటో గొణుక్కుంటున్నావ్. అసలే ముసలిదాన్ని. సరిగ్గా చెప్పి చావు."

"అదేదో నువ్వే చేయి" అని మనసులో అనుకుని "ఊ" అన్నాడు అనంత్.

"ఇంకా ఏదీ చెప్పకుండానే ఊకొడతావేం? సరిగ్గా వినటం లేదా? నువ్వు ఈ శనాదివారాల్లో సోంపల్లి వెళ్లు".

"సోంపల్లా?"

"అలా అరుస్తావేం? నా చెవులు బద్దలయిపోతాయి. సోంపల్లి మర్చిపోయావా? వర్ధనమ్మగారి ఊరు. నాకు బెస్ట్ ఫ్రెండ్. నిన్ను చూడాలని ఉంది పంపమంది. వెళ్లు. వెళ్లి



నా పేరు నిలబెట్టేలా నడుచుకో".

"అబ్బే ఇప్పుడెందుకు వెళ్లడం? ఆవిడ నన్నేం చూస్తుంది?" నాన్చాడు అనంత్.

"వెధవ కబుర్లు చెప్పకు. నేనడిగితే సరేనంది"

అనంత్ ఇంకా కన్‌ఫ్యూజ్ అయిపోయాడు. "నువ్వెందుకు అడగడం?"

మాంకాళి అత్తయ్య నుదురు కొట్టుకున్న శబ్దం ఫోన్‌లో కూడా స్పష్టంగా వినబడింది. ".... ఎందుకంటే బండా పాండురంగం గారు అక్కడికి వస్తున్నారు కాబట్టి! రామారంలో వారింటికి వెళ్లినప్పుడు నువ్వు వేసిన వెర్రి వేషాలు చూసి నీకు మతి స్థిమితం లేదనుకుంటున్నాడాయన. వాళ్ల అబ్బాయినీ నువ్వు బ్రిడ్జి మీద నుండి తోసేశావట. వాళ్ల అమ్మాయి సరదాగా ఉండబోతే విదిలించుకుని వచ్చేసావట. నీకు బుర్ర ఏ మాత్రం సరిగ్గా ఉన్న షాలినిలాటిదాన్ని వదిలి పెట్టేవాడివి కాదని ఆయన వాదన".

"ఆ శాండోషాలినంటే వాళ్ల నాన్నకు ముద్దేమో గానీ..."

"అనవసరంగా వాగక. నువ్వు సోంపల్లి వెళుతున్నావ్. ఆయన్ని ఇంప్రెస్ చేయబోతున్నావ్. నా పరువు కాపాడబోతున్నావ్. అంతే" అంటూ మారు మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా ఫోన్ పెట్టేసింది అత్తయ్య.

కాసేపు అనంత్ కళ్ల ముందు ఓ త్రాసు వేళ్లాడింది.

'ఊటీ, ఊటీ' అని కలవరిస్తున్న అచలపతి ఒక పళ్లెంలో 'సోంపల్లి వెళ్లు' అని ఆజ్ఞాపిస్తున్న అత్తయ్య ఒక పళ్లెంలో వేళ్లాడేరు. అంతలోనే అనంత్‌లో సైతాన్ కూడా త్రాసు ప్రవేశం చేశాడు. 'సోంపల్లి వెళ్లు. సుమనోహరి ప్రేమ కొల్లగొట్టు. రాంపండుపై కక్ష సాధించు' అని అటు మొగ్గేట్లు చేశాడు.

దాని ఫలితమే ఊటీ టిక్కెట్లు కాన్సిల్ చేయమని అచలపతికి (అతని చూపుల్ని లెక్క చేయకుండా) ఆర్డరేసి శనివారం పొద్దున్న కల్లా సోంపల్లిలో అనంత్ తేలడం, సుమనోహరి ఎక్కడుందని వాకబు చేయబోవడం. మధ్యాహ్నాని కల్లా అనంత్ అతి హుషారుగా ఉన్నాడు.

"అచలపతీ, ఒక తమాషా విన్నావా? సుమనోహరి ఎవరో కాదు తెలుసా! నా చిన్నప్పటి క్లాస్‌మేట్ సుబ్బలక్ష్మి. కవిత్వం రాయడానికి మారు పేరు పెట్టుకుంది".

"మంచిదినర్" అన్నాడు అచలపతి ముభావంగా.

"అచలపతీ, నువ్వు ముఖం మాడ్చుకున్నట్లు మొహం చూడకుండానే తెలుస్తోంది. ఎలాగో తెలుసా? మాడు కంపు కొడుతుంది. ఛీర్ అప్ మై బోయ్. నేను సుమనోహరిని పెళ్లి చేసుకోబోతున్నాను".

"నిజంగానా సర్"

"చూడు అచలపతీ ఇంత గొప్ప న్యూస్ నువ్వింత నిస్సారంగా రిసీవ్ చేసుకోవడం ఏమీ బాగాలేదు. సుబ్బలక్ష్మి నీకు తెలియని వ్యక్తి కూడా కాదు".

"తెలుసుకాబట్టే ఆమె మీ స్థాయికి సరిపోతుందాన్న అనుమానం సర్".

"నీ భయం నా కర్థమయింది 'ఏకాంతం' వంటి గంభీర కవితలు రాసే అమ్మాయి నా 'కఫ్ ఆప్ టీ' కాదని నీ భయం కదా!' కానీ సుబ్బలక్ష్మి...



అదే సుమనోహరి భలే సరదామనిషి తెలుసా. ఎంత బ్రెయిన్ అనుకున్నావ్! రాంపండుని ఏడిపించ డానికి ఎంత బ్రిలియంట్ ఐడియా చెప్పిందో తెలుసా? ఒరిజినల్ అయిడియా. అది చేస్తే తను నాదాని నంది'' అనంత్ హుషారుగా చెప్పబోతూండగానే అచలపతి అడ్డుపడ్డాడు.

".... రాంపండుగారు అప్పుడేం చేస్తున్నారు సర్?"

"వాణ్ని వేరే పని మీద పంపించి ఇవన్నీ చెప్పింది. ఇంతకీ వాడి రూమ్ ఎక్కడన్నావ్? కొంపదీసి మన మాటలు వినబడవ్ కదా. వినబడితే జాగ్రత్త పడతాడు.

"ఆయన గది మొదటి అంతస్తులో ఉంది సర్. మాటలు వినబడవ్. మీ అయిడియా అమలు చేయడంలో నేను చేయవలసింది ఏదైనా ఉందా సర్?"

"ఉంది, ఉంది ఒక ఐస్‌బ్లాక్ తెప్పించి, అంటే మరీ పెద్దది కాదు. ఓ దిండులో పట్టేది తెప్పించి గదిలో ఓ మూల పెట్టు. ధాన్యపు పొట్టులో వేసి పెడితే అర్ధరాత్రి దాకా కరిగిపోకుండా ఉంటుంది".

"అయిసు బ్లాకా?" అని ఆశ్చర్యంగా అడుగుతున్న అచలపతిని పట్టించుకోకుండా అనంత్ లంచ్‌కి వెళ్లి పోయాడు. అక్కడ పాండురంగం గారు తగిలేరు. "ఏంవోయ్ బాగున్నావా?" అన్న పలకరింపులోనే "ఇప్పటికైనా బాగు పడ్డావా?" అన్న పరామర్శ వినబడింది. దాన్ని పట్టించుకోకుండా అనంత్ చాలా మర్యాదగా మసలుకుంటూ పనిలో పనిగా మాంకాళి అత్తయ్యను కూడా చాలా మెచ్చుకున్నాడు. దెబ్బకి వర్ధనమ్మగారు, పాండురంగంగారు ఇద్దరూ సంతోషించారు.

రాత్రి పన్నెండు దాటాకనే అనంత్ తన ప్లాను (అంటే సుమనోహరి ప్లాను) అమలులో పెట్టాడు.

తనకు వేసిన పక్క మీదనుండి దిండు తీసుకున్నాడు. గలేబు తీసేసి దాంట్లో ఐసుబ్లాకు దిమ్మ దూర్చాడు. అది చంకన పెట్టుకుని మొదటి అంతస్తులో ఉన్న రాంపండు గదికి వెళ్ళాడు. కిటికీలోంచి తలుపు గడియ జాగ్రత్తగా లాగి (కాలేజీ హాస్టల్లో ఉండగా ఇవన్నీ సీనియర్స్ శ్రద్ధగా నేర్పిన విద్యలే!) మంచం మీద పడుక్కుని ఉన్న రాంపండు దిండు పక్కనే ఈ దిండు పెట్టేసి వెనక్కి మరలాడు.

ఇంకొక్క నిమిషంలో అనంత్ వరండాలోకి వచ్చేసే వాడే కానీ అంతలోనే ఢామ్మని చప్పుడయింది. చల్లగా జారుకోవడానికి అనువుగా వుంటుందని, తెరిచిపెట్టిన తలుపు జోరుగా గాలి రావడంతో పెద్ద చప్పుడుతో మూసుకుపోయింది.

"ఎవరక్కడ?" అరిచింది మంచం మీద లేచి కూచున్న ఆకారం.

అనంత్‌కి రెండు విషయాలు స్పష్ట మయ్యాయి. అప్పటిదాకా గుర్రుకొడుతున్న శాల్తీని కూడా నిద్రలేప గలిగినంత గట్టిగా తలుపు మూసుకుంది. రెండు ఈ శాల్తీ వేరెవ్వరైనా కావచ్చు కానీ రాంపండు కాదు. రాంపండు వాయిస్ జేసుదాసు పాట పాడబోయి ఫెయిలయ్యే అమెచ్యూర్ గొంతులో పలికే కీచుగొంతులాటిది. ఏకాదశి ఉపవాసం తర్వాత బ్రేక్ ఫాస్ట్ తెమ్మని అరిచే పులిలాటిది ఈ గొంతు.

అనంత్‌ది వట్టి మట్టి బుర్ర అని మాంకాళి అత్తయ్య సర్టిఫికెట్టు ఇవ్వడానికి రెడీయే కాని కొన్ని సందర్భాల్లో అతనిది చురుకైన బుర్రే. రాంపండు గదిలో పులి ఎందుకొచ్చింది అనే మీమాంస పెట్టుకోకుండా ఆ గదిలోంచి బయట పడడానికి తలుపు తీసి జోరుగా బయటకు వచ్చేసాడు. కొన్ని సెకన్లలో బంగళా చుట్టూ ఆవరించిన అమావాస్య చీకటిలో కలిసి పోయే వాడే కానీ అతని లుంగీ తలుపులో ఇర్క్కుకుపోవడం వల్ల గదిలోంచి బయటకు వచ్చిన పులి పాండురంగం వేషంలో అతని భుజాల మీద చేయి వేయడం జరిగింది.

"నువ్వా?" అని గాండ్రించాడు పాండు రంగం.

"నేను నేనుగాక నువ్వెలా అవుతావ్?" అందామనుకుని ఊరుకున్నాడు అనంత్.

అంతలోనే పాండురంగం కళ్ళల్లో జాలి ప్రవేశించింది. "ఇవేళ అమావాస్య కదూ" అన్నాడు. "పద లోపలికి వెళదాం" అంటూనే పక్క మీద తన పక్కనే కూచోబెట్టుకోబోయి కెవ్వున కేక పెడుతూ లేచాడు.

"ఇదేమిటి పక్క తడిగా ఉంది?"

పైకి చూశాడు. కప్పు లీక్ కావటం లేదు. బయట వర్షం లేదు. ఆయనకేం అర్థం కాలేదు. ముందు అనంత్‌ను పంపించి తర్వాత ఆ విషయం కనిపెడదామనుకున్నాడు.

"ఇంత అర్ధరాత్రి నా గదికే వద్దామని నీకెందుకు అనిపించింది నాయనా?" అడిగాడు శాంతంగా.

"మిమ్మల్ని రాంపండు అనుకున్నానండి" అన్నాడు అనంత్ వణుకుతూ.

"మరి రాంపండును ఎవరనుకున్నావ్?"

"అబ్బే అలాక్కాదు. ఈ రూమ్‌లో రాంపండు ఉన్నాడనుకున్నానండి".

"అలా, ఎలా అనుకొన్నావ్? రాంపండూ, నేను రూములు మార్చుకున్నామని మీ అచలపతికి చెప్పానే! మీ ఇద్దరూ ఫ్రెండ్స్ కాబట్టి నువ్వు రాత్రిపూట కబుర్లు చెప్పడానికి వచ్చి తలుపు కొట్టి నిద్ర డిస్టర్బ్ చేస్తావేమోనని ముందు జాగ్రత్తగా చెప్పి వుంచాను. మరీ ఇలా అర్ధరాత్రి వస్తావని..."

అచలపతికి తెలుసా? తెలిసినా చెప్పలేదా? ఊటీ ప్రయాణం మాన్పించిన మాత్రాన ఇంత

## జస్ట్ ఫర్ ఫన్



## పదండి ముందుకు!

మద్యపానానికి వ్యతిరేకంగా పోరాటం సాగిస్తున్న నారీమణులు కొందరు తమ ఫ్లాట్స్‌లో ఉన్న మగాళ్ళ చేత మందు మానిపించేయాలని కంకణం కట్టుకుని ముందస్తుగా ఓ ఫ్లాట్‌కి వెళ్లారు.

ఆ ఫ్లాట్ రైల్వేలో పని చేసి రిటైరైన ఓ పెద్దమనిషిది. నారీ జనం వెళ్ళే సరికి ఆ పెద్దమనిషి తీరిగ్గా ఈజీ చైర్‌లో కూర్చుని ఉన్నాడు.

"అన్నయ్యగారూ! మీరు చివరిసారిగా మద్యం ఎప్పుడు పుచ్చుకున్నారు?" అంటూ ఓ చెల్లెమ్మ డైరెక్టుగా పాయింటుకి వచ్చేసింది.

పెద్దమనిషి కాస్సేపు ఆలోచించి "1955 కాబోలు" అన్నాడు.

చెల్లెమ్మ తెగ సంతోషపడి పోయి "అమ్మయ్య.... అప్పట్నించీ మీరు పూర్తిగా మందు మానేసినట్టేనా! మళ్ళీ పుచ్చుకోరు కదా" అని ఆరాటంగా అడిగింది.

రైల్వే పెద్దమనిషి గాఢంగా నిట్టూర్చి "మరీ అంత ఖచ్చితంగా చెప్పలేను కానీ..." అంటూ రిస్టువాచీ చూసుకుని "ఏదీ... ఇప్పుడింకా 2015 కదా అయిందీ..." అంటూ వెనక్కివాలాడు. -గోపి

కత్తికడతాడా?

అనంత్‌కి ఒళ్ళు మండిపోయింది.

"...నీకు వైద్యం చేయించమని మీ అత్తయ్యకు చెప్పినా వినటం లేదు. పైగా... అవునూ.... అలా చేతులు దులుపుకునే అలవాటు నీకు ఎప్పట్నించి అదేమిటి... ధాన్యపు పొట్టు రాలుతోంది? చిన్న పిల్లలు మట్టిబెడ్డలు తిన్నట్లు నీకు ధాన్యం పొట్టు తినే అలవాటుందా?"

ఐసుగడ్డ కంటిన ధాన్యపు పొట్టు చేతికంటు కోవడం వల్ల వచ్చిందీ చిక్కు. అంతలోనే పాండు రంగం గారి చూపు నేలమీద, పక్కమీద పడిన ధాన్యపు పొట్టుమీద పడింది. నీళ్లు ఓడుస్తున్న దిండు మీద పడింది. రెండూ, రెండూ కలిపాడు. నాలుగు వచ్చినట్లు తెలుసుకుని తల పంకించాడు.

"సరే పొద్దున్న తీరుబడిగా మాట్లాడుకుందాం. అందాకా నువ్విక్కడే ఈ పక్కమీదే పడుకో్. నీ రూమ్ రెండో అంతస్తులో కదా. నేను అక్కడికి వెళ్లి పడుక్కుంటాను" అని అనంత్ మారు మాట్లాడడానికి అవకాశం ఇవ్వకుండా వెళ్లిపోయాడు.

ఆ రాత్రి తడి పక్కమీద అనంత్ పడిన బాధ భగవంతుడికే తెలుసు. బహుశా అచలపతికి కూడా! అందుకే పొద్దునే వచ్చి మంచంకోడుకి తల ఆన్చి కూచుని నిద్రపోతున్న యజమానికి నిద్రలేపి కాఫీ ఇచ్చాడు.

"గుడ్‌మార్నింగ్ సర్".

"మార్నింగ్ గుడ్డేమో కానీ, నైట్ మాత్రం వెరీ బాడ్ అచలపతీ" అన్నాడు అనంత్.

కాఫీ చప్పరించగానే ప్రాణం లేచి వచ్చింది. జ్ఞాపకశక్తి తిరిగి వచ్చింది.

"అవును అచలపతీ. పాండురంగంగారు తను రూము మార్చుకున్న విషయం నీకు చెప్పారా? లేదా?" కటువుగా ప్రశ్నించాడు.

"చెప్పారు సర్. అది మీకు నేను చెప్పకపోవడానికి ఓ కారణం ఉంది." అచలపతి చెప్పబోయేడు.

".... కారణం ఏదైనా రాత్రి నేను పడ్డ అవస్థ నీకు తెలిసి వుంటే...."

"అది ఎలాంటి అవస్థయినా శాండోషాలిని గారిని పెళ్ళి చేసుకోనడం కంటె పెద్ద అవస్థ కాదు కదా సర్"...

"మధ్యలో ఈ తిరకాసేమిటి?"

"మీకు తట్టలేదా సర్? మీ మాంకాళి అత్తయ్యగారు మిమ్మల్ని ఇక్కడికి పంపడంలో ఉద్దేశ్యం అదే. గతంలో ఉష అత్తయ్య గారు చెప్పగా మీరు రాంపురం వెళ్లి షాలినిని పెళ్లాడకుండానే వచ్చేశారు. ఈసారి ఆ అమ్మాయి తండ్రినీ, మిమ్మల్ని ఓ చోటకు రప్పించి మనసుమార్చి ఆయన శాండోషాలినిని మీకు ఆఫర్ చేసేట్లా చేయాలని మాంకాళి అత్తయ్యగారి ప్లాను" అచలపతి విశదీకరించాడు.

అనంత్ గడగడ వణికాడు. మరిన్ని గుక్కలు కాఫీ తాగేడు. కాఫీ తాగడంతో బుర్ర మళ్లీ పని చేసింది. "అంటే ఈ సంఘటన వల్ల నేను పిచ్చివాణ్ని అనుకొని పాండురంగంగారు నన్ను దూరంగా పెట్టేస్తాడంటావ్ అంతేనా? కానీ అచలపతీ నీవో విషయం మర్చిపోతున్నావ్. నా రియల్ టార్గెట్ రాంపండు అని ఇవాళ పొద్దున్నకి ఆయనకి తెలిసి పోతుంది. ఇద్దరు యువకుల మధ్య ఇదో చిలిపి సంఘటనగా కొట్టేసి నన్ను "రాముడు మంచి బాలుడు" అనేసుకుంటాడు."

"రెండో సంఘటన జరక్కుండా ఉంటే ఆయన అలాగే అనుకునేవారేమో సర్".

"రెండవ సంఘటనా?"

"అవును సర్. ఆయనా రూమ్‌కి వెళ్లిన ఇంకో గంటకి ఓ ఆకారం ప్రవేశించి ఆయన దిండు పక్కనే మరో ఐసుదిండు పెట్టి వెళ్ళి పోవడంతో మీరు నిజంగా అదో టైపు అన్న అభిప్రాయం బలపడిపోయిందాయనకు".

"మైగాడ్ మళ్లీనా? అచలపతీ. నాకు నిద్రలో నడిచే అలవాటు ఉందంటావా?"

"లేదు సర్. అలా పెట్టింది రాంపండు గారు. ఆ రూమ్‌లో ఉన్నది మీరనుకుని ఐసుదిండు పెట్టారు. పొద్దునే కనబడి "ఎలా వున్నాడు మీ బాస్ తడిసిన పక్కలో నిద్ర పట్టిందా?" అని అడగడంతో నాకీ సంగతి తెలిసింది".

"అవునా? వాడికే ఇదే అయిడియా రావడం కాకతాళీయంగా లేదూ? గ్రేట్ బ్రెయిన్స్ థింక్ ఎలైక్ అంటారు ఇదే కాబోలు" అనంత్ ఆశ్చర్యపడ్డాడు.

"సర్, మాటకు అడ్డువస్తున్నాను. దీనిలో మీ బ్రెయిన్ ఏమీ లేదు. ఇది సుమనోహరి గారి ఐడియా. "రాంపండు గదిలో ఐసుదిండు పెట్టమని మీకు చెప్పినట్టే మీ గదిలో ఐసు దిండు పెట్టమని ఆయనకు చెప్పారట. ఇద్దరినీ ఒకరి మీద ఒకరిని ఉసికొలిపి...."

అనంత్ మొహం అదోలా అయింది. "ఇక చాలు అచలపతీ. నా హృదయం గాయపడింది. ప్రేమ చచ్చిపోయింది. ఇక్కడ్నించి బయట పడదాం"

"బయటపడితే మీకు దేహశుద్ధి చేద్దామని పాండురంగంగారు కాచుకుని కూచున్నారు సర్".

"మరి ఏం చేద్దాం?"

"మీరు పొలాల వెంబడి పరిగెట్టి రైలు స్టేషన్ చేరండి. మీ బట్టలవీ పట్టుకుని నేను అక్కడికే వచ్చేస్తాను".

"అచలపతీ మర్చిపోతున్నావ్. మన ఊరు వెళితే మాంకాళి అత్తయ్య ఫోన్ చేసి మళ్ళీ వెళ్లమంటుంది"

"పోనీ ముందు అనుకున్నట్టు ఊటీ వెళ్ళిపోతే?"

"అచలపతీ రానురాను నీకు మతిపోతోంది. ఊటీ టిక్కెట్లు కాన్సిల్ చేశాంగా".

"సర్, నా వల్ల చిన్నపొరపాటు జరిగింది. టిక్కెట్లు కాన్సిల్ చేయలేదు. అదృష్టవశాత్తూ అవి నా దగ్గరే... ఇక్కడే ఉన్నాయి. మీరు సరేనంటే..."

అనంత్ గాఢంగా నిట్టూర్చాడు. మొత్తానికి అచలపతి తన పంతం నెగ్గించుకున్నాడు.

"రైట్ అలానే కానీయ్" అన్నాడు ఓ వెర్రి నవ్వు నవ్వి.

**-ఎమ్బీయస్ ప్రసాద్**

(పి.జి.ఉడ్‌హవుస్ రాసిన 'జీవ్స్ అండ్ ది యూల్ టైడ్ స్పిరిట్ 'కథ ఆధారంగా).







పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

**తారాగణం**

వెంకటేష్, భూమికచావ్లా,
విజయకుమార్, మంజుల, వర్ష
అనిల్‌రాజ్, ఆలీ, సునీల్, రంగనాథ్,
సాయికృష్ణ, బ్రహ్మాజీ

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| కెమెరా | : రమేష్ |
| డాన్స్ | : కూల్ జయంత్, రాజుసుందరం, గణేష్(ముంబై),లారెన్స్. |
| మాటలు | : త్రివిక్రమ్ శ్రీనివాస్ |
| సంగీతం | : హరీష్ జయరాజ్ |
| పాటలు | : పోతుల రవికిరణ్, సీతారామశాస్త్రి, సాహితి |
| ఎడిటింగ్ | : మార్తాండ్ కె. వెంకటేష్ |
| ఆర్ట్ | : ఆనంద్‌సాయి, మురుగన్, మావుళ్ళు |
| పి.ఆర్.ఓ. | : పసుపులేటి రామారావు |
| అసిస్టెంట్ డైరెక్టర్ | : జి. గురుప్రసాద్ |
| కో-డైరెక్టర్స్ | : వై.ఆర్ రంగరాజ్, కె. నందగోపాల్ |
| ఎగ్జిక్యూటివ్ నిర్మాత | : కె. బెనర్జి |
| నిర్మాత | : కె.యస్. రామారావు |
| కథ, స్క్రీన్‌ప్లే,దర్శకత్వం | : కరుణాకరన్ |







యలమంచిలి గీత సమర్పించు
బొమ్మరిల్లు వారి

లాహిరి-లాహిరి-లాహిరిలో

పాఠక
పుస్తక
ప్రియులకోసం
సినీ సంగీత
విశ్లేషకుడు
'రాజా'
పర్యవేక్షణలో
'హాసం'
అందిస్తున్న
ప్రత్యేక
కానుక
ఇది.

**తారాగణం**

నందమూరి హరికృష్ణ, భానుప్రియ, సుమన్,
రచన, వినీత్, సంఘవి, ఆదిత్య, అంకిత,
కె.విశ్వనాథ్, లక్ష్మి, కీ॥శే॥ చక్రవర్తి, సత్యప్రియ,
రవితేజ, ప్రకాష్‌రాజ్, సత్యప్రకాష్,
జయప్రకాష్ రెడ్డి, రఘునాథరెడ్డి, బ్రహ్మానందం,
ఎమ్మెస్ నారాయణ, కాంతారావు.

**సాంకేతిక నిపుణులు**

| | |
|---|---|
| మాటలు | : చింతపల్లి రమణ |
| పాటలు | : సీతారామశాస్త్రి, కీరవాణి |
| పి.ఆర్.ఓ. | : రాంబాబు వర్మ |
| స్టిల్స్ | : రాజా |
| కో డైరెక్టర్ | : కొండా రాజేష్ |
| ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్ | : కొమ్మినేని వెంకటేశ్వరరావు |
| సంగీతం | : కీరవాణి |
| డైరెక్టర్ ఆఫ్ ఫోటోగ్రఫీ | : ప్రసాద్ కె. ఆర్. |
| కూర్పు | : కోటగిరి వెంకటేశ్వరరావు |
| ఫైట్స్ | : రాజు |
| డాన్స్ | : శంకర్ |
| స్టోరీ డెవలప్‌మెంట్ | : దీన్‌రాజ్ |
| నిర్మాత, కథ, స్క్రీన్ ప్లే - దర్శకత్వం | : వై.వి. యస్. చౌదరి |



రచన: సాహితి — 1 — గానం: కె.కె., క్లింటన్, టిప్పు

ప: సోనారే... సోనారే... సున్ సున్ సోనారే ॥2॥
కో: సోనారే... ఏ ఓహో... సోనారే... ఏయ్... ఏయ్... ఏయ్... ఓహో...
స్పోర్టివ్ బోయ్స్ సై సీ గాళ్స్ యూతే హేపీనెస్
డాన్స్ గైస్ ఫాస్ట్ బీట్స్ ఎంజాయ్ ఆల్ ది డేస్ ॥స్పోర్టివ్॥
మన యూత్తూ మేధస్సుకు ఆకాశమే సరిహద్దూ
మన జర్నీ ఏనాడూ ఆపదు ఏ చెక్‌పోస్టూ...
చ :రైన్‌బోని సెట్ చేసి వాలిబాల్ ఆడేద్దాం
సూర్యుణ్ణే ఓ స్ట్రైకర్ చేసి కారమ్స్ ఆడేద్దాం
శాటిలైట్ రెక్కలపై తూగుటూయలూగేద్దాం
కోయిలతోనే పోటాపోటీ కీ బోర్డ్ వాయిద్దాం
మన శక్తికి సాటిలేదని లోకానికి చాటిచెప్పరా
పాకిస్తాన్ బోర్డర్‌లో చెడుగుడునే ఆడేయ్‌రా
ఐ.రా.స. సభలోనే జనగణమన పాడేయ్‌రా
సోనారే ॥స్పోర్టివ్॥
చ :కో: ఓ మామ... ఓ మామ... సయ్యే... ఓయే...
డై సబ్మిట్ పవరెట్టీ డే, నైట్ శ్రమ చేస్తే
ఎవరెస్టయినా మన పాదాల కిందికి వస్తుంది
డేరింగ్ మైండ్ గురిపెట్టి
కేర్‌ఫుల్‌గా నువు అడుగేస్తే
విక్టరీ తప్పక ఏదోనాడు తలుపే తడుతుంది
మన కండలో బలము ఉన్నది
బుర్రలో యమ తెలివి వున్నది
ఈ రెండూ ఒకటైతే ఎదురింకా ఏముందే ఏదైనా సాధిస్తాం...
ఇదిగో మా ఛాలెంజ్ ॥స్పోర్టివ్॥
కో: సోనారే... సోనారే... సున్‌సున్ సోనారే

1 వాసు

రచన: పోతుల రవికిరణ్ — 6 — గానం: బాలు

సాకి: నీ జ్ఞాపకాలే నన్నే తరిమేనే నీకోసం
నేనే పాటై మిగిలానే చెలియా చెలియా... ఓ చెలియా
ప: పాడనా తీయగా కమ్మని ఒకపాట
పాటగా బతకనా మీ అందరినోట
ఆరాధనే అమృత వర్షం అనుకున్నా
ఆవేదనే హాలాహలమై పడుతున్నా నాగానమాగదులే
ఇక నాగానమాగదులే ॥పాడనా॥
చ :గుండెల్లో ప్రేమకే గుడి కట్టేవేళలో
తనువంత పులకింతే
వయసంతా గిలిగింతే
ప్రేమించే ప్రతిమనిషీ ఇది పొందే అనుభూతే
అనురాగాల సారం జీవితం అనుకుంటే
అనుబంధాల తీరం ఆనందాలుంటే
ప్రతి మనసులో కలిగే భావం ప్రేమేలే ॥2॥ ॥పాడనా॥
చ :ఆకాశం అంచులో... ఆకాశం అంచులో ఆవేశం చేరితే
అభిమానం కలిగెనులే
అపురూపం అయ్యెనులే
కలనైనా నిజమైనా కనులెదుటే ఉన్నాలే
కలువకు చంద్రుడు దూరం... ఓ నేస్తం
కురిసే వెన్నెల వేసే ఆ బంధం
ఈ విజయం వెనుక ఉన్నది నీవేలే ॥2॥ ॥పాడనా॥

వాసు 6

రచన: కీరవాణి — 1 — గానం: ఉదిత్‌నారాయణ్, చిత్ర

ఆ: ఏయ్... కలవరమా... ఓయ్... పరవశమా...
వ/అ: కళ్ళలోకి కళ్ళుపెట్టి చూడలేకున్నా...
చూడకుండా ఒక్కనిమిషం ఉండలేకున్నా...
పంచదార ఎంతతిన్నా చేదుగుందండి...
చింతపండే కారమయ్యి చంపుతోందండి...
ఆ: అదేరా ప్రేమంటే కన్నా...
ఎదంతా వ్యాపించి నీదుంపతెంచే ప్రేమా ప్రేమా ప్రేమా... ॥కళ్ళలోకి॥
చలిచలి గాలుల్లో వెచ్చగ ఉంటోందా...
ఎండను చూస్తే చలి వేస్తోందా...
ఎదురుగ నువ్వున్నా విరహం పుడుతోంది.
ఏ నిజమైనా కలగా ఉంది...
విసుగేదో కలిగింది... దిగులేదో పెరిగింది...
అసలేదో జరిగింది... మతికాస్తా పోయింది...
ఆ: అదేరా ప్రేమంటే చిన్నా
ఎదేదో చేసేసి నీతొంపముంచే ప్రేమా ప్రేమా ప్రేమా... ॥కళ్ళలోకి॥
చిటపట చినుకుల్లో పొడిపొడిగుంటోందా...
చినుకే నీకు గొడుగయ్యిందా...
నిద్దురలో ఉన్నా మెలకువలా ఉంది...
మెలకువలోనే స్పృహ లేకుంది...
చూపేమో చెదిరింది... మాటేమో వణికింది...
అడుగసలే పడనంది...కుడిఎడమై పోయింది...
ఆ: అదేరా ప్రేమంటే బిచ్చా...
అలాగే వేధించి నీ అంతుచూసే ప్రేమా ప్రేమా ప్రేమా... ॥కళ్ళలోకి॥

రచన: సిరివెన్నెల — 2 — గానం: యం.యం. కీరవాణి

స్వా/అ: కాషాయ వస్త్రాల కమండల ధారీ
మోక్షానికి లేదయా అడ్డదారి
పెళ్ళి చేసుకుని ఫ్లాటు తీసుకుని
ఆనందంలో అంతు తెలుసుకుని
సంసారాన్నే ఈదాలోయ్... సుఖసారాన్నే చాటాలోయ్...
బంధుమిత్ర పరివారముతో... బయలుదేరి పోదాం రారో...
మేళతాళాల సందళ్ళో... పాలు పంచుకుందాం రారో...
పు/అ: మన వీరవెంకటసత్యన్నారాయణ పెళ్ళి...
చి॥సౌ॥నాగవెంకట రత్నకుమారి తోటి...
ప్రేమ పంచాంగం తిరగేసి వీలు ఉన్న మూర్తం చూసి...
అయినవాళ్ళం అంతావచ్చి... అంగరంగ వైభోగంగా...

1

చ/అ: చెప్పుకుంటు ఉండగా విన్నాను గాని భామా
ఇప్పుడిప్పుడిప్పుడే చూసాను తొలిప్రేమా...
ఆ: చూపులలో చేరగానే ఈ ప్రేమ
మొత్తంగా లోకమే మారిందమ్మా
అ: చూసుకోదుకద ఎదరేమి ఉంటుందో
ఆ: ఊసుపోని కథ ఎదకేమి చెపుతుందో
అ: తొలి ఉదయం తానై పిలిచే ప్రేమా
పు/ఆ: ఓహోహో చిలకమ్మా
పలికే ఓ పంచదార చిలకమ్మా
చక్కెరంటి మాటచెప్పి చిక్కులన్నీ తీర్చినావే చిలకమ్మా

రచన: సిరివెన్నెల — 9 — గానం: సుఖ్వీందర్‌సింగ్, చిత్ర

పు/అ: నడుము ఒంపుల్లో నాట్యం చేసే జడగంటలనే చూస్తుంటే
కిలిమిరే కిలిమిరే కిలిమిరే హే
ఆ: గడుసు కళ్ళతో గాలం వేసే పురుషోత్తములను చూస్తుంటే
కిలిమిరే కిలిమిరే కిలిమిరే హే
అ: ఒప్పుల కుప్పలో ఉప్పెన తగ్గేలా
ఆ: పోకిరి గిత్తలో దూకుడు ఆగేలా
అ: జడివానలా ఈడు చెలరేగితే
కిలిమిరే కిలిమిరే కిలిమిరే హే... ॥నడుము॥
చ/అ: అందాల అమ్మకూచి హోయ్ హోయ్ హోయ్
నకరాల నంగనాచి
ఆరుబయటే ఊరేగించే జారుపైటే ఆడే దోబూచీ
ఆ: కోణంగి కొండముచ్చి హోయ్ హోయ్ హోయ్
కరువార తొంగిచూచి
కైపురెచ్చి కంగారొచ్చి పాడుపేచీ పెంచకు శృతిమించీ
అ: కొస్త వుంచి మరికొస్త దాచి కవ్వించి నవ్వుతుంటే
ఆ: కొంత చూసి కొండంత చేసి ఊహించి కెవ్వుమంటే
అ: అంతాదోచి అంతే చూసే కొంటె ఊపు రేపితే
కిలిమిరే కిలిమిరే కిలిమిరే హే... ॥నడుము॥
చ/ఆ: తొలిసారి మితిమీరి హోయ్ హోయ్ హోయ్
తరువాత బ్రతిమాలి
జాలివేసే దాకాఎన్ని కాళ్ళ బేరాలైనా చేస్తారు
అ: మొదటేమో బెట్టు చేసి హోయ్ హోయ్ హోయ్
వదిలేస్తే సైగచేసి
ముందుకాళ్ళకి బంధాలేసి అందకుండా ఆటాడిస్తారు
ఆ: పట్టుపట్టి జతకట్టమంటూ బతిమాలు వేటగాళ్ళు
అ: వెంటవెంట తిప్పించుకుంటూ ఆటాడు మాయలేళ్ళు
ఆ: తాడోపేడో తేలేదాకా గిల్లికయ్య మాడితే
కిలిమిరే కిలిమిరే కిలిమిరే హే... ॥నడుము॥

4

6

రచన: పోతుల రవికిరణ్ **5** గానం: కె.కె., స్వర్ణలత

ప :పాటకు ప్రాణం పల్లవి అయితే... ఓ ఓ ఓ ఓ... పల్లవి అయితే... (2)
సో నా ప్రేమకు ప్రాణం ప్రేయసి కాదా ఓఓఓఓ... ప్రేయసి కాదా (2)
బి బహామ... బి బహామ...
ఎవరేమనుకున్నా వినదీ ప్రేమా... బహామ
ఎదురేమవుతున్నా కనదీ ప్రేమా... బహామ
కనులే తెరిచున్నా కల ఈ ప్రేమా... బహామ...
నిదురే రాకున్నా నిజమో ప్రేమా... చెలీ... సఖీ
ప్రియా యూ లామీ నా... నా ఫర్ ఎవర్ అండ్ ఎవర్
ప్రియా... నన్నే ॥పాటకు ప్రాణం॥
చ :వయసాగక నిను తలచిన
నను మరచిన పదే పదే పరాకులే...
ఆ: నీ ఆశలు నీ ద్యాసలు చిగురించగా అదే అదే ఇదాయెలే
అ: ప్రేమించే మనసుందే ప్రేమంటే తెలుసందే
అది ప్రేమించిందో ఏమో నిన్నే
ఆ: నువ్వంటే చాలా ఇష్టం లవ్వంటే ఎంతో ఇష్టం
ఇన్నాళ్ళూ నాలో నాకే తెలియని ఆనందాలా ప్రేమే ఇష్టం॥పాటకుప్రాణం॥
చ : అనుకున్నదే నిజమైనదే ఎదురైనదీ ఇలా
అనుకోకులే అలవాటులో పొరపాటుగా అలా నీ తీరులో
అ: నా వెంటే నీవుంటే నీడల్లే తోడుంటే
పెదవి విప్పాలన్నా చెప్పాలన్నా కిస్సే యస్సౌనేమో
ఆ: కుట్టిందే తేనెటీగా పుట్టిందే తీపి బెంగా
కిల్లాడి ఈడే ఆడీ పాడీ కోడై కూసిందేమో బాబూ
అ: పాటకు.... పాపా... ॥పాటకు ప్రాణం॥

రచన: పోతుల రవికిరణ్ **2** గానం: బాలు, చిత్ర, కార్తీక్

ప/అ: వాలే వాలే పొద్దులా తెగ ముద్దొస్తావే మరదలా (2)
ఆ: లేని లేని హద్దులా నను జడిపిస్తావే వరదలా
అ: పుట్టుమచ్చే చూడనా తొలి ముద్దే దానికి పెట్టనా
ఆ: పట్టుకుంటే జారనా మరి ముట్టుకుంటే కందనా
అ: మందార బుగ్గల్లో ప్రేమంతా చెప్పిందే... ఓయ్... ॥వాలే వాలే॥
చ :ఎన్ని అందాలో ఎన్నెన్ని అందాలో
అ: కౌగిలించి ముద్దులిస్తే కలలా ఉందిలే ॥2॥
ఆ: ఎన్ని బంధాలో ఎన్నెన్ని బంధాలో
గుండెకేసి హత్తుకుంటే అలలా ఉందిలే
అ: ఇన్నాళ్లు ఈ ప్రేమంతా ఏమయిందిలే
ఇవ్వాళే చెప్పేసావు ఎట్టా... ఎట్టా... ఎట్టెట్టా ॥వాలే వాలే॥
చ/ఆ: ఒంపు సొంపుల్లో ఈ ఒంటి బాధల్లో
చీరంచే నవ్వేస్తుంటే సిగ్గవుతుందిలే... ఏ ఏ ఏయ్...
అ: కంటి సైగల్లో నీ కొంటె చేష్టల్లో
కవ్వించి రమ్మంటుంటే మతి పోతుందిలే
ఆ: ఎన్నాళ్ళు మోయాలయ్యో పొంగే పొంగులే
నీ సాయం కావాలయ్యో ఎట్టా... ఎట్టా... ఎట్టెట్టా... ॥వాలే వాలే॥

రచన: పోతుల రవికిరణ్ **3** గానం: దేవన్

ప : చుచ్చూరు... చుచ్చూరు... (4) చిరె ఛీ ఛీ... (2) ప్రియా
ఓహో... కనిపించావులే...
ప్రియా చూపించాలి నీవులే
నాపై దయా...
తొలి ప్రేమాయలే ప్రియా నాలో
కంటి పాపకే నీవే లయా...



ఈ తాపం నీక్కూడా తెలుసేమో...
ఆ: ఓహ్హోహ్హో... తమ గాధే విన్నా తెగ జాలేస్తోందయ్యో
ఏ సాయం చెయ్యాలో చెప్పయ్యో...
అ: పంచుకుంటే ఈ చిచ్చు కొంచెమైన తగ్గొచ్చు
దాచుకుంటే దారుణాలు జరగొచ్చు
ఆ: పక్కవాళ్ళు చూడచ్చు ఫక్కుమంటు నవ్వొచ్చు
తొందరొద్దు ఇంకాస్త ఆగొచ్చు
అ: అయితే మరీ ఎన్నాళ్లపను ఈ తిమ్మిరీ...
ఆ: మంచి ముహూర్తం ముంచుకు రానీయ్
చూద్దాం అంది లాహిరి... ॥మంత॥

రచన: సిరివెన్నెల **8** గానం:ఉదిత్‌నారాయణ్, చిత్ర

ప/ఆ: ఓహోహో... చిలకమ్మా
పలికే ఓ పంచదార చిలకమ్మా
కొంటెగుట్టు విప్పవమ్మా ఉన్నమాట చెప్పవమ్మా చిలకమ్మా
అ: అనగనగనగా ఒక ప్రేమ ఎంతపని ఎంతపని చేసెనమ్మా
ఆ: ఎవ్వరికీ కంటికి ఎదురుగ కనిపించని ఈ ప్రేమ
అ: అందరికీ తెలుసని తనకే తెలుసో లేదోనమ్మా... ॥అనగనగనగా॥
చ/ఆ: నూరేళ్ల పయనాన విడిపోని క్షణమైన నీడ తానై వెంటవుంది
ఆ: వెయ్యేళ్ల వరమైన అనురాగ బంధాన తోడు తానై అల్లుకుంది
అ: తానే నా కలలు కన్నది... నాకే అవి కానుకన్నది
ఆ: ఎపుడూ ఈ చెలిమి వెన్నెల... తరగనిది
అ: తీరని ఋణమైనది... ॥ఓహోహో॥
చ/ఆ: ఇప్పుడో ఎప్పుడో ఇక్కడో ఎక్కడో
నన్ను కలవక తప్పదన్నది ప్రేమ
ఆ: ఇపుడే ఇక్కడే కలుసుకో అన్నది
నన్ను వెతుకుతు చేరువైనది ప్రేమా
అ: వయస్సంత చెప్పమంటూ ఆడగనన్నది
మనస్సంత చోటువుంటే చాలునన్నది
ఆ: ఎలాగైనా చేరుకుంటా చూడమన్నది
ఎలా ఎప్పుడంటే మాత్రం
చెప్పనంటూ నవ్వుతుంది ప్రేమా... ॥ఓహోహో॥
చ/ఆ: రెప్పలు మూసినా నిన్నే చూపెడుతోంది
చెప్పక పోయినా నీ ప్రతిమాటా వింది
అ: ఒంటరి ఊహలో ఎంతో దగ్గరయింది
చెంతకు చేరినా దూరంగానే ఉంది
ఆ: నువ్వూ నేనంటూ కథ మొదలెడుతుంది
అ: ఇద్దరు లేరంటూ నువ్వే నేనంది
ఆ: ప్రతిజత ఇదే కథ
అ: మొదలేగాని చివరంటూ లేనిదీ ప్రేమ ॥ఓహోహో॥

పెళ్ళి చేసి ఓహో అనిపిస్తాం...
కొంగుముళ్ళు వేసి దీవెన్లందిస్తాం... ॥మన వీరవెంకట॥
చ/ఆ: కామి కాని వాడు మోక్షగామిగానే కాడురా...
కళ్యాణమంటే లోకకళ్యాణమేనురా...
ఉట్టే కొట్టందే... ఓ... స్వర్గం అందేనా...
ఇంటి కట్టందే... ఈ... సృష్టి పుట్టేనా...
ఇంటిదీపం వెలిగించి రంగులలోకం చూపించి
అర్థభాగం అందించి అనంత భాగ్యం కలిగించి
బ్రహ్మచారి కొంపను కాస్తా బొమ్మల కొలువుగ చేయించి
కాపురంలో కైలాసాన్నే చూపించే ఇల్లాలే కావాలోయ్...
అ: సో... ॥మన వీరవెంకట॥
కో: సౌందర్యం మదగజగమనం
సౌందర్యం వరఘనజఘనం
సౌందర్యం నరసిజనయనం
సౌందర్యం మధుమయ అధరం
సౌందర్యం సురుచిర వదనం
సౌందర్యం సుమమయ సదనం
చ/ఆ: చందమామ వస్తేగాని నింగి కందం లేదురా
చైత్రమాసం వచ్చేదాకా తోటకర్థం లేదురా
వేసవిగాలుల్లో... హా... మల్లెలతావుల్లా
తొలకరి చినుకుల్లో... హోయ్... మట్టి సుగంధంలా
ఒంటరైన గుండెల్లో జంట గువ్వైచేరాలి
బ్రహ్మచారి కన్నుల్లో భామనవ్వులు వెలగాలి
అమ్మలాగ లాలించేలా రాణిలాగ పాలించేలా
నేస్తమల్లే నడిపించేలా చెంతచేరే తోడే కావాలోయ్...
ఆ: సో... ॥మన వీరవెంకట॥

రచన: సిరివెన్నెల **3** గానం: ఉన్నికృష్ణన్, సునీత

ప/ఆ: అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః...
అను అక్షరాలే తోడుగా
అ: పడమర ఎరుగని సూర్యుడు నాన్న
పున్నమి జాబిలి మా అమ్మ
ఆ: ముచ్చట తీరా ముగ్గురు అన్నల ముద్దుల చెల్లిగ పెరిగిన మన కథ
ఇద: లాహిరి... లాహిరి... లాహిరిలో...
మన అందరి గుండెల సందడిలో... ॥లాహిరి॥
చ/ఆ: చందురుడ్నే దారం కట్టి దించుకుందాం ఎంచక్కా...
దీపమల్లే పెట్టడానికి...
అ: తారలన్ని హారం కట్టి తెచ్చుకుందాం సరదాగా...
బొమ్మరింటి తోరణానికి...

ఎదురైన అందమా
ఎదలోని భావమా...
మనసైన ముత్యమా
సొగసైన రూపమా...
పదహారు ప్రాయమా
పరువాలు భారమా...
అధరాలు మధురమా
అరుదైన హృదయమా...
ఓహో హో ప్రేమా
ఓ ప్రేమా... ఓ ప్రేమా... (4)
కలలో భామా
కలిగే ప్రేమా... ప్రియా... యా... ఓహో... కో: ॥చుచ్చూరు॥

చ :తొలి కలయిక ఒక వరమో
ప్రతి కదలిక కలవరమో
అణువణువున పరిమళమో
అడుగడుగున పరవశమో
ఏదైనా ఏమైనా నువ్వేలే నా ప్రాణం...
ఔనంటూ కాదంటావా...
లేదంటూ తోడొస్తావా
నాకోసం ప్రియా... ఓహో... ॥కనిపించావులే॥

చ :ఎదురుగ నువు నిలబడితే ఎదర సనస మొదలైతే
మదనుడు కథ మొదలెడితే అడుగులు తడబడి పడితే
చిరునామా తెలిసిందే నా ప్రేమా ఆహో విరిసిందే
ఆకాశం అంచుల్లోనే ఆనందం చేరిందేమో...
ఊహల్లో ప్రియా... ఓహో... ॥కనిపించావులే॥

రచన: సిరివెన్నెల **4** గానం: రాఘవేంద్ర, చిత్ర

ప/అ : నమ్మవే అమ్మాయి తరించిపోయే చేయి
ఇలాంటి హాయి మొదటి సారి సొంతమయి (2)
హాయి మిగిలిపోయి మనస్సు జారిపోయి
నిన్నొదిలిరాను అంది నన్ను మరచిపోయి
దేహమంత మారిపోయే చేయిగా
కాలమంత కాలుతోంది తీయగా
మాయమైన ఆ క్షణాన్ని వెతుకుతోంది చిలిపిగాను ॥నమ్మవే॥

చ/అ : ఓ సారి చెయ్యెస్తే ఇలా కళ్ళు మూసి ఒళ్ళు మరచిపోతే
అ: నువే గనుక నేనయితే నువ్వే చెప్పగలవు ఏమి జరిగనంటే
ఆ: ఇలాగ వేలుతాకి అలాగ సోలిపోతే
నువ్వేమిటౌదువో మరింత ముందుకొస్తే
అ: తుఫాను కాకముందు చిటుక్కు చినుకు ముద్దు
ఇలాగె మన గుండెల్లోన ఆవిర్లు రేపి పోదా
అ: నమ్మవే అమ్మాయి
ఆ: చాలులే బడాయి కవిత్వమా అబ్బాయి
కబుర్లతోనే కాలమంతా గడపకోయి
ఇంతకన్నా హాయి కావాలా ఆకతాయి
అందించగలను చేతిలోన చేయి

చ :ఇన్నాళ్లు ఈ గాలి ఇలా పాడలేదు ఇంత చిలిపి లాలి
ఆ: ఇంకేమి కావాలి సరే వెళ్ళు కలలలోకి తేలి తేలి
అ: ఇవాళ నుంచి నేను పూలైన ముట్టుకోను
నీ లేత చేతి స్పర్శ కందిపోవునేమో
ఆ: మరైతె ఇంక నేను ఎలాగ తట్టుకోను
నీ వరస చూస్తే ఇంక నువు నన్నైన తాకవేమో...
చాలులే బడాయి అ: ॥నమ్మవే॥



ఆ: పండుగ సందళ్ళే నిండిన మా ఇల్లే రంగుల హరివిల్లే
అ: కోవెల గంటల్లే కోయిల పాటల్లే సరదాల అల్లరే
ఆ: కళ్లల్లో కాంతులే దీపావళి...
అ: కల్లలూ... ఎల్లలూ... కనివిని ఎరుగని
ఇ లాహిరి... లాహిరి... లాహిరిలో...
చిరునవ్వుల మువ్వల సవ్వడిలో... ॥లాహిరి॥

చ/ఆ: ఏం వయస్సో ఏమోగానీ చెప్పకుండా వస్తుంది...
తేనెటీగ ముల్లు మాదిరి...
ఆ: ఏం మనస్సో ఏమోగానీ గుర్తుచేస్తూ ఉంటుంది...
నిప్పులాంటి ఈడు అల్లరి...
అ: ఒంటరి వేళల్లో తుంటరి ఊహల్తో వేధిస్తూ ఉంటుంది...
ఆ: తోచిన దారుల్లో దూసుకుపోతుంటే ఆపేదెలా మరి...
అ: ఎవ్వరో ఎక్కడో ఉన్నారని
ఆ: గువ్వలా గాలిలో ఎగిరిన మది కథ
ప/ఆ: అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఎ, ఏ, ఐ, ఒ, ఓ, ఔ, అం, అః...
అని ఆగనంటూ సాగదా...
ఆ: మనసును చిలిపిగ పిలిచిన ప్రేమ
వయసుని తరిమిన ఆ ప్రేమ
అ: కోరిన జంటను చేరేదాకా ఒక క్షణమైనా నిలువని పరుగుల
అం; లాహిరి...లాహిరి
తొలి వలపులు పలికిన సరిగమలో... ॥లాహిరి॥

రచన: సిరివెన్నెల **4** గానం: సోనునిగమ్, సునీత

ప/ఆ: నేస్తమా... ఓప్రియ నేస్తమా...
ప్రియతమా... నాలో ప్రాణమా...
నీలో వున్న నన్నే చూడనంటూ పంతమా
తెరచాటు దాటి దరిచేరుమా...ఎడబాటు దూరం కరిగించుమా॥నేస్తమా॥

చ/ఆ: నీ గుండెల్లో చూడమ్మా నేను లేనా ఏమూలో
నీ ఊపిరిలో వెతుకమ్మా చేరుకున్నా ఏనాడో
మనసిచ్చావు నాకే కదా అది వదిలేసి పోతే ఎలా
ఎక్కడున్నా చెలీ నీ ఎద నిన్ను నావైపు నడిపించదా
వెళ్లేదారులన్నీ నన్ను చూపే వేళలో
కనుమూసుకుంటే కనిపించనా
ఎదలోని పాటై వినిపించనా ॥నేస్తమా॥

చ/ఆ: నా గుండెల్లో ఈ భారం దాటనంది ఈ దూరం
నా ఊపిరిలో ఈ మౌనం పాడనంది ప్రియగానం
అన్ని తెలిసున్న అనురాగమా నన్ను వెంటాడటం న్యాయమా
రెప్ప వెనకాల తొలి స్వప్నమా ఉప్పునీరై ఉబికి రాకుమా
కమ్మని జ్ఞాపకంలా ఊహాలో నిదురించుమా
మనసందుకున్న మమకారమా
మరపించు వరమై దీవించుమా

ప/ఆ: నేస్తమా... ఓప్రియ నేస్తమా...
ఆగుమా... ఆశల వేగమా...
మానని గాయమింక రేపుతావా స్నేహమా
ఈ జన్మకింతే మన్నించుమా
మరుజన్మవుంటే నీదే సుమా

ప/ఆ: నేస్తమా... ఇద్దరి మధ్య కొన్ని అడుగుల
దూరం ఉంది, అది ఏడడుగులు అవ్వాలి
నీ పేరే పలకమంది నీ ఊసులే వినమంది
నిన్నే చూడమంది
నేస్తమా... ఓ ప్రియ నేస్తమా...

రచన: కీరవాణి **5&7** గానం: గంగ, ఎం.ఎం.కీరవాణి

ఆ: మనసే ఒక పున్నమి జాబిలై
ప్రవహించిన ఊహల వెన్నెల లాహిరి
మదిలోపలి ఆశను పైకి లేపి
మొగమాటపు అంచున తూలిన లాహిరి
మాటలు నేర్పిన చూపుల లాహిరి
మౌనము కోరిన మమతల లాహిరి
మత్తులో కొత్త మెలకువై లాహిరి

రచన: సిరివెన్నెల **6** గానం: కుమార్‌సాను, చిత్ర

ప/ఆ: మంత్రమేదో వేసింది మత్తుమందు చల్లింది
మాయచేసి పోయింది ఓ లాహిరి
ఆ: మనసు మనసు కలిపింది ముగ్గులోకి దింపింది
తాపమేదో రేపింది ఈ లాహిరి
అ: ఆగేట్టు లేదుగాని ఈ అల్లరి ఊపింది ప్రేమ లాహిరి
ఆ: ఏవైపు లాగుతుందో ఏమో మరి రమ్మంది కొంటె లాహిరి
అ: ఎంతని చెప్పను వింతగ తాకిన అంతేలేని లాహిరి ॥మంత్ర॥

చ/ఆ: ఓహ్హొహ్హో... అలవాటే లేని ఆరాటం ఏంటయ్యో
ఈ వేగం ఎటుపోతుందో ఏమో...
ఆ: ఓహ్హొహ్హో... పొరబాటే కానీ ఏం చేస్తాం లేవమ్మో
ఈ మైకం మననేరం కాదేమో...
ఆ: గుప్పెడంత గుండెల్లో ఉప్పెనంత సందళ్ళు
గుప్పుమంటే గుట్టంత ఏంగాను...
అ: చెప్పకుండ ఎన్నాళ్ళు నిప్పులాంటి ఒత్తిళ్ళు
తట్టుకుంటదా చెప్పు నీ మేను...
ఆ: ఎలా మరీ... ఏం చేయాలి... ఈ ఆవిరి...
అ: ఊపిరిలో తొలిప్రేమ తుఫానుగ వీచే వింత లాహిరి ॥మంత్ర॥
చ/ఆ: ఓహ్హొహ్హో... యమ బాధే అయినా బాగానే ఉందమ్మో

మిత్రులు, ప్రముఖ గాయకులు శ్రీ పి.బి. శ్రీనివాస్‌గారు మధుర గాయకుడు శ్రీ ఎ.ఎమ్. రాజా గురించి చాలా వివరాలు యిచ్చారు. రాజా పూర్తి పేరు వ్రాస్తే బాగుంటుంది. నాకు తెలిసి ఎ.ఎం. రాజా పేరు మురళీమోహన రాజు. చిత్తూరు జిల్లా పలమనేరు ఆయన స్వగ్రామం.

అలాగే "అర్ధాంగి"చిత్రంలో హరిదాసు పాత్ర ధారి పేరు బెంగుళూరు రంగస్వామి అని వ్రాశారు. శుద్ధ తప్పు. ఆ హరిదాసు పాత్రధారి పేరు శ్రీ ఎమ్.సి.రాఘవన్.

ఆయన అర్ధాంగిలో హరిదాసు -అక్కినేని నటించిన నరసూ స్టూడియో వారి భలేరాముడు చిత్రంలో ఓ పూజారి టైపు వేషం - వేశారు. పి.బి.శ్రీనివాస్‌గారు "భలేరాముడు" చిత్రంలో ఎమ్.సి.రాఘవన్‌గారికి ఓ ప్లేబాక్ పాట పాడేరు. ఆ పాట "భయమేలా ఓ మనసా భగవంతుని లీలా"! ఈ పాట గాయ కుడు పి.బి.శ్రీనివాస్ గారి పూర్తిపేరు చాలామందికి తెలీదు. ప్రతివాది భయంకర శ్రీనివాసాచారి ఆయన పూర్తి పేరు.

-ఏచూరి, సినీ జర్నలిస్టు, చెన్నై

('అర్ధాంగి' చిత్రానికి సంబంధించిన ఆ సమాచారాన్ని దర్శకులు ఆమంచర్ల శేషగిరిరావు మాకు చెప్పారు. మీ ఉత్తరం చూసాక తిరిగి ఆయన్ని కాంటాక్టు చేసాము. మీరు చెప్పిన ఇన్ఫర్మేషనే కరెక్టు అని, అంతకుముందు తాను పొరపాటుగా ఆ సమాచారాన్ని ఇచ్చానని సహృదయంతో తెలియజేశారు. - ఎడిటర్)



సినీ జర్నలిస్ట్ అండ్ సినీ ఆర్టిస్ట్ 'ఏచూరి' గారి లేఖను 1-15 ఏప్రిల్ 2002 'హాసం' సంచికలో చూశాను.

త్యాగరాజస్వామివారి సమాధి స్థలం తిరువయ్యూరు (పంచ నద క్షేత్రం). ఆయన జన్మ స్థలం తిరువారూర్. (తిరు-ఆరూర్). తిరు వాయూరు కాదు. తిరువారూర్‌లో వెలిసిన త్యాగ రాయస్వామి పేరునే మన స్వామివారికే పెట్టారు. త్యాగరాజస్వామి వారి కుమార్తెకు సంతా నం లేరు. త్యాగరాజస్వామి వంశస్థుల మంటున్న వారు నిజానికి స్వామి వారి సోదరులయిన జపేశయ్య గారి మునిమనమలు, మనవరాళ్లేనట!

-గోపాలకృష్ణ పి.ఎస్,
ఆలిండియా రేడియో, హైదరాబాద్

1-15 ఏప్రిల్ 2002 సంచికలో పి.బి.శ్రీనివాస్ గారి వ్యాసంలో (పుట 64) ఏ.యం.రాజా ప్రప్రధమంగా "పెళ్లికానుక" చిత్రానికి సంగీత దర్శకత్వం వహించినట్టు వ్రాసారు. అది పొర పాటు. అంతకుముందు 1958లో పొన్నలూరి బ్రదర్స్ కమలాకర కామేశ్వరరావు దర్శకత్వంలో నిర్మించిన 'శోభ' చిత్రానికి తొలిసారిగా ఆయన సంగీత దర్శకత్వం నెరపారు. నటుడు, రచయిత రావి కొండలరావుకు కూడా నటుడుగా అది తొలి చిత్రం. "దులారి" అనే హిందీ చిత్రం 'శోభ'కు మాతృక.

-ఎస్.వి.రామారావు, హైదరాబాద్

ఈ ఉత్తరం చదివి "దొంగ పడ్డ ఆర్నెల్లకు..." అనుకోకండి. పాత పత్రికలు చాలా ఆలస్యంగా తెప్పించుకున్నాను. అందులో 16-31 అక్టోబరు పత్రికలో 'బుద్ధిమంతుడు' సినిమా గురించి వేసారు. 'అల్లరి పెడతారే - పిల్లలు అల్లరి పెడతారే" పల్లవి ముందు "ఎట్లా పుడతారే - పిల్లలు ఎట్లా పుడతారే" అనే వుండి వుండటం నూరుపాళ్ళ నిజం. ఎందుకు అంటారా బుద్ధిమంతుడు ఎల్.పి.లో ఈ పాట "ఎట్లా, అసలెట్లా" అని రాసి వుంటుంది. అదీ కాక పల్లవి ప్రారంభమయ్యేముందు ఈ పదం అన్నాకనే ప్రీ-లూడ్ స్టార్ట్ అయి పల్లవి ప్రారంభ మవుతుంది. కాబట్టి మీరు అన్నమాటే నిజం. ఏది ఏమయినా ఈ శీర్షికను పత్రికలో కొనసాగిస్తూ పోతే హాసానికే అందం వస్తుంది.

-సోమయాజుల సాయిప్రసాద్
ఒనకడిల్లీ (ఒరిస్సా)

ఎన్నిసార్లు ఆలకించిన -ఎన్నిమార్లు ఆలపించిన - తనివితీరని పుణ్యకథ - శ్రీరామ కథ. ఒక గుహుడో, మరో శబరో, ఇంకో విభీషణుడో రాముని పొగిడితే అందులో వింత ఏమి ఉంది? వాళ్ళందరూ రాముని వర్గీయులే. అదే మారీచుడో - శూర్పణఖో - రావణుడో పొగిడితే - అదీ... రాముని అందం.

సంపూర్ణ రామాయణంలో నారాయణరెడ్డి కలం - సుశీల గళం - నటించిన జయకుమారి చందం అన్నీ కలగలిపిన బాపూ చిత్రంలో రాముని - రామానుజుని అందాలు ఒక్కసారి ఆలోచిస్తే - ఎంత అందంగా కనిపిస్తాయో!

"రాచవారి చినవాడ - వలరాచకళల వగకాడ
నీలాల మేఘాల నిగనిగలు కలవాడ
చూసింది నిన్ను చూసింది
నా కన్నుల్లో నిన్ను చూసింది
పురివిప్పే నెరివయసే
తరుణం కోసం చూసింది
పరువం ఎన్నిక చేసింది...."

రాముడు రాచవారి పిల్లవాడు. "వలరాజు" కళల వాడు. మరి వలరాజును కన్నవాడు కదా! బిడ్డకన్న తండ్రే అందగాడు. అంతటి రాముడు



నీటి మబ్బుల్లా నల్లగ ఉన్నాడు. తరుణం తెలిసిన పరువం పురివిప్పిన నెమలిలా అయింది. శూర్పణఖ కన్ను నీలవర్ణుని మీద పడింది.

ఇక్కడ కవి ప్రయోగంలో "కన్ను" నెమలి కన్నులా అందంగా ఉంది. నెమలికి ఒళ్ళంతా కన్నులే! అవును మరి రాముని అందం చూడాలంటే ఒళ్ళంతా కళ్ళు కావద్దూ! అందుకే నీటి మబ్బుల్లాటి రాముని ముందు నెలత నెమలి కన్నె అయింది. ఆ అమాయకపు పిల్ల రాముడు కాదంటే అతని తమ్ముడు లక్ష్మణుడు చాలనుకొంది. ఇక్కడ కవి లక్ష్మణుని గురించి ఇలా అంటాడు.

"పగడాల జిగిమేని నిగనిగలు కలవాడ
సాచింది పడగ సాచింది
నాకడ కొంగే పడగ సాచింది"

పగడాల జిగి లక్ష్మణునిది. అతడు శేషాంశ సంభూతుడు. అందుకే శూర్పణఖ కడకొంగు ఎలనాగులా పడగ సాచింది. పగడం నవ రత్నాలలో ఒకటి. మరి రత్నం పాము పడగమీద ఉంటుంది కదా! కడ కొంగు పడగ అయితే లక్ష్మణుడు పగడం అయితే ఆరెంటి సమన్వ యం ఎంతకి మనోజ్ఞం! పాములో "బుస" - శూర్పణఖలో తాపం. పగడంలో ఎరుపు లక్ష్మణునిలో కోపం. చక్కగా అతికినట్టు అని పిస్తుంది. ఇంతటి విశ్లేషాత్మక మైన ఊహ కవికలం లోంచి అప్రయత్నంగ జాలు వారింది.

"చూసే కన్నుకు మనసుంటే ప్రతి గరిక పూవు మందారం" అయినట్టు.

"కదిలే ఊహలకే కన్నులుంటే పగలే వెన్నెల" కురిసినట్టు - కవి కలంలో ఎన్ని అందాలో!

కలం కదిపితే అందం
పదం పలికితే మకరందం

-గాదె రంగనాయకమ్మ
జంగారెడ్డిగూడెం

**ఫంక్షన్స్‌లోగాని, నలుగురు కూర్చుని సరదాగా నవ్వుకునే సమయాల్లోగాని సులభంగా ప్రదర్శించడానికి వనికొచ్చేలా 'హాసం' సమర్పిస్తున్న కామెడీ స్కిట్ ఇది.**



# శ్రవణదోషం

-రాజా

**హోటల్ గార్డెన్స్‌లో**

**సుందరం, కమల విచారంగా కూర్చున్నారు.**

**సర్వర్ టిఫెన్ తెచ్చి టీపాయ్ మీద పెట్టాడు.**

**సుందరం ప్లేటు ముందుకు లాక్కున్నాడు.**

**మంచినీళ్ళు తాగబోతూ ఇంకా అక్కడే నిలబడి ఉన్న సర్వర్‌ని చూశాడు.**

**కళ్ళు గట్టిగా మూసేసుకుని రెండు చేతు వేళ్ళతోనూ చెవులు మూసేసుకుని ఉన్నాడు సర్వరు.**

**(అతడిని తడుతూ)**

సుందరం : ఏంటోయ్... ఏంటది... ఏంటా ముద్ర?

సర్వర్ : ఇప్పుడు మీరు గట్టిగా కేక పెడతారు కద్సార్. ఏవో ముందు జాగ్రత్తకోసం... కానివ్వండ్సార్... నేన్రెడీ

సుందరం : ఏయ్... ఏంటోయ్ నువ్వు... తమాషాగా ఉందా... వెళ్ళు... వెళ్ళుక్కణ్ణించి... గెటౌట్ నీక్కూడా లోకువై పోయానా నేను?

కమల : ఊరుకోండీ... మీరే ఇలా దిగాలుపడి పోతే ఎలా?

సుందరం : ఇంకేం చెయ్యమంటావో చెప్పు కమలా అందరికీ నేను ఫుట్‌బాల్ లాగా కనిపిస్తున్నాననుకుంటా.... ఒకడి తర్వాత ఒకడు, ఒకడు తర్వాత ఒకడు తన్నుకుంటూ పోతు న్నారు హ్యాపీగా.

కమల : ప్లీజ్... కొంచెం కంట్రోలవండి...

సుందరం : ఊ... సర్లే

కమల : మరో ఉపాయం ఏదైనా ఆలోచించండి.

సుందరం : మరో ఉపాయమా? ఊహు.... నా అయిడియాలు అచ్చి రావన్న ఫీలింగొచ్చేసింది నాకు ఈ సారి నువ్వే ఆలోచించు.

కమల : నేనా.... ఉపాయమా.... అంత తెలివితేటలే నాకుంటే మిమ్మల్నెందుకు కట్టుకుంటానూ?

సుందరం : అదిగో నువ్వు కూడా ఫుట్‌బాల్ టీమ్‌లో చేరిపోయావు.

కమల : సారీ....! ఊ .... (ఆలోచిస్తూ)

ఏవండీ.... వచ్చేసిందండీ.... మాంఛి అయిడియా వచ్చేసింది.

సుందరం : సర్లే అదేదో చెప్పు త్వరగా.

కమల : ఇవాళ రాత్రి భోజనాల దగ్గర ఏదో విధంగా మనిద్దరం పోట్లాట పెట్టుకుందాం. బాబాయ్‌ని న్యాయం చెప్పమందాం. మీ పక్షం మాట్లాడేడనుకోండి నాక్కోపం వచ్చి నేనాయన్ని ఇంట్లోంచి పొమ్మంటాను. నా పక్షం మాట్లాడేడనుకోండి...

సుందరం : నేను గెటౌట్ అనాలి.

కమల : ఎగ్జాక్ట్‌గా అంతే.....
ఏంటి ఆలోచిస్తున్నారూ? ప్లాన్ బావులేదా.

సుందరం : ఎందుకు బాగులేదూ... బ్రహ్మాండంగా ఉంది.



కమల : మరింకేం ప్రొసీడయిపోదాం.

సుందరం : అయిపోవచ్చునుకో... కానీ ఆయన్ని నేను గెటౌట్ అని ఎలా అనాలా, అసలు అనగలనా లేనా అనే ఆలోచిస్తున్నా.

కమల : ఓ పని చెయ్యండి. అలాంటి డౌటొచ్చినప్పుడు నా పక్క చూడండి. నేనో అద్భుతమైన ఫోజిచ్చి నిలబడతా. దెబ్బకి మీ అంతట మీరే ఆటోమేటిగ్గా అంటారు - గెట్టిగా - 'గెఔట్' అని

సుందరం : నా అంతటనేనా.....? ఆటోమేటిగ్గానా ఏంటబ్బా ఆ ఫోజు...

(కమల అంతకుముందు సర్వే చేయటానికి వచ్చిన సర్వర్ కళ్ళు చెవులు

మూసుకున్న పద్ధతిని ఇమిటేట్ చేసి చూపింది)

(సుందరం ఉడుక్కొని జుత్తు పీక్కుంటూ అరిచాడు.

సుందరం : ఈ ఈ ఈ ఈ

(అ అరుపుకి కాఫీ తెస్తున్న సర్వర్ సూపర్‌మేన్‌లా గాలిలోకి ఎగిరిపోయాడు.)

--- కట్ ----

(రాత్రి భోజనాల వేళ - సుందరం కోదండం భోంచేస్తు ఉంటారు. కమల ఒడ్డిస్తూ ఉంటుంది. ఒకరికొకరు 'రెడీ' అన్నట్టు సైగ చేసుకుంటారు.)

కమల : ఏంటా తిండి!? అయ్యో..... శుభ్రంగా తినండీ...

సుందరం : అదొక్కటే తక్కువైందీ

కమల : ఏవయిందీ?

సుందరం : ఇదేంటీ... అహ.... అసలిది ఏంటీ అని అడుగుతున్నాను. చపాతీయేనా?

కమల : మీకెలా అనిపిస్తోందీ.

సుందరం : రబ్బరు చెప్పులునవ్వుల్తున్నట్టుంది.

కమల : అయితే అది చపాతీయే.

సుందరం : ఆహా మరిపూరీ అయితే!?

కమల : నైలాన్ సాక్స్ నవుల్తున్నట్టు ఉంటుందిలెండి.

సుందరం : ఆ:.... ఎంత తలబిరుసు?
బాబాయ్... చూశారా.... చూశారా.....
ఎంత పొగురుగా సమాధానం ఇస్తోందో

కోదండం : ఆ మంచినీళ్ళు కాస్తందుకోనాయినా

కమల : చూడండి బాబాయ్‌గారు నా వంటకి ఎలా వంకలు పెడుతున్నారో..... నాకు చపాతీలు చెయ్యడం రాదంటా....
ఇదిగో పదేళ్ళబట్టి చేస్తున్నా చపాతీలు తెలుసా?

(సుందరం వైపు తిరిగి)

సుందరం : మరదే! పదేళ్ళబట్టి చేస్తున్న చపాతీల్నీ ఇవాళ్ళ తిండానికి పడేస్తే ఇలాగే ఉంటుంది. ఇవాళ తినాల్సిన చపాతీలు ఇవాళే చేసి ఇవాళే పెట్టాలి.... ఏం బాబాయ్‌గారూ అంతే కదా?.

కోదండం : ఆ నెయ్యి గిన్నె ఇటు తొయ్యి బాబూ

కమల : చూశారా బాబాయ్ గారూ చూశారా ఎలా వెక్కిరిస్తున్నారో....
పోనీ మీరు చెప్పండి చపాతీలు ఎలా ఉన్నాయో?

కోదండం : ఆ కందిపొడి డబ్బా ఇటు జరుపు తల్లీ

(కమల, సుందరం మళ్ళీ సైగ చేసుకున్నారు 'ఎలా' అని)

(కమల సుందరం కంచంలో పులుసు ఒడ్డిస్తుంది)

సుందరం : ఏంటే ఇది... ఏంటిది... అసలేంటిదీ అని అడుగుతున్నాను.

కమల : ఉల్లిపాయ పులుసు.

సుందరం : ఉల్లిపాయ పులుసా లేక కుళ్ళిపోయిన కుంకుడు కాయ పులుసా!

కమల : రుచి చూడకుండా పేర్లు పెడితే ఎలా అంతగా తెలుసుకోవడం తప్పదనుకుంటే తలంటి పోసుకొని చూడండి. అప్పుడు మీకే తెలుస్తుంది. అది ఉల్లిపాయ పులుసో, కుళ్ళిపోయిన కుంకుడు కాయ పులుసో.

సుందరం : ఎంతమదమెంత కావరమెంత గర్వము!? కట్టుకున్న మొగుణ్ణి పట్టుకొని వంట పులుసుతో తలంటుకోమంటావా - తచ్చితపు తరుణీ.

కమల : ఆ! తచ్చితపు తరుణి!?
ఇదిగో అలా డిక్షనరీలో లేని తిట్లు తిడితే మర్యాదగా ఉండదు ఇప్పుడే చెప్తున్నా.

సుందరం : అయితే వెళ్ళి డిక్షరీ పట్రా అర్జంటుగా .... ఊఁ ... క్విక్... ఆలస్యం అయితే కోపం చల్లారిపోతఉంది. పట్రా డిక్షరీ చూసి తిడతా ఓ అద్భుతమైన తిట్టు!

కమల : చూశారా బాబాయ్ గారూ చూశారా ఎలా నోరు పారేసుకుంటున్నారో... మీరే చెప్పండి... ఈ పులుసు బావులేదూ!?

కోదండం : ఆ మాగాయి అందుకో తల్లీ.

సుందరం : బాబాయ్ గారూ! మీరు 'వినబడక పోవడం నటించుట' అనే కార్యక్రమంలలో నిమగ్నమై పోవటం నాకేం నచ్చలేదు. మీరు చెప్పి తీరాలి... ఇది పులుసా.... ఇది పులుసేనా అని....

కోదండం : ఆ పెరుగ్గిన్నె కొంచెం జరుపుకో బాబూ! మాగాయి అన్నంలో పెరుగు అనుపానంగా నంచుకుంటే ఉంటే స్వర్గం లేదు. స్వర్గం అది బెత్తెడు.... జస్ట్ బెత్తెడు దూరంలో ఉంటుందంటే నమ్మ ఊరికే అన్నారా పెద్దలూ-

(పాట ట్యూన్ లోనే)

మాగాయే మహా పచ్చడి
పెరుగేస్తే మహత్తరి
అది వేస్తే అడ్డవిస్తరి
మానిన్యా మహా సుందరీ - అని
అదన్నమాట విషయం ....

సుందరం : బాబాయ్‌గారు! మీరు నా సహనాన్ని పరీక్షిస్తున్నారు. ఇదేం బాలేదు. మీరు చెప్పి తీరాలి. అంతే!

కమల : అవును బాబాయ్‌గారు మీరు చెప్పాల్సిందే.

కోదండం : అంతేనంటారా

ఇద్దరూ : అంతే

కోదండం : అయితే ఒక మాట చెప్తాను వింటారా.

ఇద్దరూ : వింటాం.

కోదండం : భార్యాభర్తల గొడవల్లో మూడో మనిషి కల్పించుకోకూడదర్రా

ఇద్దరూ : ఆ:....!?

కోదండం : ఆ! అలా ఏదో ఒకటి చెప్పి మీ ఇద్దరిలో ఏ ఒక్కరికో చెడుకావటం నాకిష్టం లేదు. మీలో మీరే తేల్చుకోండి. మీలో మీరే సర్దుకోండి. అంచేత - ఇహ నే లేస్తున్నానర్రా... నా భోజనం అయిపోయింది.
భోజన పరిసమాప్తకాలే భగవన్నామస్మరణే - గోవిందా గోవిందా... బ్రేవ్!

(బైటికి వెళ్ళిపోతాడు కోదండం. చెయ్యి కడుక్కోడానికన్నట్టు)

(కమల, సుందరం, ఒకర్నొకరు చూసుకుంటూ ఉండగా)

--- కట్ ---

(హోటల్లో: హోటల్లోకి వస్తున్న కమలని, సుందరాన్ని చూసి సర్వర్ చేతిలో ఉన్న ట్రే విసిరేసి, నెత్తిమీద టోపీ జేబులో పెట్టేసుకొని, తను కూడా ఓ కష్టమర్‌లా ఓ టేబుల్ దగ్గిర కూర్చుని కాఫీ



ఆర్డరిచ్చాడు.

కమల, సుందరం మాట్లాడుకున్నారు. సుందరం కమల చెవిలో ఏదో చెప్పేరు ఆనందంగాకమల సంతోషంగా షేక్‌హ్యాండ్ ఇచ్చింది.)

--- కట్ ----

(కోదండం పేపరు చదువుతూ ఉంటాడు. సుందరం గడ్డం గీసుకుంటూ ఉంటాడు. కమల వంటింట్లో బిజీగా ఉంది.

పోస్ట్‌మ్యాన్ ప్రవేశం)

పోస్ట్ : సార్ టెలిగ్రాం

సుందరం : టెలిగ్రామా... ఎవరికీ?

పోస్ట్ : కోదండం కేరాఫ్ సుందరం...

కోదండం : నాకు టెలిగ్రామా? ఎవడికంత ఖర్మకాలింది బాబూ!? సుందరం.... అదేదో కాస్త చూడు నాయనా.

(సుందరం సంతకం పెట్టి తీసుకుంటాడు. టెలిగ్రాంని పోస్ట్‌మ్యాన్ వెళ్ళిపోతాడు)

సుందరం : వైఫ్ సీరియస్.... స్టార్ట్ ఇమ్మీడియట్లీ బాబాయ్‌గారూ... మీ ఆవిడకి ఒంట్లో బాలేదుట. వెంటనే బయల్దేరమంటున్నారు. ఏంటి బాబాయ్ గారూ మాట్లాడరు? షాకయిపోయారా? డబ్బుల్లేవా.... నేనున్నాను బాబాయ్ గారు నేనున్నాను.

కోదండం : (తాపీగా) అదిమనకొచ్చిన టెలిగ్రాం అయి ఉండదులేవయ్యా.

సుందరం : అయ్యో బాబాయ్ గారూ అదేం కాదండి. అడ్రసు క్లియర్‌గా ఉంది. పేర్లు కూడా సరిపోయాయి. ఇది మనదే.

కోదండం : కాదయ్యా... నా వైఫ్ నాకన్నా స్ట్రాంగ్‌గా ఉంటుంది. మరో పాతికేళ్ళదాకా ఆ యముడు దిగొచ్చిన సరే జడుసుకు పారి పోవల్సిందే!

సుందరం : అలా అంటే ఎలా బాబాయ్ గారూ! పెద్ద పెద్ద డ్యామ్‌లే సడెన్‌గా ఢాం అంటూ కూలిపోతున్నాయి. ప్రభుత్వాలకి ప్రభుత్వాలే అలా తిరిగి ఇలా చూసేలోగా ఫట్ మంటు న్నాయి. మానవ మాత్రులం మనం ఎంత బాబాయ్‌గారూ.

కమల : అవును బాబాయ్ గారూ సంప్రాప్తే సన్నిహితకాలేనహినహి రక్షతి అన్నారు.

సుందరం : కరెక్టుగా చెప్పావు కమలా కర్మణ్యే వ్యాధి కారస్తే మాఫలేషు కదాచన

అహందూరతప్తే పదాంభోజయుగ్మ ప్రణామేచ్ఛయాగత్య సేవాంకరోమి వినావేంకటేశం ననాథో ననాథ సదా వేంకటేశం స్మరామిస్మరామి పుణ్యభూమి నా దేశం నమో నమామి పుణ్యభూమి నా దేశం సదాస్మరామి అన్నారు.

కమల : అంతేకాదు బాబాయ్‌గారు ఇంకా ఏం అన్నారంటే.....

కోదండం : వాళ్ళెవరేం అన్నా నేనేం పట్టించుకోన్రా... ఎందుకొచ్చిన కంఠశోష మీకు....

నేనేం చెయ్యాలో నా కర్తవ్యం ఏంటో నా కర్థం అయింది గానీ.... సుందరం... పర్సులో కాస్తగట్టిగా డబ్బేసుకుని పదవయ్యా.

సుందరం : అయ్యో ఆ మాట మీరు వేరే చెప్పాలా బాబాయ్ గారూ.... బస్సుదొరక్కపోతే రైలు, రైలు దొరక్కపోతే ఫ్లైటు, ఫ్లైటు లేకపోతే ప్రైవేట్ టాక్సీ.... ఏదైనా సరే ఏదో ఒకటి మాట్లాడి మిమ్మల్ని ఊరికి పంపించే బాధ్యత నాది. పదండి.

(కోదండం ముందు నడుస్తాడు సుందరం వెనక్కి వచ్చి కమలకి షేక్ హ్యాండ్ ఇస్తాడు.)

--- కట్ ---

(ఇంకా వుంది)

## పోటీ

మునిసిపల్ కార్పొరేషన్ ఎలక్షన్లు జోరుగా సాగుతున్నాయి. మేయర్ పదవికి బిజెపి., కాంగ్రెస్ పార్టీల మధ్య గట్టి పోటీ ఏర్పడింది. ఇరుపక్షాల వారు ముమ్మరంగా ప్రచారం సాగిస్తున్నారు. ఇంటింటికి వెళ్ళి ప్రచారం చేయడం కుదరదు కాబట్టి తమ పార్టీ అభ్యర్థికే ఓటు వేయమని ఓ పార్టీ అభ్యర్థి సంతకం గల వుత్తరాలని జంట నగర వాసుల ఇళ్ళకి కార్యకర్తలు తీసుకెళ్ళి ఇచ్చారు.

ఈ సంగతి తెలిసి విఎస్ఎన్ఎల్‌లో రిజిస్టరైన వారి ఇ-మెయిల్ అడ్రస్‌లకి తమ అభ్యర్థికే ఓటు వేయమని ఇంకో పార్టీ అభ్యర్థి ఇ-మెయిల్స్ పంపాడు.

ఇలా మేయర్ పదవికి పోటీ చేసే ఇద్దరు అభ్యర్థులు పోటాపోటీలుపడి ఒకరు ఏ మాధ్యమం ప్రచారానికి తీసుకుంటే, రెండో వారు కూడా దానికన్నా మెరుగైన దాన్ని వెంటనే ఉపయోగించుకోసాగారు.

కేబుల్ టి.వి.లో రకరకాల ఎన్నికల ప్రకటనలని తయారుచేసి, ప్రజల మీదకి వదిలారు. ఎలక్షన్ రోజు దగ్గరపడే కొద్దీ ఇరువైపులా టెన్షన్ పెరిగిపోసాగింది.

ఆ రోజుతో ప్రచారం ఆఖరు. ప్రచారం పూర్తయ్యాక ఇద్దరు అభ్యర్థులకి తీరిగ్గా ఊపిరి తీసుకునే అవకాశం వచ్చింది.

ఎలక్షన్ రోజున ఆ ఇద్దరు అభ్యర్థులు ఉదయమే ఎలక్షన్ బూత్‌కి వచ్చారు. ఒకరినొకరు ఎదురు పడే అరుదైన సన్నివేశం జరిగింది. ఇద్దరూ ఒకర్నొకరు చూసి చిరునవ్వులు నవ్వుకున్నారు. 'గుడ్ మార్నింగ్'లు చెప్పుకున్నారు.

వాళ్ళ మధ్య సంభాషణ ప్రచారం మీదకి సాగింది.

కాంగ్రెస్ అభ్యర్థి చెప్పాడు.

"ఎన్నికల ప్రచారానికి ఎటువంటి చిన్న అవకాశం వచ్చినా నేను వదల లేదు. ఉదాహరణకి నేనెక్కిన ఆటో డ్రైవర్‌కి, లేదా నేను వెళ్ళిన హోటల్‌లోని సర్వర్స్‌కి పెద్దమొత్తం టిప్పు ఇచ్చి 'కాంగ్రెస్‌కే ఓటే వేయండి. నరోత్తమరావుకే ఓటు వేయండి' అని చెప్పేవాడ్ని".

బిజెపి అభ్యర్థి సన్నగా నవ్వి చెప్పాడు.

"నేనూ ఎన్నికల ప్రచారానికి



ఎలాంటి చిన్న అవకాశాన్నీ జార విడుచుకోలేదు. కాకపోతే, నేను ఒక్కపైసా కూడా ఖర్చు చేయకుండా ఇంకాస్త ఎఫెక్టివ్‌గా ప్రచారం సాగించాను. ఉదాహరణకి నేను ఎక్కిన ఆటో డ్రైవరుకి, లేదా నేను ఫేమిలీతో వెళ్ళిన హోటల్‌లోని సర్వర్స్‌కి, బయట గూర్ఖాకి పైసా కూడా టిప్ ఇచ్చే వాడ్ని కాను. 'కాంగ్రెస్‌కే ఓటు వేయండి. నరోత్తమరావుకే మీ ఓటు వేయండి' అనే వాడ్ని".

-మల్లాది వెంకటకృష్ణమూర్తి




# వైవిధ్యమైన పాత్రలు ధరించిన కామెడీ స్టార్, సింగర్ బార్బరా స్ట్రీసాండ్



ఆమె ఆడగలదు, పాడ గలదు, నవ్వించ గలదు, దర్శకత్వం వహించగలదు, సినిమాలు నిర్మించగలదు - తననుకున్న లక్ష్యాన్ని సాధించడానికి ఏ అడ్డంకినైనా అధిగమించ గలదు. ఉన్నత శిఖరాలను అధిరోహించ గలదు! ఆమె వేరెవరో కాదు, మొన్న ఆస్కార్ అవార్డుల సందర్భంగా వేదికపై మెరిసిన బార్బరా స్ట్రీసాండ్!

తొలిచిత్రం "ఫన్నీగర్ల్" (1968)కే ఉత్తమ నటీమణిగా ఆస్కార్ గెలుచుకున్న (కేథరిన్ హెప్‌బర్న్ (ది లయన్ ఇన్ వింటర్)తో పంచుకోవలసి వచ్చింది) బార్బరాకు లభించిన గొప్ప గౌరవం- అలనాటి మ్యూజికల్స్‌లో నటుడిగా, డాన్సర్‌గా, డాన్స్ కంపోజర్‌గా అమితమైన ఖ్యాతి గడించిన జీన్ కెల్లీ ద్వారా లభించింది. అతడు దర్శకుడిగా మారి ఒక పెళ్లిళ్ల పేరమ్మ కేంద్ర బిందువుగా సాగే స్టేజ్‌ప్లే ఆధారంగా "హెలో డాలీ" (1969) తీసినప్పుడు అప్పటికి ఒక్కసినిమాలో మాత్రమే నటించిన బార్బరాను హీరోయిన్‌గా ఎంచుకున్నాడు! (ఆమె అద్భుతంగా నటించినా ఆ సినిమా ఫెయిలయిందనుకోండి!) ఆ తరువాత కూడా ఆమెకు పేరు తెచ్చి పెట్టిన చిత్రాలు అనేకం ఉన్నాయి. "ది వే వి వర్" (1973) చిత్రంలో నటనకు ఆస్కార్ నామినేషన్ లభించింది. "ది ఔల్ అండ్ పుస్సీకాట్" (1970), "వాట్స్ అప్, డాక్?" (1972)... ఇలా ఎన్నో...!



జీన్‌కెల్లీ తీసిన గొప్ప మ్యూజికల్ "హెలోడాలీ"

## తొలిదినాలు

1942, ఏప్రిల్ 24న న్యూయార్క్ రాష్ట్రంలో బ్రూక్లిన్‌లో పుట్టిన బార్బరా క్యాబరే సింగర్‌గా, రికార్డింగ్ ఆర్టిస్టుగా తన కెరియర్ ప్రారంభించింది. 1962లో బ్రాడ్వే రంగంపైకి "ఐ కెన్ గెట్ ఫర్ యూ హోల్‌సేల్" పాటతో దూసుకువచ్చింది. ఆమె చురుకుదనానికి, వోకల్ రేంజికి ప్రేక్షకులు ముగ్ధులయి పోయారు. "జీగ్‌ఫెల్డ్ ఫాలీస్" వంటి మ్యూజికల్స్ తొలినాళ్ల కామెడీస్టార్ ఫానీ బ్రైస్ జీవితం ఆధారంగా రూపొందించిన "ఫన్నీ గర్ల్"తో బార్బరా బ్రాడ్వేను గెలుచుకుంది. టీవీ స్పెషల్స్ కూడా చేసింది. "మై నేమ్ ఈజ్ బార్బరా" (1965)కు ఎమ్మీ ఎవార్డు కూడా వచ్చింది. "ఫన్నీ గర్ల్"ను తెరకు మలిచినప్పుడు బార్బరాకే ఆ వేషం దక్కింది. ఆ తొలిచిత్రంలోనే ఆమె ఆటా, పాటా, హాస్యం, హుషారు చూసి జనాలు మతులు పోగొట్టుకున్నారు. ఈ చిత్రంలో ఆమెతో బాటు నటించిన ఈజిప్షియన్ నటుడు ఒమర్ షరీఫ్ దీని సీక్వెల్ "ది ఫన్నీ లేడీ" (1975)లో కూడా నటించాడు.



"ఫన్నీగర్ల్"కి ఇన్‌స్పిరేషన్ - ఫానీబ్రైస్

## మ్యూజికల్స్ టు నాన్ మ్యూజికల్ కామెడీస్

బార్బరా చిత్రరంగాన్ని ప్రవేశించిన టైములోనే మ్యూజికల్స్ జోరు తగ్గింది. దాంతో ఆమె నాన్-మ్యూజికల్ కామెడీలలో కూడా నటించసాగింది. "ది ఔల్ అండ్ పుస్సీకాట్" (1970)లో ఆమె ఒక మేధావిని వలచే బజారు వేశ్యగా చక్కటి కామెడీ చేసింది. సినిమా హిట్ అయింది. 1972లో విడుదలయిన "వాట్స్ అప్, డాక్", 1938నాటి స్క్రూబాల్ కామెడీ సినిమా "బ్రింగింగ్ అప్ బేబీ" ఆధారంగా తీసారు. ఈ సినిమాలో ర్యాన్ ఓ నీల్ బిడియస్తుడైన ఓ మ్యూజికాలజిస్టు ప్రొఫెసర్‌గా, అతన్ని ముగ్గులోకి లాగే హుషారైన పిల్లగా బార్బరా నటించారు. సినిమా మంచి హిట్ అయింది. కానీ అదే జంటతో తీసిన "మెయిన్ ఈవెంట్" (1979) సినిమా ఫెయిలయింది. దానిలో బార్బరా పెర్‌ఫ్యూమ్స్ అమ్మే ఓ పెద్ద కంపెనీ యజమానురాలు. సడన్‌గా దివాలా తీస్తుంది. కానీ ఓ బాక్సింగ్ ఛాంపియన్ (ర్యాన్ ఓ నీల్)తో కుదుర్చుకున్న ఓ ఒప్పందం వల్ల డబ్బు రాబట్టుకుందామని చూస్తుంది. "అప్ ద సాండ్ బాక్స్" (1972) ఒక నిర్లక్ష్యం చేయబడిన హౌస్‌వైఫ్ గురించిన కథ. ఫాంటసీ సీన్లు కాస్త 'స్ట్రాంగ్'గా ఉన్నాయనీ, కామెడీ అన్‌ఈవెన్‌గా ఉందని విమర్శలు వచ్చాయి. "ఫర్ పీట్స్ సేక్" (1974)లో డబ్బు సంపాదించి భర్తకు సాయం చేద్దామనే హడావుడిలో అండర్‌వరల్డ్‌తో మిక్స్‌అప్ అయి అనేక చిక్కులు పడే ఓ ఆటో డ్రైవర్ భార్య పాత్రలో బార్బరా బోల్డంత హాస్యం పండించింది. "ఆల్ నైట్ లాంగ్"



"మెయిన్ ఈవెంట్"లో ర్యాన్ ఓ నీల్‌కి జంటగా

(1981) ఒక ఆఫ్ బీట్ కామెడీ. ఒక డిపార్టుమెంటల్ స్టోర్సు మేనేజరు, ఓ హౌస్‌వైఫ్‌తో ప్రేమలో పడడం గురించిన తీసిన ఈ సినిమా పెద్దగా విజయవంతం కాలేదు.

## సీరియస్ సినిమాలు కూడా....

1973లో ఆస్కార్ నామినేషన్ లభించిన "ది వే వి వర్" ఒక విభిన్నమైన రొమాంటిక్ సినిమా. బార్బరా ఒక యూదుయువతి. పొలిటికల్ రాడికల్. హీరోగా వేసిన రాబర్ట్ రెడ్‌ఫోర్ట్ వ్యవస్థతో రాజీ పడిపోయిన రచయిత. వారి ప్రేమ, వివాహం, వైఫల్యం - ఆనాటి అమెరికన్ రాజకీయాల నేపథ్యంలో చిత్రీకరించబడ్డాయి. అలాగే 1987 నాటి "నట్స్" సినిమాలో బార్బరా తన కస్టమర్‌ను చంపి, కేసులో ఇరుక్కున్న ఒక కాల్‌గర్ల్‌గా వేషం వేసింది. ఆమె తల్లి, సవతితండ్రి ఆమెను పిచ్చిదానిగా నిరూపిద్దామని ప్రయత్నిస్తారు. బార్బరా రెండోసారి దర్శకత్వం వహించిన "ది ప్రిన్స్ ఆఫ్ టైడ్స్" (1991)లో ఒక సైకియాట్రిస్టు పాత్ర ధరించింది. ఆత్మహత్య చేసుకుందామనుకునే ఒక అమ్మాయి మానసికస్థితిని మెరుగుపరచడానికి ప్రయత్నించడం థీమ్‌గా గల పేట్ కరోనీ నవల ఆధారంగా ఈ సినిమా నిర్మించబడింది. ఈ సినిమాలో ఆమె కొడుకు జేసన్ (భర్త ఎలియట్ గౌల్డ్‌తో విడిపోయింది) ఆమె కొడుకు పాత్రలోనే కనబడతాడు.



## చిత్ర నిర్మాణం లోనూ....

1937లో "ఎ స్టార్ ఈజ్ బోర్న్" అనే సినిమా తీశారు. తారాపథం నుండి జారిపోతున్న ఒక మధ్యవయస్కుడైన నటుడికి, అప్పుడే వెలుగులోకి వస్తున్న యువతారకు మధ్య జరిగే మెలోడ్రమటిక్ లవ్ స్టోరీ అదీ. ("కాగజ్‌కే ఫూల్" గుర్తుకు వస్తోందా?) అది హిట్ కావడంతో 1954లో దాన్ని పునర్నిర్మించారు. యువతారగా మ్యూజికల్స్ ద్వారా పేరు తెచ్చుకున్న జూడీ గార్లండ్ నటించింది. ఇది సూపర్‌హిట్. - తనుకూడా ఆ సినిమాను మళ్లీ తీసి జూడీ అంత పేరు తెచ్చుకోవాలని బార్బరాకు ఐడియా వచ్చింది ఫలితం - అప్పటి బాయ్‌ఫ్రెండ్ జాన్ పీటర్స్‌తో కలిసి 1976లో "స్టార్ ఈజ్ బోర్న్" తీసింది. దానిలో "ఎవర్‌గ్రీన్" అనే పాటకు ఆస్కార్ వచ్చింది కానీ ఆ సినిమాను విమర్శకులు కానీ ప్రేక్షకులు కానీ పెద్దగా ఆదరించలేదు.

1981 తర్వాత ఆమె వేషాలు తగ్గిన దశలో "యెంటెల్" అనే మ్యూజికల్‌కు కథ రాసి, డైరెక్టు చేసి, నిర్మించింది.

చదువుకోవడానికి గాను మగవేషం వేసుకోవలసి వచ్చిన అమ్మాయి కథ ఇది. పాటలు చెప్పుకోదగ్గ స్థాయిలో లేకపోయినా సినిమా బాగుందన్నారు.

ఇలా ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా మొక్కవోని ధైర్యంతో, రకరకాల ప్రయోగాలతో ముందుకు సాగిన మహిళారత్నం బార్బరా స్ట్రీసాండ్ ఈ ఏప్రిల్ 24కు షష్టిపూర్తి చేసుకుంటోంది.

-కమ్యూనికేటర్ ఫీచర్స్

---

### జస్ట్ ఫర్ ఫన్

### లంచావతారం

ఒక ప్రభుత్వాధికారి లంచం తీసుకుంటూ ఖర్మం చాలక దొరికిపోయాడు. ఆయన్ని తీసుకెళ్లి లాకప్‌లో పడేశారు.

ఇది తెలిసిన మిత్రుడొకడు ఆయన్ని పరామర్శించడానికి లాకప్‌కి వచ్చాడు.



"ఇప్పుడెలా బయటపడతావు" అడిగాడు జాలిగా.

"ఆ.... ఏవుందీ ఎలా పట్టుబడ్డానో అలాగే బైటికొస్తాను"

"అర్థం కాలా!"

"లంచం తీసుకుంటూ పట్టుబడ్డాను. లంచం ఇచ్చే బయటకి వస్తాను" తేలిగ్గా అన్నాడు ప్రభుత్వాధికారి.

- గోపి

---




హిందీ సినీ సంగీత ప్రభావం పడని ప్రాంతీయ భాషా చిత్రాలు దాదాపుగా అరుదనే చెప్పుకోవాలి. ఆ ప్రభావంతో ఎన్నో పాటలు మక్కికి మక్కిగా వచ్చాయి. స్ఫూర్తిని మాత్రమే తీసుకుని తమదైన బాణిలో కొంగ్రొత్త పోకడలు పోయాయి కొన్ని. సంగీత దర్శకుల వ్యక్తిత్వానికి మచ్చరానీయని విధంగా మాతృకల వలె చక్కటి గుర్తింపుని సంపాదించుకున్నాయి మరికొన్ని. ఈ కోవలోకే వస్తుంది అంజలీ పిక్చర్స్ వారి




ఈ చిత్రానికి ముందు - హిందీలో వచ్చిన ఫిల్మిస్థాన్ వారి అనార్కలి చిత్రంలోని సంగీతం యావద్భారత దేశాన్ని ఒక ఊపు ఊపేసింది. ఈ చిత్రానికి సంగీత దర్శకుడిగా మొదట అనిల్ బిశ్వాస్‌ని అనుకున్నారు. 'ఓ జానేవఫా' అనే పాటను ఆయన స్వరపరచటం జరిగింది కూడా.(ఈ పాటే తెలుగు అనార్కలిలో 'రావోయి సఖా' పాటగా వచ్చింది. తీరా పారితోషకం దగ్గరికి వచ్చేసరికి అనిల్‌బిశ్వాస్ చిన్నబుచ్చుకుని ఇక ఆ చిత్రాన్ని చేయనని, కావాలంటే తన కుడిభుజంలాంటి సి.రామచంద్రతో మ్యూజిక్ చేయించుకోమని చెప్పి తప్పించుకున్నారు. అప్పటికి సి.రామచంద్ర బయట కొన్ని చిత్రాలు చేసినా అనిల్ బిశ్వాస్ కమిట్‌మెంట్‌గా ఫిల్మిస్థాన్ వారి అనార్కలిని అంగీకరించి ఒకవారం రోజుల్లోనే మిగిలిన పాటల్ని స్వరపరిచారాయన. మొహమాటం కొద్దీ ఒప్పుకున్నా - వారంరోజులు మాత్రమే కష్టపడ్డా - తరాలు పాటు నిలిచిపోయే సంగీతాన్నిచ్చారు సి.రామచంద్ర. ఇక్కడ ఇంకో విషయం కూడా ఉంది. అనిల్‌బిశ్వాస్ సంగీతంలో బెంగాలి ప్రభావం ఉంటుంది. సి.రామచంద్ర సంగీతంలో మరాఠీ ధోరణులు ఉంటాయి. ఈ రెండింటి ముద్రను హిందీ అనార్కలిలో గమనించిన కొందరు రసజ్ఞులు ప్రశ్నించగా అప్పుడు ఈ విషయాలన్నీ బయటపడ్డాయి. ఏది ఏమైతేనేం, అంతటి స్వర ప్రాభవం కలిగిన ఆ హిందీ అనార్కలి చిత్రం నుండి కొన్ని పాటలను తెలుగులోకి తీసుకుంటూ నిర్మించిన అంజలీపిక్చర్స్ అనార్కలి 1955లో విడుదలైంది. ఈ చిత్రానికి సంగీతం ఆదినారాయణరావు , రచన సీనియర్ సముద్రాల.

నటి అంజలీదేవికి భర్త, అంజలీపిక్చర్స్ అధినేత ఆదినారాయణరావు మధుర సంగీత దర్శకుడు మాత్రమేకాదు, మంచి కథకుడు,మేధావి కూడా. బాంబే సినీ సంగీత దర్శకులతో సమానంగానిలిచి ఉత్తమ సంగీత దర్శకుని అవార్డును చేజిక్కించుకున్న తొలి దక్షిణభారత సంగీత దర్శకుడాయన. తెలుగు అనార్కలీ కోసం తీసుకున్న హిందీ బాణీలను ఆంధ్రులకు అందించటంలో చక్కని సమన్వయాన్ని పాటిస్తూనే తను స్వతంత్రంగా చేసిన గీతాలతో స్వీయ ప్రతిభను అత్యంత నైపుణ్యంగా చాటుకున్నాడు. అనార్కలీ అనగానే గుర్తొచ్చే ముఖ్యమైన పాటలలో ఓ అయిదిటి గురించి:

**జీవితమే సఫలము ॥జీవితమే॥**
**ఈ జీవితమే సఫలము**
**రాగసుధా భరితము**
**ప్రేమకథా మధురము ॥జీవితమే॥**
**హాయిగా తీయగా ఆలపించు పాటలా ॥హాయిగా॥**
**వరాల సోయగాల ప్రియుల వలపు గొలుపు మాటలా ॥వరాల॥**
**అనారు పూల తోటలా ...ఆ...ఆ...**
**అనారు పూల తోటలా**
**ఆశ దెలుపు ఆటలా ॥జీవితమే॥**
**వసంత మధుర సీమలా ప్రశాంత సాంధ్య వేళలా ॥వసంత॥**
**అంతులేని వింతలా అనంత ప్రేమలీలలా ॥అంతు॥**
**వరించు భాగ్యశాలులా ...ఆ...ఆ...**
**వరించు భాగ్యశాలులా**
**తరించు ప్రేమజీవులా ॥జీవితమే॥**



భీంప్లాస్ రాగంలో స్వరపరచబడిన 'జీవితమే సఫలము' పాటని హిందీ అనార్కలిలోని 'యే జిందగీ ఉసీకీ హై' పాటకి అనుసరణగా చెప్పుకోవాలి. ఇక్కడ ముఖ్యంగా చెప్పుకోవలసింది ఆదినారాయణరావుగారి ప్రతిభ. ఈ పాటకు హిందీ మాతృకకు పోలికతో పాటు చాలా సూక్ష్మమైన వ్యత్యాసాలు ఉన్నాయి. అవి రెండు పాటలను దగ్గరగా పెట్టుకుని సాధన చేసిన వారికి, నొటేషన్సు (స్వరాలు) రాయటం తెలిసిన వారికి మాత్రమే అవగాహనలోకి వస్తుంది. సాహిత్యపరంగా చూస్తే 'జీవితమే సఫలము' పాట మొదట చరణంలో 'వరాల సోయగాల ప్రియుల' అనే పద ప్రయోగం కొందరి దృష్టిలోపడింది. ప్రియుని అనకుండా ప్రియుల అని బహువచనం వాడడం పట్ల కించిత్తు కొచ్చుకోవటం కూడా జరిగింది. అయితే ఆ పాట సృష్టికర్త కలం వ్యర్థ ప్రయోగాలు చేసేదికాదు. అది రెండో చరణంలో 'వరించుభాగ్యశాలులా' అనే వాక్యం చూస్తే అర్థమయిపోతుంది. ఇక్కడ కవి చెప్పాలనుకున్నది ఎవరి జీవితము సఫలమో తెలియజేయటమే. కనుక అటువంటి సమయంలో ప్రేమికుల అనే అర్థంతో ప్రియుల అనే పదాన్ని తీసుకుంటే సరిపోతుంది. జిక్కి పాడిన ఈ పాటను అభినయించినది అంజలీదేవి.

సిపాయి బిరాన రావోయి
ఓ ఓ ఓ సిపాయి
మన తరాన ప్రేమ పరువు మాయ రాదోయి...
రావోయి సఖా రావోయి సఖా
రావోయి సఖా నీ ప్రియసఖి
చేరగదోయి ॥రావోయి॥
లోకానికి మన ప్రేమ విలువ తెలుపు సిపాయి
పరువు నిలుపు సిపాయి ఓయి సఖా...రావోయి సఖా...
రారాజునకు నీ చెలికి పడెను లడాయి
రారాజునకు నీ చెలికి పడెను లడాయి
రాజాలవని పాదుషహ పలికె బడాయి
రావింతునని పంతము నే పలికితినోయీ...
రావింతునని పంతము నే పలికితినోయీ...
లోకానికి మన ప్రేమ విలువ తెలుపు సిపాయి
పరువు నిలుపు సిపాయి
ఓయీ సఖా రావోయి సఖా
మన ప్రేమలు మన బాసలు మరువకుమా సఖా
జననాథుని జడిపింపులు వెరువకుము సఖా
మన ప్రేమలు మన బాసలు మరువకుమా సఖా
జననాథుని జడిపింపులు వెరువకుము సఖా
పెనుగాలివలె పరుగిడి రావోయిసఖా
పెనుగాలివలె పరుగిడి రావోయిసఖా
లోకానికి మన ప్రేమ విలువ తెలుపు సిపాయి
పరువు నిలుపు సిపాయి
ఓయీ సఖా రావోయిసఖా...
కలిగించకు నీ ప్రియతమకు పరాభవాలు
కలిగించుము నీ ప్రభువునకు పరాజయాలు
వినుతుంచును నీ ధీరసము ముందుతరాలు
రావోయిసఖా...
రావోయిసఖా...
రావోయిసిపాయీ...



ఈ పాటకు మాతృక హిందీ 'అనార్కలి'లో గీతాదత్ పాడిన 'ఓ జానెవఫా' అయినా - తెలుగులోకి వచ్చేసరికి పూర్తిగా జిక్కి పాట అయిపోయింది. కావాలంటే రెండుపాటలను -ఒకేసారి పెట్టుకుని వినడం తటస్థితే అప్పుడు అర్థం అవుతుంది ఇది ఎందుకు జిక్కి పాట అయిపోయిందో!? ముఖ్యంగా 'సఖా' అనేపదం...అందులో 'ఖ' అనే అక్షరం...జిక్కి గొంతుతో పలికినంత గొప్పగా మరొక గాయని గళంలో పలకదు. ఇదిలా ఉండగా తెలుగుపాటలో ఉన్న ఊపు, జీవం హిందీపాటలో అంతగా గోచరించదు. తొలుత వచ్చిన పాటని అనుసరిస్తున్నప్పుడు మెరుగుపరుచుకునే అవకాశం తర్వాత వచ్చిన పాటకు ఉండడంతో పాటు- అది సమర్థుల చేతిలో పడితే తద్వారా కలిగే సొగసులే వేరు, కళ్యాణి స్వరాలను అక్కడక్కడ కలుపుకుంటూ మోహన రాగం ప్రధానంగా సాగిన ఈ పాటలో అవన్నీ గమనించవచ్చు.

సోజా నా మనోహరి
సోజా సుకుమారి సోజా
జోగే పూవుల తీగలాగ
తూగే తుమ్మెద రాగలాగ ॥జోగే॥
ఆదమరిచి హాయిగా సోజా ॥సోజా॥
విరిసే వెన్నెల కోటలోన
మురిసే కన్నులకాపులోన
రాకుమారి తీరున
రాకుమారి తీరున సోజా ॥సోజా॥
ఎవరూ నీదరి లేరు
మనలా వేరు చేయలేరు ॥ఎవరు॥
ఆదమరచి హాయిగా
ఆదమరచి హాయిగా సోజా ॥సోజా॥



ఈ పాటను ఎ.ఎం. రాజా పాడగా అక్కినేని అభినయించారు. అంజలీదేవి కూడా సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తుందీ పాటలో. సినిమాలో పాటలన్నీ తెలుగు పల్లవులతో ఉండి ఈ ఒక పాటకు మాత్రం పల్లవి 'సోజా' అన్న పదాన్ని ఉపయోగించటం వెనక 'జిందగీ'(1940) సినిమాలో పంకజ్ మల్లిక్ సంగీత దర్శకత్వంలో కె.ఎల్.సైగల్ పాడిన 'సోజా రాజకుమారీ సోజా' అనే పాట ప్రభావం ఉందనుకోవటంలో తప్పులేదనిపిస్తుంది. 'సోజా నా మనోహరీ సోజా' పాట ఆలాపనలోనూ, ఇంటర్‌లూడ్స్‌లోనూ బహార్‌రాగచ్ఛాయలు పల్లవి, చరణాలలో మధ్యమావతి రాగధోరణులు కనిపిస్తాయి. అయితే చరణాల చివర బృందగాన సారంగ రాగమేమో అనిపించే అవకాశం ఉంది. అయితే ఆ రాగ లక్షణాలు ప్రస్ఫుటంగా కనిపించనందున నిర్ధారించలేం. ఏది ఏమైనా ఎ.ఎం.రాజా పాడిన మెలోడీస్‌లో ఈ పాటకు ఒక ప్రత్యేకస్థానాన్ని ఇచ్చి తీరాలి.

మదన మనోహర సుందర నారీ
మధుర దర స్మిత నయన చకోరీ
మందగమన జిత రాజమరాళీ
నాట్య మయూరీ.....
అనార్కలీ...అనార్కలీ...అనార్కలీ...
వహ్వా
ఆ
రాజశేఖరా నీ పై మోజు తీరలేదురా
రాజసాన ఏలరా ॥రాజశేఖరా॥
మనసు నిలువ నీదురా
మమత మాసి పోదురా
మధురమైన బాధరా
మరుపురాదు...ఆ... ॥రాజశేఖరా॥
కానిదాన కానురా
కనులనైన కానరా ॥కాని॥
జాగుసేయ నేలరా
వేగరావదలేరా ॥జాగు॥
చేరరార చేరరార చేరరార







రాజశేఖరా పాట ఆదినారాయణరావు గారి స్వతంత్ర స్వర రచన. మాల్కోస్ రాగంలోని ఈ పాటకి హిందీ అనార్‌కలిలో హేమంత్‌కుమార్, లతామంగేష్కర్ భాగేశ్రీ రాగంలో పాడిన 'జాగ్ దర్దె ఇష్క్ జాగ్' పాట యొక్క నడకను మాత్రమే తీసుకోవటం జరిగింది.

రాజశేఖరా పాట ఘంటసాల -జిక్కీ యుగళగీతం. వీరిరువురి సంగీత జైత్రయాత్రలో మరుపురాని మజిలీగా నిలిచిపోగా రసికజన స్వరార్త హృదయాల పాలిట చలివేంద్రంగా మిగిలిపోయింది.

ఎక్కువ జనాదరణ పొందిన ఈ రాజశేఖరా పాటలో మధ్యలో వచ్చే వహ్వా నుంచి చివర్న వచ్చే వాద్యగోష్టి వరకూ ఒక్కబిట్టుని కూడా మర్చిపోకుండా యథాతథంగా అప్పజెప్పగల సంగీతాభిమానులు ఇప్పటికీ ఉన్నారు. అతికొద్దిమందికి మాత్రమే తెలిసిన ఇంకో విశేషమేమిటంటే ఈ పాటలో ఎస్వీ రంగారావు, అంజలీదేవి, అక్కినేనితో పాటు తెరపై అక్బర్ ఆస్థాన గాయకునిగా కనిపించి అభినయించింది - ఈ చిత్ర దర్శకుడు, ప్రముఖ నృత్యదర్శకుడు కీ.శే.వేదాంతం రాఘవయ్య.

ఆనందమే... అందాలు చిందేటి ఆనందమే...
నినుగన్న సంబరాన మనసు సోలి
ఎనలేని పరవశాన మేనుతూలే
తాగితూగేనని తలచేను లోకము
తూగచేసేను నును ప్రేమ మైకము ॥తాగి॥
మెరసేకనులా చెలుని మోహన రూపము
విరిసే మదిలోన మాయని సంతోషము
మెరసేకనులా చెలుని మోహన రూపము
విరిసే మదిలోన మాయని సంతోషము
సరాగాల రాగాల వయ్యారిలా
సరాగాల రాగాల వయ్యారిలా
నవ్వుతాను...నవ్విస్తాను నారాజును ॥తాగి॥
ఆపలేరు ప్రేమికుల ఆవేశము
అణచలేరు అనురాగాల ఆనందము
ఆపలేరు ప్రేమికుల ఆవేశము
అణచలేరు అనురాగాల ఆనందము
సరాగాల రాగాల వయ్యారిలా
సరాగాల రాగాల వయ్యారిలా
నవ్వుతాను...నవ్విస్తాను నా రాజును ॥తాగి॥
హృదయ పీఠాన పూజింతు మోజుగా
ప్రణయ లోకాన ఏలింతు రారాజులా
హృదయ పీఠాన పూజింతు మోజుగా
ప్రణయ లోకాన ఏలింతు రారాజులా
సరాగాల రాగాల వయ్యారిలా
సరాగాల రాగాల వయ్యారిలా
నవ్వుతాను...నవ్విస్తాను నా రాజును



ఈ పాటను జిక్కి పాడగా అంజలీదేవి అభినయించింది. యస్వీరంగారావు, అక్కినేని నాగేశ్వరరావు, సురభి బాలసరస్వతి, పేకేటి మొదలైనవారు సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. రాజ్‌కపూర్ తీసిన 'బర్సాత్' (1949) చిత్రంలో శంకర్-జైకిషన్ స్వరపరచగా లతా పాడిన 'మేరే ఆంఖోమే బస్ గయా కోయిరే' అనే పాటలోని తొలిలైను ట్యూన్‌ని గుర్తుచేస్తూ ఈ 'తాగి తూగేనని తలచేనులోకము' పాట సాగుతుంది. మిగిలిన పాటలలోలాగే జిక్కి సామర్థ్యాన్ని చూపించే పాటయిది. ఈ పాటకు 'పహాడీ' రాగం ఆధారం. అయితే లలిత సంగీతంలో స్వతంత్ర సంచారం చేసుకునే వీలుంది కనుక కొన్ని అన్యస్వరాలను కలుపుకుంటూ 'మిశ్ర పహాడీ'గా రూపొందింది ఈ పాట.

పైన ఉదహరించిన పాటలే కాక 'అందచందాలు కని', 'కలిసె నెలరాజు కలువ చెలిని' వంటి పాటలను కూడా ఇప్పుడు విన్నా బాగుండే పాటలుగా చెప్పుకోవచ్చు.



కొన్ని సాంకేతిక కారణాల వలన
బాలుగారి మీ పదసంపద,
రావికొండలరావు గారి
హ్యూమరథం
ఈ సంచికలో ప్రచురించలేక
పోయాము.
వచ్చే సంచిక నుంచి
ఈ రెండూ యథావిధిగా
ఉంటాయి.

-ఎడిటర్

# స్వరతరంగాలలో ఓ సంగీత సాయంత్రం

న్యూస్ వ్యూస్

ఒక ఉత్తరం - ఒక దక్షిణం - ఒక పాత వరం - ఒక కొత్త స్వరం - వీటన్నిటి మేలు కలయిక ఏప్రిల్ 5న హైదరాబాద్‌లోని గ్రాండ్ కాకతీయ హోటల్‌లో జరిగింది. అభినందన, నీరాజనం, శ్రీసాయి మహిమ సినిమాల నిర్మాతగా, జంట నగరాలలోని సాంస్కృతిక సంస్థాధినేతలతో సీనియర్‌గా పేరుగాంచిన ఆర్.వి.రమణమూర్తి 'ఆంధ్రప్రదేశ్ కళావేదిక' తరుపున అవార్డుల రూపంలో సత్కరించటానికి రప్పించిన గాయనీగాయకులతో, సంగీత దర్శక రచయితలతో ఆనాటి సాయంత్రం - పాటకు ప్రాణం పెట్టే వారందరి గుండెల్లోనూ ఒక మధురానుభూతిని నింపింది.

శ్రీమతి యన్.జానకి, చిత్ర, కవితా



పాడడం ప్రేక్షకులను ఉద్రూతలూగించటమే కాకుండా గాయనిగా ఆవిడకున్న ఫ్లెక్సిబిలిటీని నిరూపించింది. అలాగే చిత్ర, ఆర్.పి.పట్నాయక్, ఉష పాడిన సినీగీతాలు అలరిస్తే మరోవైపు సిరివెన్నెల సీతారామశాస్త్రి పాడడం, ఇంకోవైపు వర్ధమాన గాయకుడు గంగాధర్ సహకారంతో కుమార్‌సాను 'దేవుడు వరమందిస్తే' పాటను పాడడం - ఇవన్నీ ప్రేక్షకుల్ని ఫుల్‌మూడ్‌లోకి తీసుకువెళ్ళిపోయాయి. ఆ ఊపులో -ఓ వైపు ప్లైట్‌కి టైమ్ అయిపోతున్నదంటున్నా శ్రీమతి యస్.జానకిని పాడేదాకా అసలు కదలనివ్వలేదు ప్రేక్షకులు.

చివరి వరకు ఒక పద్ధతిలో నడిపించిన గంగాధర్, మణి నాగరాజ్‌లు పాడిన పాటలు వెన్నుదన్నుగా నిలిచాయి.

## హైదరాబాద్‌లో ఓ.పి.నయ్యర్ నైట్

పైన పాల్గొన్న గాయనీగాయకులతో పాటు మరికొందరు ఉత్తరాది దక్షిణాది గాయనీ గాయకులతో ఓ.పి.నయ్యర్ నైట్ జూన్ 6న హైదరాబాద్‌లో జరుపనున్నామని, అందుకు ఓ.పి.నయ్యర్‌తో పాటు పలువురు సింగర్స్ కూడా సమ్మతిని తెలిపారని కార్యక్రమ నిర్వాహకుడు ఆర్.వి.రమణమూర్తి ఈ సందర్భంగా తెలిపారు.

## జిక్కికి కాన్సర్

ప్రముఖ గాయని జిక్కి కాన్సర్ వ్యాధితో బాధపడుతున్నారని ఈ కార్యక్రమంలోనే తెలిసింది. వెంటనే ప్రతి ప్రేక్షకుడు







పై ఫోటోలలో ఉన్నవారు యస్. జానకి, డా. ఎల్. సుబ్రహ్మణ్యం, కవితా కృష్ణమూర్తి, కుమార్‌సాను, చిత్ర, గంగాధర్, ఆర్.వి. రమణమూర్తి, ఆర్.పి. పట్నాయక్.

కృష్ణమూర్తి, వర్ధమాన గాయని ఉష, ప్రముఖ వాయులీన విద్వాంసుడు ఎల్.సుబ్రమణ్యం, కుమార్‌సాను, ఆర్.పి.పట్నాయక్, డా.సి.నారాయణరెడ్డి, సిరివెన్నెల సీతారామశాస్త్రి హాజరైన వారిలో సంగీత కుటుంబానికి చెందిన ప్రముఖులు.

టి.సుబ్బరామిరెడ్డి అందించిన శివోంకార ప్రేరణతో శివునిపై క్లాసికల్ టచ్‌తో పాడిన కవితా కృష్ణమూర్తి వెనువెంటనే 'మిస్టర్ ఇండియా' సినిమాలోని 'హవా హవాయే' చిలిపిపాటను

ఇలా ఉండగా సరదాగా చూడటానికి వచ్చిన గాయకుడు రాజేష్ (ఎటో వెళ్ళి పోతుంది మనసు పాట ఫేమ్), రఘు కుంచె, విజయలక్ష్మి, కూడా ఈ పాటల పందిరిని తమవంతు గీతాలతో అలంకరించారు. ఈ ఈవెంట్‌ని 4 డైమెన్షన్స్ వారి సహకారంతో మ్యానేజ్ చేసిన ఫ్లూటిస్ట్ నాగరాజు సోలోగా వాయించిన ఫ్లూట్ - ప్రేక్షకుల కరతాళ ధ్వనులతో పాటు కుమార్‌సాను, ఎల్.సుబ్రహ్మణ్యం వంటి వారి మన్ననలను కూడా పొందింది. సంగీత కార్యక్రమాన్ని తొలినుంచి

అవాక్కైపోవడం జరిగింది. ఆ వార్తకు స్పందించి ఆంధ్రప్రదేశ్ కళావేదిక తరఫునుండి ఓ ఇరవై వేల రూపాయలు సమర్పిస్తున్నానని ఆర్.వి.రమణ మూర్తి గాద్గదిక స్వరంతో ప్రకటించి చెక్కుని జిక్కికి అందజేయవలసిందిగా శ్రీమతి జానకికి ఇచ్చారు. వెనువెంటనే టి.సుబ్బరామిరెడ్డి తన తరపు నుండి యాభై వేల రూపాయలను ప్రకటించారు. శ్రీమతి జిక్కికి ఆర్థిక సాయాన్ని అందించి ఆదుకోవాలని సంగీత కార్యక్రమంలోని గాయనీగాయకులు కూడా అనుకున్నారు.

## కొంటె కొశ్చెన్లు - తుంటరి జవాబులు

☞ ప్రతాప వెంకట సుబ్బరాయుడు - సైనిక్‌పురి, సికింద్రాబాద్

ప్ర: 'బాధే సౌఖ్యమనే భావన రానీవోయ్' అంటే ఏమిటి?

జ॥ కంటికి చుక్కలు కనిపించే లెవెల్లో తలకు దెబ్బ తగిలితే - బాధకుండా 'నక్షత్ర దర్శనం' అయిందని ఆనందించడం అన్నమాట.



☞ వి.మంజురాణి - హైద్రాబాద్

ప్ర: 'పిల్ల రంభలా ఉంది.... పెళ్ళి చేసుకోరా' అంటే తెగ భయపడి పోతున్నాడు మా వాడు... ఏం చేతంటారు!?

జ॥ త్వరగా స్వర్గానికెళ్ళి పోతుందనేమో

☞ బి.శ్రీనివాసరెడ్డి - ఓరియెంట్ సిమెంట్, హైదరాబాద్

ప్ర: అతి నాజూకు పెళ్ళికూతురు?

జ॥ బంధువులు ఆశీర్వదిస్తూ జల్లిన అక్షింతల తాకిడికి మూర్ఛపోయేది.

## ఈ రూటే వేరు



సన్ డే : పుత్రుల రోజు

బోర్‌వెల్ : బాగా బోరు కొట్టుట

గోపురం : పట్నానికి సొమ్ము

-మైత్రేయి, వేనతేయ - హైదరాబాద్



## చిలిపి లిపి



Kings Cash Stones Milk = రాజుల సొమ్ము రాళ్ళ పాలు

- పి.ఎల్లారావు, ఎల్లందు.

1/2 లో 1/4రం ఉంది.

-శి.సుమతి,విశాఖపట్నం

Pన్ని గారూ! Eరోజు Bరకాయ పచ్చD, 1కాయ పులుసు 1/2Tకాయ WayపుDO చెయ్యనా

(పిన్నిగారు ఈ రోజు బీరకాయ పచ్చడి, వంకాయ పులుసు, అరటికాయ వేపుడు చెయ్యనా!)

-బి.అజయ్‌కుమార్, కోట-ఊరట్ల.

## పేరు - రిపేరు



1. 'సుత్తి-వేలు'కు తగిలి గాయం అయిందా... అయ్యో!?
2. మా జిల్లా 'యస్.పి. - బాల సుబ్రహ్మణ్యం'
3. ఎందుకు 'రా-జనాల'తో అనవసరంగా గొడవ పడతావు!?

-యస్.యం.రఫీ - రాజాం

# డబుల్ రోల్



1. పొద్దుట్నించీ 'ఇంకేదీ' పట్టనట్టు ఆ పెన్ను పట్టుకుని 'ఇంకేదీ'అని అరుస్తా రేంటండీ....!?

**-మామిడి మహేంద్ర, పూణే**

2. మేం ఇద్దరం ఆ బస్ 'డిపో' దగ్గర వి'డిపో'యాము.

**- సౌమ్య, అక్కయ్యపాలెం**

# చిలిపి కవిత



తెరిచారు మా కాలేజీ!
అమ్మాయిల వేటలో అయ్యాము బిజీ!
ఓ రోజు ఐ లవ్‌యూ అన్నది ఓ రోజీ!
ప్రతి రోజు పంచుకుంది నాతో క్యారేజీ!
తర్వాత పెట్టింది నా చెవిలో పెద్దసైజు క్యాబేజీ!
ఎందుకంటే చేసుకుంది మరొకడ్ని మ్యారేజీ!
దెబ్బతో తప్పింది నా ఎగ్జామ్ గురూజీ!
వెంటనే కనిపించింది ప్రకాశం బ్యారేజీ!
అయినా జీవితంలో పడ్డాను రాజీ!
అందుకే తెరిచాను చిన్నసైజు గ్యారేజీ!
అప్పుడు అనుకున్నాను లైఫంటే టేకిట్ ఈజీ!!

**-అడపా శివదుర్గ, భోగాపురం.**

# పేరడీ పేరేడ్



పల్లవి : గిరి తాగేటి సారాయి తలకెక్కింది
హరి మింగేటి లిక్కరే కిక్కిచ్చింది
కళ్ళు తిరిగిన గిరి
ఒళ్ళు తూలిన హరి
తెలివి వచ్చాక ఏమైందో తెలుసామరి
పడ్డాడండి బురదలో గిరి
పరువు కలిసె గంగలో హరి ॥పడ్డాడండీ॥
నీచంగా.... నీచంగా.... బతుకుమారిందే
చండాలంగా ॥పడ్డాడండీ॥

చరణం 1 : ప్రసాదు అన్నమాటకర్థమేంటో మరి
ప్రభుత్వ సారా దుకాణంగ తెలుసుకో సరి
సారాతో చేస్తే ఖుషీ
తప్పదు నీ కథోగతి
ఇళ్ళు ఒళ్ళు గుల్లచేసి పైకి పంపు
సరాసరీ ॥పడ్డాడండీ॥

చరణం 2 : కల్తీలేని మందు దొరుకుటే లక్కుగా
కల్తీని చేయుటే వారి జన్మహక్కుగా
అడిగావో అంతే మరి
అంతటితో బతుకుసరి
కుళ్ళబొడిచి కీళ్ళు విరిచి
పంపుతారు సరాసరి ॥పడ్డాడండీ॥

("స్టూడెంటు నెం. 1' చిత్రంలోని "పడ్డానండీ ప్రేమలో మరి" పాట ఆధారంగా)

**-కె.వి.ఆర్.కోటేశ్వరరావు, అద్దంకి**




విడుదల : హెచ్.ఎం.వి.
వెల : రూ.80/-




తెలుగు సినీ సంగీత చరిత్రలో ఇంచుమించుగా ఉన్న కవులందరూ హాస్య గీతాలను రాసినా కొసరాజు స్థానం మాత్రం ప్రత్యేకం. అలాగే కొసరాజు హాస్యగీతాలను ఎన్నిటినో రాసినా సన్నివేశ సందర్భానుసారంగా రాసిన హాస్యేతరగీతాలు ప్రత్యేకస్థానాన్ని ఆక్రమించుకోవటమే కాక 'ఇవి రాసినది కొసరాజా!?' అనేటంత పేరుని సంపాదించుకున్నాయి. ఈ రెండు రకాల ప్రత్యేకతలను కలగలుపుకుంటూ హెచ్.ఎం.వి. వారు 'కొసరాజు సినీగీతాలు' పేరిట డబుల్ ప్యాక్‌ను విడుదల చేశారు. మొత్తం ఇందులో 29 పాటలున్నాయి.

అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయినే, సరదా సరదా సిగిరెట్టు, మావూళ్ళో ఒక పడుచుంది, భలే ఛాన్సులే...ఇల్లరికంలో ఉన్న మజా, రావే రావే బాలా వంటి పక్కా హాస్యగీతాలూ -

ఆడుతు పాడుతు పనిచేస్తుంటే అలుపుసొలుపేమున్నది, ముద్దబంతిపూలు పెట్టి మొగలి రేకులు జడను చుట్టి వంటి సభ్య శృంగార యుగళ గీతాలు -

అమ్మబాబో నమ్మరాదు ఈ వగలమారి అమ్మాయిల నమ్మరాదు, మామ మామా మామా, గౌరమ్మా నీ మొగుడెవరమ్మా వంటి వ్యంగ్య శృంగార యుగళ గీతాలూ

ఎంత టక్కరి టక్కరి వాడు, ఏడనున్నాడో ఎక్కడున్నాడో వంటి చిలిపి శృంగార గీతాలూ

నిలువవే వాలు కనులదానా, బులిబులి ఎర్రని బుగ్గలదానా, ఏవమ్మా జగడాల ఒదినమ్మా, పగటి కలలు కంటున్న మావయ్య, ఓ చిన్నదాన నన్ను విడిచి పోతావటే వంటి కవ్వింపు గీతాలూ

కలవారి స్వార్థం నిరుపేద దుఃఖం, ఏ నిమషానికి ఏమి జరుగునో ఎవరూ హించెదరూ వంటి శోక గీతాలూ

కళ్ళు తెరిచి కనరా, జయమ్ము నిశ్చయమ్మురా భయమ్ము లేదురా, టౌను పక్కకెళ్ళొద్దురా, మత్తు వదలరా నిద్దుర మత్తు వదలరా, కళ్ళు తెరిచి చూచుకోండయ్యా, ఏరువాకాసాగారో రన్నో చిన్నన్న, వినవయ్యా రామయ్యా వంటి ప్రబోధాత్మక గీతాలూ

పదపదవె వయ్యారి గాలిపటమా, దులపర బుల్లోడా వంటి సరదా గీతాలూ ఈ రెండు ఆడియోలలోనూ చోటుచేసుకున్నాయి. ఉన్న పాటలని పైన ఉదహరించిన విధంగా - కేటగిరిలు వేసుకుని చూస్తే కొసరాజు బహుముఖ ప్రజ్ఞపై సంపూర్ణ అవగాహన కలిగి తీరుతుంది. నిజానికి ఈ డబుల్ ప్యాక్ కొసరాజుకి ఒక నివాళి, ఒక నీరాజనం, ఒక సూవెనీర్ అని చెప్పితీరాలి.

పాటల ఎంపిక, వాటి సమీకరణ, అధునీకరణ ఇవన్నీ ఎంతో శ్రమకు, వ్యయానికి సంబంధించినవి. వాటన్నిటినీ అధిగమించి ఇటువంటి ప్రయత్నాలను ఒక కొలిక్కితీసుకురావటానికి ఎంతో అభిరుచి, ఎంతో సహనం ఉండాలి. అదంతా ఈ డబుల్ ప్యాక్ రూపకల్పనలో కనిపిస్తుంది.

అయితే ఇటువంటి బృహత్ ప్రయత్నాలలో మరి కాస్త శ్రద్ధ అవసరం. అదికూడా ఈ డబుల్ ప్యాక్‌లో తెలుస్తూ ఉంటుంది. కలవారి (స్వార్థం) పాటకు ఇంగ్లీషులో కలవాని అని ముద్రించటం అక్షరదోషం కావచ్చు. కానీ ఇన్‌లే అవుటర్‌కవర్‌లో 'భలేరాముడు'అని వేసి అదే పాటకి ఇన్‌లేలో 'భలేరంగడు' వెయ్యడం(భలేరంగడే కరెక్టు) కొంత సర్దుకోదగ్గ లోపమే కావచ్చు -'దులపరబుల్లోడా' పాటని భానుమతి, పిఠాపురం, మాధవపెద్ది పాడితే భానుమతి అండ్ కోరస్ అని వెయ్యటాన్ని కూడా 'పోనీలే' అని సరిపెట్టుకోవచ్చు. కానీ - యస్.రాజేశ్వరరావు సంగీతాన్ని ఇచ్చిన అయ్యయ్యో చేతిలో డబ్బులు పోయెనే, రావేరావేబాలా పాటలకు సంగీత దర్శకునిగా పెండ్యాల పేరుని వెయ్యటం చరిత్రపరంగా భరించలేని దోషం, ద్రోహం. అందుకే శ్రద్ధ మరింత అవసరం అని పేర్కొనడం జరిగింది.

---

విడుదల : సుప్రీమ్
వెల : 32/-




హిట్ అయిన డైలాగులతో సినిమా క్యాసెట్లు, సినిమా కథ అర్థమయ్యేలా సంక్షిప్తరీతిలో సంభాషణల సంకలనాల క్యాసెట్లు, రకరకాల మిమిక్రీ క్యాసెట్లు ఎన్నో ఇదివరకు వచ్చాయి. కానీ ఇటీవల సుప్రీమ్ వారు విడుదల చేసిన 'ఎన్.టి.ఆర్. మళ్ళీ పుట్టాడు' మిమిక్రీ ఆడియో క్యాసెట్ తరహాయే వేరుగా ఉంది. ఇటీవలి కాలంలో ఇంత ఇంట్రెస్టింగ్‌గా కూర్చోబెట్టే ఆడియో మరొకటి

రాలేదంటే అతిశయోక్తి కాదేమో !?

అసలు మొట్టమొదట అభినందించవలసినది కాన్సెప్ట్‌ని. అందులో ఎంటర్‌టైన్‌మెంట్ ఉంది. వ్యంగ్యం ఉంది. లౌక్యం ఉంది. సందేశం ఉంది. వీటన్నిటినీ కలగలుపుతూ నిజంగా మన కళ్ళముందే జరుగుతోందా అన్నంతగా దృశ్యానుభూతిని కలిగించే చాకచక్యపు కథనం ఉంది.

## రాజా ఆడియో రివ్యూ

తర్వాత చెప్పవలసినది మిమిక్రీ హరికిషన్‌ని. ఒక విధంగా ఈ క్యాసెట్‌కి అతను ప్రాణం. ఎన్.టి.ఆర్., ఏయన్నార్, ముక్కామల, ఎమ్మెస్ నారాయణ, ఎల్బీశ్రీరామ్, ఏవీయస్, బ్రహ్మానందం, చిరంజీవి, నాగార్జున, బాలకృష్ణ, వై.ఎస్.రాజశేఖర్ రెడ్డి, నారా చంద్రబాబు నాయుడు ఇలా వీరందరి కంఠాలను అనుకరిస్తూ ఒక కథలా నడపడం సామాన్యమైన విషయం కాదు. ఈ క్యాసెట్‌లో తన మిమిక్రీ పార్ట్‌ని అందివ్వటంలో హరికిషన్ తీసుకున్న సమయం నాలుగున్నర గంటలే! అంత తక్కువ సమయంలో ఇంత ఎఫెక్టివ్‌గా ఫెర్మార్మెన్స్ ఇచ్చిన హరికిషన్ - సినీ అభిమానుల , హాస్య ప్రియుల మనసుల్లో ఈ క్యాసెట్ ద్వారా చాలాకాలం గుర్తుండిపోతాడు.

జయప్రద కంఠాన్ని, టీవీ న్యూస్ రీడర్ కంఠాన్ని లెనినాచౌదరి చక్కగా అనుకరించింది. ఒక గాయకునిగా, ఒక డబ్బింగ్ ఆర్టిస్ట్‌గా పేరుతెచ్చుకుంటున్న లెనినా చౌదరి ప్రతిభను మరో కోణంలో ఈ క్యాసెట్ ఆవిష్కరించింది. ఇదికాక మరొక పసిబాలుడి కంఠం కూడా ఉంది. దాన్నొక స్కూల్ పిల్లవాడితో చెప్పించారట. వీరిద్దరి పార్ట్ అరగంటలోనే రికార్డ్ అయిందట.

కేవలం 5 గంటల వ్యవధిలో ఇంత ఎఫెక్టివ్‌గా ఒక క్యాసెట్ రూపొందటాన్ని ప్రత్యేకంగా ప్రశంసించి తీరాలి. మధ్య మధ్య హీరోలకు తగ్గ పాటలను మిక్స్ చేయటం, కాన్ఫరెన్స్ హాలుకి ఎన్.టి.ఆర్. వెళ్తుంటే 'శ్రీ కృష్ణ పాండవీయం 'లోని స్వాగతం సుస్వాగతం' పాటలోని ఇంటర్లూడ్‌ని వాడుకోవటం ఇవన్నీ సముచితంగానూ, సందర్భోచితంగాను ఉన్నాయి.

ఈ కాన్సెప్ట్‌ను చండిక సాంబశివరావు రూపొందించగా తాడి బలరామ్ సంభాషణలను అందించారు. కల్పిత కథాంశంతో కూడిన ఈ హ్యూమరస్ ఆడియో క్యాసెట్ ప్రతి ఒక్కరూ వినదగ్గది, పదిమంది కలిసినప్పుడు సరదాగా వేసుకొనదగినది. దాచుకొనదగినది కూడా.

---




**విడుదల : ఆదిత్య**
**వెల : రూ.38/-**

మనీషా చిత్రాల ద్వారా కిషోర్ రాఠీ పేరు ప్రేక్షకులందరికీ 'తెర' పరిచతమే! ఆయన ఇప్పుడు మనీషా ఆర్ట్స్ మీడియా ప్రైవేట్ లిమిటెడ్ బ్యానర్ పై శ్యామ్ ప్రసాద్ దర్శకత్వంలో నిర్మించిన 'మౌనమేలనోయి' ఆడియో క్యాసెట్ విడుదలయింది. ప్రేమంటే ఇదేరా, తమ్ముడు, బద్రి చిత్రాల ద్వారా తెలుగు నాట తనేమిటో నిరూపించుకున్న రమణగోగుల ఈ చిత్రానికి సంగీత దర్శకుడు...అఫ్‌కోర్స్ ప్రధాన గాయకుడు కూడా! క్యాసెట్‌లో ఉన్న 6 పాటలలో ఒక్కటి తప్పమిగిలినవన్నీ వేటూరి రాసారు.

రమణగోగుల, ప్రియ పాడిన 'ఓ ప్రియురాలా నా మధుబాలా' పాట ట్యూన్ పరంగా ఇళయరాజా స్టాండర్డ్‌ని గుర్తుచేసే పాట. 'చెలికాడా - చెలికాడా (దగ్గర) వంటి పదాలు వేటూరి మార్కుని ప్రతిఫలింపచేస్తాయి. ఇదొక హిట్ గీతం. రమణగోగుల సోలోగా బృందంతో పాడిన 'కృష్ణవేణి తీరంలో సంధ్యా సమయంలో పాట ఓ వండ్రపుల్ సాంగ్...ఈ పాటకి ఊగని వారుండరు. 'ఆ తార కోసం నేను సందెవేళ పుట్టానులే/ ఎంకిపాటనైనాను ఆమె కోసమె/ఆమెలేని రాత్రం - నిద్రలేని నేత్రం లాంటి పదాలు వినగానే తెలిసిపోతుంది -ఇలాంటివి వేటూరికాక ఇంకెవరు రాస్తారని!? గోవా పరిసర ప్రాంతాలలో వినిపించే మ్యూజిక్‌ను తీసుకుని ట్యూన్ చేసారా అని అనిపిస్తుంది ఈ ట్యూన్‌ని వింటుంటే. రమణగోగుల, ప్రియ పాడిన 'దంచేటి అమ్మలక్కల్లో ఆ చెమ్మచెక్కల్లో పడుచుల పకపకలు' పాట జస్ట్ ఓ హుషారైన గీతం - అంతే! అమ్మలక్కలు -చెమ్మచెక్కలు అనే పదాల్ని ఇప్పటి వరకూ తెలుగువారంతా కొన్ని లక్షలసార్లు విని ఉంటారు. కానీ రెండిటినీ కలిపి కాయినింగ్ చేసింది వేటూరే...దటీజ్ వేటూరి!!

రమణగోగుల రాసి పాడిన 'వయారి నడకలు చూసే లక్కు...కాంపస్‌లైఫ్ ముగిసిందిరో' అనే క్యాంపస్ ఫేర్‌వెల్ సాంగ్‌కి యూత్‌ని టార్గెట్‌గా చేసుకున్నారు కాబట్టి ఆ మేరకు ఖచ్చితంగా హిట్ అవుతుంది. ప్రియ పాడిన 'ఇది బెనారసీ అన్నపూర్ణ' పాట 'కృష్ణవేణి తీరంలో - సంధ్యాసమయంలో' పాటకి మరో పార్ట్‌కింద లెక్క. రమణగోగుల పాడిన 'ప్రేమే గానమాయే' పాట క్యాసెట్‌లోని పాటల్లో ఎక్కువ కాలం నిలిచిపోయే పాట. యమన్‌రాగచ్ఛాయల్లో సాగిన ఈ పాట ఎన్నిసార్లు విన్నా మళ్ళీమళ్ళీ వినాలనిపిస్తుంది. టోటల్‌గా ఈ మధ్య వచ్చిన ఆడియోలలో ఇదొక మంచి ఆడియో.

# భూలోక చాపచుట్టి బొబ్బిలి కేశవయ్య!

కవులకూ, కళాకారులకూ
ధిషణాహంకారం - అలంకారం...
కానీ దురహంకారం కూడదు!!
ఏనుగునెక్కినాము, ధరణీంద్రులు మొక్కగ నిక్కినాము....
అన్న తిరుపతి వెంకట కవులే.... ప్రజ్ఞానిధులంచు
పేరుగొనినారము
నీవలనన్ సరస్వతీ.... అన్నారు!!
అంచేత విద్యతో పాటు వినయ సంపద ఉంటేనే
శోభిస్తుంది.
ఇంతెందుకు శ్రీనాథుణ్ణీ.... డిండిమ భట్టారకుణ్ణీ
తీసుకోండి!!
ఎంత అహంకరించాడు డిండిమభట్టు....
ఎంత అవమానించాడు
మిగతా విద్వాంసుల్ని ... చివరికేవయిందీ!...
డొక్కా... ఢక్కా రెండూ బద్దల్యాయ్!!
కవి సార్వభౌముడికి కనకాభిషేకం జరిగింది....
ధరిత్రి పులకరించింది....
చరిత్ర పన్నీరు చిలకరించింది.....
డిండిమభట్టు వంటి అహంకారే
బొబ్బిలి కేశవయ్య!

విజయనగరం వారు బొబ్బిలికోట ముట్టడించాక... బొబ్బిలి వైభవ మంతాపోయాక.... రాజారాయుడప్ప కాలంలో బొబ్బిలిలో ఓ వేణుగోపాలస్వామి ఆలయం వెలిసింది!!

మళ్ళీ కళలూ.... కళాకారులూ.... సంగీతం.... సాహిత్యం.....

మొలకలెత్తుతున్న దశలో కేశవయ్య బొబ్బిలి ఆస్థాన విద్వాంసుడిగా నియమింపబడ్డాడు!!

చిన్న వయస్సే.... ఉన్నట్టుండి.... తల్లిగారు పోయారు.

కేశవయ్య మహా బెంగ పడిపోయాడు.

కొన్నేళ్ళ పాటు మళ్ళీ తంబూర ముట్టుకుంటే ఒట్టు!

కానీ రాజా వారికి కేశవయ్య అంటే వల్లమాలిన ప్రేమ

అంచేత ఆస్థానంలో ఉంటే ఇలా బెంగతోటే విద్యంతా నాశనం చేసుకుంటాడు.... గనుక.... వివిధ ఆస్థానాలకి పోటీకి పంపించడం ప్రారంభించాడు.

కేశవయ్య.... ఒక్కసారి జూలు దులిపి సింహంలా ఆస్థానాల మీద పడ్డాడు!!

ఏదైనా ఆస్థానాని కెళ్ళడం
నాతో పోటీ చేయగల విద్వాంసుడున్నాడా అని అడగడం
సభ జరగడం... సభలో - జగన్మోహనంగా పాడ్డం....
అంతా చప్పట్లు కొట్టడం.... శాలువాలు కప్పడం!!
సన్మానాలు చెయ్యడం....
కానీ దీంతో కేశవయ్య అహం చల్లారేది కాదు!!
ఓడిపోయిన విద్వాంసుడి తంబూర లాగేసుకునేవాడు!!
అసలు కండీషనే అదీ!

నాతో ఎవరన్నా ఓడిపోతే.... ఓడిపోయిన వాడు తంబూర, ఇతర బిరుదులు అప్పగించి.... దణ్ణం పెట్టి వెళ్ళి పోవాలి!!

తంబూర ఇచ్చెయ్యడం అంటే సంగీత విద్వాంసుడికి
తలకాయ నిచ్చెయ్యడమే గదూ!!
అంతకన్నా అవమానం ఉందీ!!
కానీ ఏం చేస్తాం... అది కేశవయ్య షరతు....

లెక్కకుమించిన సంస్థానాలకెళ్లి... సంగీతంలో వాళ్లని ఓడించి.... వందల కొద్ది తంబూరాలు... పతకాలు తీసుకొచ్చి.... తన ఇంట్లో ఓ పెట్టుకున్నాడు!!

ఓ రాత్రి వేళ!
విజయగర్వంతో నిద్రపట్టలేదు కేశవయ్యకి!
దీపం బుడ్డితో... తన మ్యూజియంకు కెళ్ళాడు!!!
చుట్టూ.... మౌనంగా తంబూరలు....
తలలు వాల్చేసిన సంగీత విద్వాంసుల శిరస్సుల్లాగ....
సిగ్గుతో.... అవమానంతో బిగదీసుకుపోయిన
మొగని ... తీగలు...
కేశవయ్య వికటాట్ట హాసం చేసాడు!!
అచ్చం.... శ్మశానం మధ్య కాగడాతో తిరిగే కాటి కాపరిలా ఉన్నాడు.

పరాయి స్త్రీల మాంగల్యాలని తెంపి గుత్తిగా పట్టుకున్న పరమ పాపిలా ఉన్నాడు!

వేయికోయిలల మధ్య.... గండభేరుండంలా ఉన్నాడు.
వంద కుందేళ్ళ మధ్య.... గుంట నక్కలా ఉన్నాడు....
గోవుల మంద మధ్యన చిరుత పులిలా ఉన్నాడు!!!

అతను సంగీత విద్వాంసుళ్ళాలేడు.... మల్ల యుద్ధం చేసే పహిల్వాన్‌లా ఉన్నాడు!!

అతని చేతిలో తంబూర - పాతకాలపు ఫిరంగిలా ఉంది.
మళ్ళీ కరువుదీరా.... కసితీరా నవ్వుకున్నాడు!!
నేనెవణ్ణి.... బొబ్బిలి కేశవయ్యను!!
వొట్టి బొబ్బిలి కేశవయ్యను కాను
గాన కేసరి కేశవయ్యని
స్వరవీర బెబ్బులి.... బొబ్బిలి కేశవయ్యని

'ప్రళయకాల ఝంఝామారుత' ఇత్యాది బిరుదాల్ని పొందిన బొబ్బిలి కేశవయ్యని!....

దేశంలోని ఎంతోమంది సంగీత విద్వాంసుల్ని జయించి.... 'భూలోక చాపచుట్టి' అనే బిరుదుని

సొంతం చేసుకున్న బొబ్బిలి కేశవయ్యని!!
ఒక్కసారి తంబూరలు విషాదంగా మోగడం ఆరంభించాయ్!!
వేయితీగల నాద ఘోష!!
వేలవేల విద్వాంసుల హృదయ ఘోష!!
కైపుతలకెక్కి.... నిద్రలోకి జారిపోయాడు!!

జారిపోయాడు... జారిపోతున్నాడు
జా... రి.... పోతు..... న్నాడు !!!
సరస్వతి....కచ్ఛపిని శృతి చేసుకుంటూ
మర్మగర్భంగా నవ్వింది!

****

తంజావూర్‌ని తులజాజీ మహరాజు
పాలిస్తున్న కాలం....
తంజావూరులో అడుగు పెట్టాడు
"భూలోక చాపచుట్టి".
మహరాజా వారి గుండెల్లో... మృదంగాల మోత....
సింహనాదం చేస్తున్నాడు...
బొబ్బిలి కేశవయ్య!....
మహరాజా వారు కంగారు పడిపోయారు
గత్యంతరం లేక... వెళ్ళి
శ్యామశాస్త్రి కాళ్ళమీద పడ్డారు!!!
"మీరొచ్చి పరువు కాపాడాలి!"
"నేను రాజాస్థానాలకు రాను"
"సంస్థానం పరువు పోతుంది"
"... ... ... ...."
"ఆత్మహత్యే శరణ్యం"!!
"సరే పదండి!...."
అంతా కామాక్షీ దేవి కటాక్షం.....
పోటీకి వెళ్ళేముందు తన ఆరాధ్య దైవం కామాక్షిని
"దేవీ సమయమిదే".... అంటూ 'చింతామణి' రాగంలో స్తుతించాడు.... శ్యామ శాస్త్రి.
పోటీ మొదలైంది.
చెలరేగి పోతున్నాడు... కేశవయ్య



తనికెళ్ళ భరణి

సౌమ్యంగా మందహాసం చేస్తున్నాడు శ్యామశాస్త్రి....
మధ్యాన్న మార్తాండుడిలా... కేశవయ్య....
శరత్ పూర్ణిమలా శ్యామ శాస్త్రి.....
ఝుంఝూమారుతంలా - కేశవయ్య....
మలయ మారుతంలా శ్యామశాస్త్రి....
ఒకటి ప్రళయ సాగరం....
రెండోది మందాకిని....
'సింహనందన' తాళంలో వంజా విప్పాడు బొబ్బిలి కేశవయ్య!....
సభ అవాక్కైపోయింది....
శ్రోతలు అప్రతిభులై పోయారు
రాజావారికి మతి పోయింది.
చేతులు వణికాయ్!!!
ఇప్పుడు శ్యామశాస్త్రి వంతు
తల్లి కామాక్షిని మనసులో స్మరించుకుని
'శరభ నందన' అనే నూతన తాళం మొదలెట్టాడు!!!
స్వర పరంపర కురుస్తోంది
బిత్తర పోయాడు కేశవయ్య....
కళ్ళు మూసుకుని గానం చేస్తున్న శ్యామశాస్త్రిలో ఏవో దృశ్యాలు కనపడుతున్నాయ్
అహంకార హిరణ్య కశపుని కడుపుని గోళ్ళతో చీరేస్తున్న
నారసింహ రూపం....
అజ్ఞానాన్ని తొక్కేస్తున్న నటరాజ స్వరూపం!
తర్వాత అమ్మల గన్నయమ్మ... కామాక్షీదేవీ...
అప్రయత్నంగా చేతులు జోడించి.... అశ్రువుల్తో
శ్యామశాస్త్రి పాదాల్ని తడిపేశాడు
"భూలోక చాప చుట్టి"!!!!
(సంగీత త్రయం - త్యాగరాజస్వామి, ముత్తుస్వామి దీక్షితార్ శ్యామశాస్త్రిలలోని - శ్యామశాస్త్రే ఈయన)

- తనికెళ్ళ భరణి

(డాక్టర్ సి.విజయలక్ష్మిగారు రచించిన 'ఆంధ్రప్రదేశ్ సంస్థానాలు - సంగీత వాఙ్మయం' చదివి, స్పందించి)

-భరణి

ఈ వ్యాసంపై అభిప్రాయాన్ని శ్రీ తనికెళ్ళ భరణికి తెలియజేయ దలచుకునే వారు

**తనికెళ్ళ భరణి,**

కేరాఫ్: "హాసం", 502, శ్రీబాలాజీ నిలయం, 13-1-212, మోతీనగర్, హైదరాబాదు - 500 018
అడ్రసుకు ఉత్తరాలు పంపాలి.

**'శివుడి ఆజ్ఞలేందే చీమైనా కుట్టదు గదా!' అన్న వాక్యాలు నాస్తికులయిన వారు ఒప్పుకోరేమో కానీ, ప్రతిభ అనేది ఏనాటికైనా ఊయల వెళ్ళి కుంకుడు చెట్టుకు చిక్కుకున్నట్లు - ప్రజావాహినీలోకి వచ్చి వెలుగుతూ నైపుణ్యాన్ని తేటతెల్లం అవుతుందన్న మాటకి 'కోటయ్య దేవర' ఓ నిదర్శనం!! ఇంకా పత్రిక, సినిమా, కళాభి రాగాల్లోకి రాని, కనబడని ప్రతిభావంతులెంతమందో, మరుగున పడిపోయున్నారు. మీ వంటి వారి ద్వారా కొందరి పరిచయ భాగ్యమైనా ఈ రీతిని కలుగుతోంది. ఆ కుంకుడు చెట్టుకు ఊయల చిక్కటం పదేపదే గుర్తుకు వస్తున్న నైనం మీ హాస్యచతురత పాఠక, సంగీత, సాహిత్యాభిమానులకు గిలిగింతలు పెట్టింది.**

**ఏ కళాకారుడికైనా ప్రతిభావంతుడికైనా అడ్డుకట్టగా, నిలిచేదైనా, 'మునుగడ కోసం చేసే జీవన పోరాటమే' కొందరికి అన్నీ ఉన్నా ప్రోత్సాహం అనే ఇంధనం లేకపోవటం, 'జీవనోపాధి' అనే ఇంట గెలవడం పూర్తి అయ్యేసరికి రచ్చగెలవడం అవే ప్రతిభా పాటవ ప్రకటన ప్రకటితమ అయ్యేసరికి కాలం కర్పూరంలా.... హరించుకు పోవటం జరుగుతోంది. దీంతో ఎంతోమంది అద్భుత ప్రతిభావంతులు బాహ్య ప్రపంచానికి పరిచయం కాకుండానే కనుమరుగవుతున్నారు. మనకు తెలియని కోటయ్య దేవర వంటి వారినెందరినో- 'భరణి' గారూ... - మీరే మరిన్ని రచనల ద్వారా తెలియ జెప్పాలని ఆకాంక్ష. (వీలయితే, లభిస్తే కోటయ్య దేవరగారి 'ఫోటో' ప్రచురించండి. ) ఉచితంగా భోజనం పెట్టి మరీ సంగీతం నేర్పించిన కోటయ్యగార్కి శతకోటి వందనాలు.**

-నేమాని సుభాష్‌చంద్ర బోస్, శ్రీకాకుళం టౌన్

# నా బర్త్‌డేని అమెరికన్స్ అంతా బాగా సెలబ్రేట్ చేసుకుంటారు

**- కీరవాణి**



**ఆయన మాటల్లో నిండైన తెలుగుదనం. పాటల్లో కూడా అంతే. తెలుగు పాట కీర్తి పతాకను జాతీయ స్థాయిలో ఎగురవేసిన ఆ సంగీత దర్శకుణ్ణి ఇవాళ ప్రత్యేకంగా తెలుగు వాళ్ళకి పరిచయం చేయనవసరం లేదు.**

**తెలుగు 'ధనా'నికి తెలుగుదనానికి తన బాణీలో తన వాణీతో అతి చక్కగా ముడిపెట్టి హృదయాల్ని మీటగల స్వరలేఖిని - కీరవాణి! ఆయనను వివిధ కోణాల్లో ఆవిష్కరించే ప్రయత్నం చేసింది 'హాసం'.**

**సంగీతం మీద తప్ప ఇక దేనిమీద మోజులేదని స్పష్టంగా చెబుతున్న కీరవాణి అడపా తడపా పాటల రచయితగానో, గాయకుడుగానో ప్రత్యక్ష మవుతున్నారు. ఆ వివరాలు ఆయన అభిరుచులు - ఆయన మాటల్లోనే చదవండి.**

## పాటల రచయితగా....

'ఆత్మబంధం' చిత్రం కోసం రాసిన 'పోరింక పడలేను' నా తొలిపాట. చాలా సరదాగా రాసిన పాట ఇది. నిజంగా రాయమంటే నేను రాయలేను. నాకు సాహిత్యం మీద కూడా అంత కమాండ్ లేదు. నేను తెలుగువాణ్ణి, నాకు తెలిసిన తెలుగు అంతే...!.

ఇప్పటికి ఓ 20-30 పాటలు రాసి వుంటాను

హైదరాబాద్ రైటర్స్ అసోసియేషన్‌లో నేను సభ్యుణ్ణి కూడా.

నేను రాసిన ఏ పాటకు ఇంతవరకూ పారితోషికం తీసుకోలేదు. ఒకే ఒక్క పాటకి మాత్రం పారితోషికం తీసుకున్నాను. అది కూడా నా కోసం కాదు.

తెలుగులో తప్ప ఇంకే భాషలోనూ పాట రాయలేదు. ఇతర భాషల్లో పాడటమే ఓ సాహసమనుకుంటే, రాయడం దుస్సాహసమవుతుంది.

నా వృత్తి సంగీతం. ఇవన్నీ బోనస్.



## గాయకుడిగా....

'మొండి మొగుడు - పెంకిపెళ్ళాం' చిత్రంలో 'నాటకాల జగతిలో జాతకాల జావళి' అని వేటూరి గారు రాసిన పాటను నేను తొలిసారిగా పాడాను.

ఇదికూడా అనుకోకుండా జరిగింది. నేను పాడిన ట్రాక్ విని ఇదే బాగుంది వుంచేద్దామన్నారు దర్శకుడు వై.నాగేశ్వరరావు.

ఇప్పటికి ప్రైవేట్ ఆల్బమ్స్‌తో కలుపుకుని 100 పాటలు పాడాను. ఏ సినిమా పాటకి నేను పారితోషికం తీసుకోలేదు.

ఈ మధ్య 'పిలిస్తే పలుకుతా' కోసం ఓ పాట పాడితే నిర్మాత విజయచందర్‌గారు అడక్కుండానే పారితోషికం పంపించారు. అప్పుడాయన్ని నేను పిచ్చోడిలా చూసాను. ఎందుకంటే ఇంతవరకూ ఎవరూ ఆ పని చేయలేదు కాబట్టి.

నా సంగీతంలోనే కాకుండా, బైట సంగీత దర్శకుల దగ్గర కూడా పాడాను. నేను తొలిసారిగా అలా బైట పాడింది 'ఆంటీ' రమేష్ దగ్గర. మౌళి గారి దర్శకత్వంలో రూపొందిన సినిమా అది 'సొగసుల రాణివే' అనే ఆ పాటను నేను, మనో కలిసి పాడాం.

ఇళయరాజా, కోటి, వందేమాతరం శ్రీనివాస్, మణిశర్మల దగ్గర కూడా పాడాను.

ఎమ్మెస్ విశ్వనాథన్ సంగీత దర్శకత్వంలో ఓ భక్తిగీతాల ఆల్బమ్ కోసం పాడాను.

హిందీలో 'ఇస్‌రాత్‌కే సుభానహీ' సినిమాకి నేనే సంగీత దర్శకుణ్ణి. ఆ సినిమాలో రెండు పాటలు పాడాను.

'టాబూన్' అనే సంగీత దర్శకుడి ఆధ్వర్యంలో ఓ హిందీ ప్రైవేట్ ఆల్బమ్‌లో పాడాను.

వేటూరి గారికి నేషనల్ అవార్డు తెచ్చిపెట్టిన 'మాతృదేవోభవ' చిత్రంలోని 'రాలిపోయే పువ్వా నీకు రాగాలెందుకో' పాట నేను పాడటం నా అదృష్టం

'రక్షణ'లో నాగార్జునకి పాడాను. 'ఒసేయ్ రాములమ్మ'లో పాడాను. 'స్టూడెంట్ నెం.1'లో ఎన్.టి.ఆర్‌కి పాడాను.

తమిళ్, మలయాళం, కన్నడంలో కూడా నేను పాటలు పాడాను

ఎన్ని పాటలు పాడినా అది నా ప్రొఫెషన్ కాదు.



## బర్త్‌డే

నేను 1961 జులై 4న పుట్టాను. నా బర్త్‌డేని అమెరికన్స్ అంతా బాగా సెలబ్రేట్ చేసుకుంటారు. కంగారు పడిపోకండి. జులై 4 అమెరికన్ ఇండిపెండెన్స్‌డే.

**ఆ రోజునే స్వామి వివేకానంద వర్థంతి కూడాను.**

## సంగీత దర్శకత్వం....

నందమూరి తారకరత్న హీరోగా ఆకుల శివ దర్శకత్వంలో కె.రాఘవేంద్రరావు, అశ్వనీదత్‌లు కలిసి 'స్వప్న సినిమా' బేనర్‌పై ఓ సినిమా చేస్తున్నారు. ఆ సినిమాతో ఇప్పటికి సంగీత దర్శకుడిగా నా సంఖ్య 155. తెలుగులో 115 సినిమాలు చేస్తే, హిందీలో 3, కన్నడంలో 10, తమిళంలో 10, మలయాళంలో 5 సినిమాలు చేసాను.

ప్రైవేట్ ఆల్బమ్స్ మొత్తం పది చేసాను.

## నటన....

దర్శకుడు ఉప్పలపాటి నారాయణరావు పదేళ్ళ నుంచి నన్ను నటించమని అడుగుతున్నాడు. నాది విలన్ ఫేస్ అట. అందుకని విలన్‌గా చేయమని అడుగుతూనే వున్నాడు. కానీ నాకు నటన మీద ఆసక్తిలేదు.

దర్శకత్వం చేసే ఆలోచన అస్సలు లేనే లేదు.

నిర్మాణం విషయానికొస్తే నాకంత సీన్ లేదు. నేనింకా సెటిల్ కాలేదు. ఇంకా భుక్తిమార్గంలోనే వున్నాను. పేరు గొప్ప - ఊరు దిబ్బ అంటారే, అది నా పరిస్థితి. రేపు జీవితంలో స్థిరపడ్డాక అప్పుడు అలాంటివన్నీ ఆలోచించాలి.

రికార్డింగ్ థియేటర్ నెలకొల్పే యోచన ప్రస్తుతానికి లేదు.

## ఫేవరెట్ మ్యూజిక్ డైరెక్టర్స్

పాత వాళ్ళందరినీ అభిమానిస్తాను, ఆరాధిస్తాను.

కొత్త వాళ్ళలో ఒక్కొక్కరిలో ఒక్కొక్కటి నచ్చుతుంది.

కొత్తవాళ్ళలో రహమాన్ కొంతవరూ నాకు నచ్చుతాడు.

హంసలేఖ ఈ మధ్యనే 'శ్రీమంజునాథ' చిత్రం కోసం చేసిన 'ఈ పాదం' పాట తెగ నచ్చేసింది.

వి.ఎ.కె. రంగారావు గారి దగ్గర మ్యూజిక్ కలెక్షన్ ఎ టూ జెడ్ వుంది. నా దగ్గర కూడా కలెక్షన్ వుంది. కానీ అవన్నీ నాకు నచ్చినవి మాత్రమే.

ఈ మధ్యకాలంలో నా కలెక్షన్‌లో చేరిన పాట 'మనసంతా నువ్వే'లో ఆర్పీ పట్నాయక్ చేసిన 'తూనీగ తూనీగ' పాట. ఆ పాట నాకు చాలా నచ్చింది.

ఇప్పుడు వంద పాటలు రిలీజవుతుంటే, అందులో నాకు ఒక్కటే నచ్చుతుంది.

ఇళయరాజా గారి పాటలంటే నేను చెవికోసుకుంటాను. కానీ 1993 తర్వాత ఆయన చేసిన ఏ పాటా నాకు నచ్చలేదు.

నేను చేసిన వాటిలో 30 శాతం చెత్త పాటలు వున్నాయి. 30 శాతం పర్వాలేదు. కేవలం 40 శాతం మాత్రమే చాలా బాగున్నాయనిపించే స్థాయిలో వున్నాయి. ఆ 40 శాతంలో పాటల్ని ఈ రోజుకీ వింటే హాయిగా అనిపిస్తుంది. నూటికి నూరుశాతం మంచి మ్యూజిక్ ఇచ్చానని నేనెప్పుడూ చెప్పను.

ఆ 40 శాతంలో ఏది బెస్ట్ అంటే చెప్పడం అంటే చాలా కష్టం.

## ఫేవరెట్ రైటర్

వేటూరిగారే నా ఫేవరెట్ రైటర్. అందులో ఏ మాత్రం సందేహం లేదు.

## ఫేవరెట్ సింగర్స్

చాలా మంది వున్నారు. ముఖ్యంగా బాలు, చిత్ర, కిషోర్‌కుమార్, గీతాదత్‌ల గాత్రాల్ని ఇష్టపడతాను.

## ఫేవరెట్ మూవీ

ఎన్‌టిఆర్ దర్శకత్వంలో వచ్చిన 'శ్రీకృష్ణపాండవీయం' నాకు చాలా ఇష్టం. ఇప్పటికి ఓ యాభైసార్లు చూసి వుంటాను. టి.వి.రాజు గారు దానికి సంగీతం.

నేను సంగీతం సమకూర్చిన వాటిలో నాకు నచ్చిన చిత్రం 'సీతారామయ్యగారి మనవరాలు'.

## ఫేవరెట్ సాంగ్

నస్రత్ ఫతె అలీఖాన్ 'సంగమ్' ఆల్బమ్‌లో పాడిన 'జిసమ్ థక్తా' పాట అంటే నాకు ప్రాణం. జావేద్ అఖ్తర్ సాహిత్యం సమకూర్చారు.

నాకిప్పుడు 40 ఏళ్ళు. ఈ మధ్యకాలంలో నాకు తెలిసి ఎక్కువ సార్లు పాడుకున్న పాట ఇదే... ఈ పాటని వందలు కాదు వేలసార్లు. ఇంటిబయటా, భోంచేస్తూ, నిద్రపోతూ, నడుస్తూ, స్నానం చేస్తూ పాడుకున్నాను.

ఇక నా విషయానికొస్తే నా పాటలేమీ నేనెక్కువ పాడుకోను. అది కూడా ఒకటి, రెండు సార్లు మాత్రమే. నా పాట నేనే పాడుకుంటే ఏం బాగుంటుంది చెప్పండి!?.

అలనాటి ఆణిముత్యాల గురించి నేటి తరానికి అనువైన శైలిలో తెలిపే

క్లాసిక్స్ రీటోల్డ్

# కంఠాభరణం

- పానుగంటి

**జరిగిన కథ**

**పరమఛాందసుడైన సోమావధానులనే అతను భార్య, మరదలను వెంట బెట్టుకుని పట్నం వస్తాడు. ఆడవాళ్ళిద్దరూ రాత్రిపూట సర్కసుకి వెళతామంటే ఒప్పుకోడు. అతడు నిద్రపోయాక అక్కాచెల్లెలూ బయటకు జారుకుంటారు.**

అలా సర్కసుకి బయలుదేరిన బంగారమ్మ, సుబ్బలక్ష్మి మధ్యలో దారి తప్పుతారు. వాళ్లు అట్లా తిరుగుతూ వుండగా 'రామశాస్త్రులు' అనే పిచ్చి వాడొకడు వాళ్లకి ఎదురౌతాడు.

"కొంచెం సర్కసుడేరాకి దారి చెప్పుబాబూ!" అని అడుగుతుంది బంగారమ్మ.

"దారా?! దారుల్లోకెల్లా జమీందారీ, చెంబుల్లో జారీ, క్షేత్రాల్లో పూరీ - భక్ష్యాల్లో బూరీ" అంటూ అక్కా చెల్లెళ్ల మధ్యకి వచ్చి "ఐరోపాకీ ఆసియాకీ మధ్య ఢాంఢాం" అంటాడు పిచ్చివాడు.

'అమ్మో! పిచ్చాడు' అని భయపడుతూ బంగారమ్మ, సుబ్బలక్ష్మీ యిద్దరూ చెరో పక్కా పారిపోయి విడిపోతారు.

కాస్సేపటకి ఎర్రయ్య అనే బండివాడి మాటల్ని బట్టి అతనికి సుబ్బలక్ష్మి జాడ తెలుసునని నమ్మి, బంగారమ్మ అతని బండెక్కి వెళ్లిపోతుంది.

అలాగే సుబ్బలక్ష్మి మళ్లీ పిచ్చిరామశాస్త్రులు ఎదురైతే శాలువా కప్పుకుని తప్పించుకుని పారిపోతుంది.

ఇదిలా వుండగా, 'సుబ్బిశెట్టి' అనే వ్యాపారి తన షష్టి పూర్తి ఉత్సవాలకి 'సుందరి' అనే వేశ్యని పిలిపించుకుంటాడు. ఆమె, తన ప్రియుడు, కృష్ణారావుతో అక్కడికి వెళ్తూ రామశాస్త్రులకి ఎదురు పడుతుంది. సుందరీ కృష్ణారావులు మాట్టాడుకుంటూంటే రామశాస్త్రులు కల్పించు కుంటాడు.

రామ : బలే అందమైన దాన్ని పట్టావే -
గారెల్లాంటి కళ్ళు, బణారసు
కాజాల్లాంటి పెదవులు,
చక్కిలాలలాంటి చెవులు, పాలముంజ లాంటి గడ్డం, అప్పడం లాంటి మొహం, వడియంలాంటి ముక్కు....

కృష్ణా : నీవు కవివా?

రామ : సరిగ్గా కనుక్కున్నావు. నాంచారమ్మగారి తిరుమణికీ, నన్నా సాహెబు గడ్డానికీ సంధి చేసింది మేమే! కవులూరి వారి కవిత్వం, మా కవిత్వం ఒక లాంటివే! వారికి యతిలేదు. మాకు మతిలేదు - వారికి ప్రాసలేదు, మాకు ధ్యాసలేదు - వారికి గణం లేదు, మాకు గుణం లేదు - వారికి అర్థం లేదు, మాకూ అర్థం (డబ్బు) లేదు. ఓ పావలావుంటే యిప్పిస్తావా? గంజాయికి డబ్బుల్లేవు.

కృష్ణా : సరే, ఏదైనా ఓ పాట పాడు, యిస్తా
(రామశాస్త్రి ఓ పిచ్చి పాట పాడతాడు)

కృష్ణా : (సుందరితో) చూశావా! పైకి పచ్చి శృంగారం, లోపల వేదాంతం, జాతీయ సమస్యలూ, మతమూ కలిసి వున్నాయ్ యితని పాటల్లో (ఇది బహుశా ఆనాటి ఒక తరహా కవుల మీద విసురేమో - వ్యాసకర్త).

(కృష్ణారావు రామశాస్త్రికి పావలా యిస్తాడు. అతను వెళ్ళి పోతాడు)

కృష్ణా: (సుందరితో) ఇతనికి కొంచెం పిచ్చిలా వుంది. మళ్లీ మధ్య మధ్యలో తెలివిగానే మాట్లాడతాడు.

సుంద: ఇతనికి పిచ్చేం కాదు. కొంచెం మద పిచ్చి. ఆడగాలి తగిల్తే యిట్టే



ఎగిరిపోతుంది.

కృష్ణా: ఆడవాళ్ల చెయ్యి తగిల్తే పిచ్చి ఎగిరి పోతుందా? మరి నీ చెయ్యి తగిలేకొద్దీ నా పిచ్చి పెరిగిపోతోందేం?

సుంద: నీ పిచ్చా! అది నీ పెళ్ళాం చెప్పు దెబ్బల్తోగాని వదలదు. అయినా నేనేదో నిన్ను వల్లో వేసుకున్నానని నాకెందుకీ అప్రదిష్ఠ! హాయిగా నువ్వు.....

కృష్ణా : చూశావా, నా మంచి కోరి నువ్వు ఎలా మాట్లాడుతున్నావో? అలాంటిదాన్ని నిన్ను వదలడం కృతఘ్నుత కాదూ?!

సుంద : పాపం, నాకన్నా ముందు వుంచుకున్న సానుల్నందర్నీ కృతజ్ఞత వుండే వదిలేశావు కాబోలు!

కృష్ణా : వాళ్లకీ నీకూ సాటా?
"వెంపటి కంపలో పెంపేదిన మదేభ
మంభోజ సరసిలో ఆడదగదె...?
(మందారమకరంద.... పద్యాన్ని 'పారడీ' చేసి హాస్య సృష్టి చేశారు పానుగంటి వారు - వ్యాసకర్త)

సుంద : (నిట్టూర్చి) ఎంత అందం వుంటే ఏం లాభం? ఆ పిల్లికళ్ల చకోరాక్షి రోళ్ల వర్తకుణ్ణి పట్టింది. హాయిగా భోగభాగ్యాలతో తులతూగు తోంది. నేను నిన్ను నమ్ముకున్నాను - ఇదిగో - వీధి గుమ్మంలోంచి పంతులూ, పక్క గుమ్మంలోంచి పందులూ - ఇదీ నా బతుకు. సరే, సభ మొదలైనట్లుంది. నే వెళ్తున్నా. నువ్వు నా వెంట రాకు (వెళ్లిపోతుంది).

కృష్ణా : (తనలో) ఎంతమాటన్నది? నాకూ పందికీ సాపత్యమా? ఆ! ఫరవాలేదులే! అలనాడు కృష్ణ పరమాత్మకే తప్పలేదు. అయినా నోరు మూసుకోక చేసేది మాత్రం ఏం వుంది? వున్న డబ్బంతా దీని మొహానే పోశాను గదా! పోనీ, మా ఆవిడ దగ్గరి కెళ్లిపోనా? ఏ మొహం పెట్టుకుని? అయినా, అమ్మో! సుందరిని వదిలి వుండ గలనా? కానీ, అన్నిటికి ఆ ఆంజనేయ స్వామి వున్నాడు.

(అలా అనుకుంటూ కృష్ణారావు గూడా సుబ్బిశెట్టి యింటికి చేరుకుంటాడు. అతను వెళ్లేటప్పటికీ సభ మొదలవుతూ వుంటుంది).

సభికులు : శ్రీ కన్యకాపరమేశ్వరికీ జై! సుబ్బిశెట్టికీ జై!

కృష్ణా : పిచ్చికుంచానికీ జై! తప్పుడు త్రాసుకీ జై!

సుబ్బి : అబ్బో! వేపారి పంతులు గారా! యాలకోలాలకేంగాని మాకియ్యాల్సిన చిల్లర మాటే మర్చి పోయారే!

కృష్ణా : అబ్బ! రేపు మా నౌకరుతో పంపిస్తాలేవయ్యా! హాయిగా పండగ చేసుకుంటూ గూడా అదే యావా? ఏమిటి, అలా మొండిగోడ మీద కొండముచ్చులా కుర్చీలో గొంతుక్కూచున్నావ్?

సుబ్బి : అదా!? మా గుమాస్తా వెంకటప్పయ్య నన్నిందులో యిరికించాడు. అయినా గల్లా పెట్టె కాడ కూకునే వాళ్లం మాకు కుర్చీల్లో కూసోడం ఏం తెలుసుద్దీ? కాళ్లు కింద పెట్టి కూచోవాలా? (అని, అతికష్టం మీద కాళ్లు కింద పెడతాడు. పంతులూ, ఇప్పుడు ఠీవిగా, డౌలుగా వున్నానా?

కృష్ణా : ఏమో! ఆ ఠీవులు మాకేం తెలుస్తాయ్? పక్కన సుందరి వుందిగా, అడుగు!

సుబ్బి : సుందరా?! ఆహా! యాపారవంటే వాళ్లదేనయ్యా! కాణీ పెట్టుబడి లేదుగదా! అరువు బేరం లేదు. ఆదాయప్పన్ను లేదు. కరువు లొచ్చినా, యుద్దాలొచ్చినా వాళ్ల ఆదాయానికి ఢోకా లేదు గదా! రవ్వారట్టు లేని యాపారం అనుకో!.... వెంకటప్పయ్యా! కొంచెం సుందర్ని యిలా పిలువ్?
(సుందరి కాస్త బతిమాలించుకుని వస్తుంది).

సుబ్బి : అబ్బో! ఏం చీరా, ఏం నగలు, ఏం గమగమలు?! అచ్చం అత్తరు సాయిబులా వున్నావే! పంతులూ, సాయిబంటే గుర్తొచ్చింది. నీ నాటకాల కోసం తెప్పించిన విగ్గులూ అవీ అమ్ముడు పోవడం లేదయ్యా! రూపాయికి అర్ధరూపాయి లాభం వేసుకుని నువ్వే తీసేసుకో! నాకు వడ్డీగూడా గిట్టుబాటు కావడంలే!

వెంక : అయ్యా, ఇహ కార్యక్రమం ప్రారంభిద్దామా!

సుబ్బి : అట్టాగే! వెంకటప్పయ్యోవ్! ఇన్ని దీపాలు పెట్టించావేంటి? తీసెయ్! తీసెయ్! సుందరి మొహం మీద బాగా ఎల్తురు పడేలా ఒక పెద్ద దీపం మాత్రం వుంచు.

వెంక : అలాగే! కార్యక్రమంలో ముందుగా దైవప్రార్థన.

సుబ్బి : ఓర్నాయినో! మళ్లీ బియ్యం పోసి, డబ్బులెట్టాలా?

వెంక : అక్కర్లేదు. కాని అందరూ లేచి నిలబడాలి.

సుబ్బి : ఈ కుర్చీలో నన్నిరికించి నిలబడు నిలబడు. అంటే ఎట్టా నిలబడేదీ అంట!

(అందరూ కలిసి అవస్థపడి సుబ్బిశెట్టిని కుర్చీలోంచి లాగుతారు. తరవాత ప్రార్థన చేస్తారు.

వెంక : ఇప్పుడు సెట్టిగారి గుణగుణాలను గురించి కృష్ణారావు గారి ప్రసంగం.

కృష్ణా : నేను మంచి వక్తను కాను. అందుకని ఉపన్యాసం అచ్చే యించాను.

సుబ్బి : (వెంకటప్పయ్యతో) అచ్చు కర్చు ఆయనదే గదా?

వెంక : ఆయనదే! ఆయనదే!

సుబ్బి : అయితే యింకా వంద కాయితాలేయించుకోని! మందేం బోయింది?!

కృష్ణా : (అందరికీ ఆ కాగితాలు పంచి, తనూ ఒకటి తీసుకుని చదువుతూ) సెట్టిగారు ముప్పై ఏళ్ల క్రితం యీ వూరు పై మీది బట్టతో వచ్చారు. ఇప్పుడు లక్షాధికారి.

సుబ్బి : పంతులూ! కొంప ముంచబాక! ఆదాయప్పన్ను వాళ్లు వింటారు.

కృష్ణా : ఈ వూళ్లో మహాసభలు జరిగిన నాలుగు రోజులూ, సెట్టిగారు అక్కడే భోంచేసి తమ దేశాభిమానం వెల్లడించుకున్నారు. వీరికి షష్ఠి పూర్తి చెయ్యడానికి ఎవరూ ముందుకురాకపోతే, స్వయం కృషితో వారే ఏర్పాటు చేసుకున్నారు. సమయాభావం వల్ల నా ఉపన్యాసం ముగిస్తూ, సెట్టిగారికి ఆయురారోగ్యాలు యిమ్మని భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను.

సుబ్బి : (వెంకటప్పయ్యతో) అందరి చేతుల్లో వున్న కాయితాలూ తీసుకుని జాగర్త చెయ్యి - ధనియాలనీ, ఇంగువనీ - పొట్లాలు కట్టడానికి పనికొస్తాయి.

వెంక : తరువాతి అంశం. రామలక్ష్మణ భట్టు కవుల ఆశుకవిత్వం.

సుబ్బి : ముందర సుందరి మేజువాణీ కానీ! ఆనక అవన్నీ!

సుంద : (ముందుకొచ్చి) సెట్టిగారికి నమస్కారం.

సుబ్బి : నూరేళ్లు వర్ధిల్లు! పది సంసారుల కొంపలు లాగి నీ కొంప మీద పడేసుకో! చిల్లర శ్రీ మహాలక్ష్మి! పెద్దపెద్ద బేరాలే కావాలని బీష్మించుక్కూచోమాక!

(సుందరి సభకి నమస్కరించి నృత్యం ప్రారంభిస్తుంది).

సుబ్బి : అబ్బో! అయ్యల్లో! ఎంత బాగా చేస్తుండావో! నిన్న మొన్నటి దాకా మా దుకాణం కాడి కొచ్చి 'బావా ఒక్క పుణుకుంటే పెట్టవూ!?' అని అడిగిందానివి కాదూ! నులక మంచం కోడంత వుండే దానివి యిప్పుడు నూకాలమ్మంత అయినావు. (తనలో) ఇదంటే నాకు మోజు పెరిగిపోతా వుంది (వెంకటప్పయ్యతో) పిల్ల బలే రంజుగా వుంది గదయ్యా!

వెంక : వుండదు మరీ, భరత నాట్యం నేర్చిన వేశ్య!

సుంద : (అభినయిస్తూ)
"కొట్టు తాళము తీయుదునా
పెట్టె తీసుకుని పోవుదునా".

సుబ్బి : అబ్బో! ఏవుండయ్యని ఆ పెట్టెలో! కవిలె కట్టలూ, ఎలిక పెంటలూ తప్ప!

సుంద : "చేయి పట్టుకుని లాగుదునా
చెచ్చెర గదిలో కీడ్చెదనా"
(అంటూ సుబ్బిశెట్టి మీదికి ఒంగుతుంది.)

(-ఇంకా వుంది)

-నిశాపతి

ఏప్రిల్ 23 ఎస్.జానకి జన్మదిన సందర్భంగా...



# నిరంతర సుమధుర గానవాహిని సంగీత జానకి



'నేనే ఒక వేణువు, నా పాటకు పరవశించి, ఆడును ప్రతి రేణువు" అని సాయించిన ప్రఖ్యాత కవి కౌస్తుభులు భాగ్యనగర వాసిగా, వాసికెక్కిన "ఆచార్య తిరుమల" అనుకోకుండానే, ఒక నిరుపమాన గాన సామ్రాజ్ఞి అనదగిన గాయికానాయిక గళ స్వరూపాన్ని అభివర్ణించారు. ఆమె మన ఆంధ్ర సీమనే కాక, ప్రపంచంలోని అఖిల కళారాధలోకాన్నీ తన అపరిమిత సంగీత మాధుర్యంతో ఉర్రూతలాగిస్తున్న గంధర్వ గాయని ఎస్.జానకి అన్న నిజం నిర్వివాదాంశం. నిజానికి జానకి గళమెత్తి పాడితే ప్రతి రేణువు ఆడడంతోనే ఆగిపోక, పాట కూడా పాడగలుగుతుందంటాను. నేను ఆమె అభిమానులలో ప్రప్రథముడినిగా, అట్టిమేటి గాయనీమణి గళ శృతితో గళము కలిపి, ఆమె పాడిన మొదటి తమిళ యుగళగీతమైన "కణ్ణక్కు నేరే, మిన్నిడుంతారై" అని ఆలపించే అపూర్వ సుయోగం నాకబ్బడం, నా పూర్వజన్మ పుణ్యఫలం అనే నాగట్టి నమ్మకం. అంతకు ముందామె "విదియిన్ విళైయాట్టు" అనే తమిళ చిత్రానికై పాడినా, అది రిలీజుకాక పోవడం వలన "కణ్ణుక్కునీరే" అనే పాటే, మొదటి యుగళగీతం తమిళంలో. "తెలుగు"లో మొదటి యుగళ గీతం యుగ మహాగాయకులైన శ్రీ ఘంటసాలతో పాడారు జానకిగారు. అది ఆమెకి సుయోగం. "నీ ఆస అడియాస" అనే శోక గీతంతో ప్రారంభమైనా జానకి అద్భుత సంగీత ప్రయాణం, జగదానందకారకం. ఎన్నో వేల గీతాలు ఎన్నెన్నో భాషా చిత్రాలలో పాడి, నేడు కీర్తి హిమనగ శృంగంపై వెలుగొందుతూ వెలుగులీనుతున్న జానకి, ఉత్తమ గాయకియే కాక, బహుసుగుణ మణిగణాలంకృత విశిష్ట వ్యక్తి. శిష్ట్లా జానకి ప్రత్యేక అమోఘశక్తి.

జానకికి చిన్నప్పట్నించీ లతా ఆశాల పాటలపై పరమాసక్తి. వినివినీ, మననం చేసుకుంటూ తనగాన విధానాన్ని నిజమార్గంలో మలచుకుని, ఆకర్షణీయమైన బాణీని రూపొందించుకున్న వైనం అందరికీ అనుకరణీయం. అనుసరణీయం - బాల్యం లోనే ప్రావీణ్యం సంపాదించి, శ్రోతల్ని ముగ్ధుల్ని కావించడం ఆమెకు వెన్నతో పెట్టిన విద్య. ఎంతటి క్లిష్టమైన సంగతులనైనా, ఇసుమంతైన్నా కష్టపడక, అవలీలగా పాడెయ్యగలగడం, అప్పట్లోనే , పువ్వుపుట్టగానే పరిమళిస్తుంది' అనే సామెతకి ఉదాహరణ.

చిన్నప్పట్నుంచీ నేను కూడా లత, మహమ్మద్ రఫీ, తలత్ మెహమూద్, మన్నాడే, ముకేశ్ మున్నగు 'హేమాహేమీల పాటల్ని నెమరు వేసుకుంటూ వింత వింత మెలకువలని అల వరచుకుని వుండడం వలన, మొదటిసారిగా



పి.సుశీలతో...

జానకి పాడగా విని, ఆశ్చర్యపడక పోయినా, ఆనంద పడిపోయాను ఎంతగానో.

జానకీ, నేను పాడిన సోలోలూ, డ్యూయెట్లూ కూడా వందలాది సంఖ్యలో హిట్లయ్యాయి. విభిన్న భాషా చిత్రాలలో.

మొదల్లో సుశీల గారూ, లీలగారూ, పిదప అధికంగా జానకి గారు నాచేత రాయించి ట్యూన్లు కట్టి, కట్టించీ కూడా కేసెట్లకీ, సంగీత కార్యక్రమాలకీ, కొన్ని సినిమాలకీ కూడా ఉపయోగించే వారు. మొత్తానికి నేను రాసిన వివిధ భాషా రచనలూ, సంగీత రచనలూ, శ్రోతృ గణాలకి ఎక్కువగా అందించిన ఘనత జానకి గారికే దక్కింది. అందుకు, నేనామెకి చిరఋణగ్రస్తుణ్ణి. ఆమె ముందుగా వరసలు ఇచ్చి నాచే రాయించిన పాటలు వివిధ భాషలలో అనేకాలు. అయితే ఆమె చాలా గొప్ప పెర్ఫెక్షనిస్టు. ట్యూనుకి తగిన పదాలు భావాలూ కుదిరేదాకా వదలరు. అది నాకొక పెద్ద పరీక్షగా పరిణమించేది. అయినా, నాది అలాంటి స్వభావమే అవడం వల్ల శాయశక్తులా ప్రయత్నించి, కృతకృత్యుడిని కాగలిగే వాడిని. ట్యూనుకి పక్కాగా సరిపోయే పదాలు, భావాలూ, కుదిరినప్పుడు, ఆమె వదనంలో మెఱిసే సంతోషమూ, సంతృప్తి వర్ణనాతీతాలు. బాహాటంగా ప్రశంసలందిస్తారు. బాగులేకపోతే నిర్మొగమాటంగా, విమర్శించేస్తారు. చాలాసార్లు వేడివేడి వాద ప్రతివాదాలలో కూడా దిగి పోట్లాడుకునే వాళ్లం కూడా. ఆ విధంగా, ఆవిడ రిలీజు చేసిన ఎన్నో కేసట్లకి, మంచి మంచి సాహిత్యం నాచే రాయించుకోగల నైపుణ్యం అనన్య సామాన్యం. ఒక భక్తిగీతాలకేసెట్లో, తన పాడకుండా ప్రముఖ గాయనీ గాయకులెందరి



ఎస్.పి.బాలు, జి.కె.వెంకటేష్ ఆర్కెస్ట్రా బృందంతో...

చేతనో పాడించారు. అది ఆమె నిస్వార్థ భావానికి ముఖ్యనిదర్శనం.

ఒకసారి నేను ఒక చిన్నకూడికా, గుణింతం చెప్పమన్నప్పుడు, నాకివన్నీ బొత్తిగా తెలియవు అని ఆమె అమాయకంగా అన్నప్పుడు, నాకు కలిగిన ఆశ్చర్యం ఇంతా అంతా కాదు. బడికెళ్లకుండానే, ప్రపంచ విశ్వవిద్యాలయంలో అగణిత విచిత్రానుభవ పాఠాలు చదివి, తన బహుముఖ ప్రజ్ఞనీ, కీర్తిని, పలుకుబడినీ, అపరిమితంగా పెంపొందిచుకోగలిగిన మేధాశక్తి గల ఈ నారీశిరోమణి నిజంగా ఎంతైనా అభినందనీయురాలు. ప్రశంసనీయురాలు. రాలు కరిగే విధాన పాడే ఈ మహాగాయకి ఎట్టి బిరుదులకైనా, సన్మానాలకైనా అర్హురాలైన కళాకారిణి. సదా 'హితభాషిణి'. ఆమె నవ్వే నవ్వుల్లో నిష్కాపట్యం తొణికసలాడుతూ వుంటుంది. జానకి మామగారు మహావేధావులు. ఆమె భర్త శ్రీ రాంప్రసాదు నిష్కర్షగా మాట్లాడే సరళ స్వభావులు. సంగీత నద్విమర్శకులును. ఆమె మరిదిగారు వి.నాగరాజరావు మంచి నటులు. నేను రాసిన "మద్రాస్ ఐ" అనే టి.వీ. నాటకంలో నారదుడుగా చక్కగా అభినయించిన సమర్థులు. ఆయనకి "రంగుల రాట్నం"లో నేను ప్లేబాక్ పాడాను. చాలా మంచి పాట. జానకిగారి చిరంజీవి ఏకైక పుత్రుడు మురళీకృష్ణ మంచి గిటారిస్టు, గాయకుడు, మ్యూజిక్ కంపోజరు. తన ఊహాలోకంలో విహరిస్తూ పాశ్చాత్య సంగీతం కూడా అభ్యసిస్తూ వెస్టర్న్ ట్యూన్లు బాగా కంపోజ్ చేయగల దిట్ట. అతని భార్య (జానకి కోడలు) ఉమా మురళీకృష్ణ ప్రఖ్యాత కూచిపూడి భరతనాట్య నర్తకి. మనమరాళ్లు కూడా సంగీత ప్రియులు. నాట్యప్రియులు. అమృత వర్షిణి, అప్సర, అని అకారాద్యక్షర నామధేయాలు గల ప్రతిభావంతులైన చిన్నారులు. ఈ విధంగా జానకి గారిది బహువిధ కళాపరివారం-



పి.బి.శ్రీనివాస్, పి.సుశీలతో ...

జానకి ఒక ప్రత్యేకాదర్శ గాయనీ మణి. బహుకళాకుశల కళాకారిణి. వినయ మణిభూషణి. విజయ పరంపరలు సాధించినా, వినయాన్ని ఎన్నడూ విడనాడని నిగర్వ చూడామణి. సంభాషణల సందర్భాన ఆవిడ వేసే సునిశిత ప్రశ్నలకి సమాధానాలు చెప్పడం కఠిన సాధ్యం.

ఒకసారి, ముకేశ్ పాడిన ఒక పాట టేప్ రికార్డర్‌లో పెట్టుకొని విని, మాటలు కొన్ని స్పష్టంగా తెలియని సందర్భాన, నాకు ఫోను చేసి రమ్మని చెప్పారు. నేను చాలా గొప్పగా ఫీలై పోయి దర్జాగా వెళ్లి, మళ్లీ ఆ పాట విని, నాకు తెలిసిన వరకు కొన్ని పదాలు విశదీకరించాను. కాని విచిత్రమేమంటే నా ప్రమేయం లేకుండా, ఆమె కామెగా గుర్తు కట్టగలిగిన పదాలే యెక్కువ. నాకెంతైనా సిగ్గేసింది. చాలా పదునుగల మెదడామెది.

ఆరంభంలో ఇద్దరం, దేశాద్యంతం అనేక సంగీత కార్యక్రమాలిచ్చే వాళ్లం. డేట్లు కూడా మార్చేసే వాళ్లం. కాని ఆడియెన్సు ఏ మాత్రం విసుగు చెందేవారు కారు. ఇంకా ఇంకా పాడమనే వారు. అలా కలకత్తాలోనూ, బొంబేలోనూ, విశాఖపట్నంలోను ఆరేసి గంటల పర్యంతం పాడే వాళ్లం. పలు భాషల్లో - ఆనందాశ్చర్యాలతో వినే వారు జనం.

ఆవిడలో వున్న మరో ప్రత్యేకత పాడిన సంగతినిగాని, పాటని గాని, ఏ మాత్రం మార్చకుండా, అచ్చుగుద్దినట్లుగా అదేలాగ పాడగలగడం. నేనప్పుడప్పుడు కాంప్రొమైజ్ అయ్యేవాడిని గాని, ఆమె మాత్రం యథాతథంగా పాడే వారు. పాటని మరీ మరీ విని క్షుణ్ణంగా అభ్యసించి పాడడం. ఆమెకి అబ్బిన గొప్ప ప్రతిభ. ఇదంత సులువైన విద్య కాదు. పట్టుదల, ఏకాగ్రతా, నిరంతర కృషి, అనివార్యాలు. నా కో-సింగర్లలో ఆమెది ప్రత్యేకమైన మహోన్నత స్థానం. ఇలా ఆమెని పొగుడుతూ నేను రాసేస్తూ పోతే చాలా గ్రంథాలౌతాయి. అందరూ ఇది "పరోక్ష ముఖస్తుతి" అనుకోవచ్చు. కాని, కాదు.

ఇప్పటికే, అనేక సన్మాన సన్మానేతర సభలల్లోని శుభ కార్యా సందర్భాలలోనూ, జానకి గారికి నేనిచ్చిన సన్మాన పత్రాలూ, ప్రశంసా పద్యాలూ, జ్ఞాపికలూ, కోకొల్లలు. అలా, నేను ఎంతో మంది కళాకారులకీ తదితరులకీ వందలకొలదీ వేలకొలదీ సమర్పించినా, ఆమెకి నేను అందించిన ప్రశంసలు కూడా ఆమె ప్రతిభా సాధనల లాగే ప్రత్యేక ప్రాముఖ్యం కలిగినవి.

ఆవిడ సాధనలు ఇన్నీ అన్నీ కావు. సెంట్రల్ అండ్ స్టేట్ ప్రభుత్వాల ద్వారా ఆమెకి లభించిన గౌరవాలు కూడా అసదృశాలు. వరసగా నేషనల్ అవార్డు సంపాదించిన అత్యల్ప సంఖ్యాకులైన కళాభిజ్ఞులలో జానకిది, నిస్సందేహంగా, ప్రముఖ స్థానం. ఆంధ్రా, తమిళ, కర్ణాటక, కేరళ భాషా రాష్ట్రాలన్నిటి లోనూ ఆమె ప్రతిభకి జోహారులర్పించబడ్డాయి.

గంటల తరబడి, స్టేజి మీదనే, నిలుచునే, కూర్చోకుండా కదలకుండా మనసుల్ని కదిలించి కరిగించేలా పాడగల సామర్ధ్యం ఆమెది. ఏ వయస్సు పాత్రకైనా తగిన విధాన, తానుగానే గొంతుమార్చి పాడడం ఆమెకు ఎడమచేతి ఆట. అనగా బాయేహాథ్ కా ఖేల్ - మాతృభాషలోనూ, ఇతర భాషల్లోనూ, ఆమె ఉచ్చారణ నిర్దుష్టం. జాతీయత శ్లాఘనీయం. ఒకసారి కె.బాలచందర్ - దిగ్రేట్ - ఫిలింఫేర్ అవార్డుల ఉత్సవంలో, జానకి పాడిన భజన్‌లో పైపంచమంలో దమ్మున్నంత సేపు ఒకే గుక్కులో ఆమె కంఠస్వరాన్ని నిలిపి, సాగించిన వైనం పరికించి విస్తుపోయారు. అదేసభలో "ఫిలిం ఫేర్ జిందాబాద్" అని ఏక సంఖ్యాక్షరాలలో వచ్చేలాగ, నేను రచించిన ఉర్దూ ఘజల్ ఆయన్ని ఆకర్షించగా, స్టేజిమీద సైడు వింగులో నిలుచున్న నన్ను పదే పదే మూడుసార్లు అభినందించిన సన్నివేశం ఈ నాటికీ ఏ నాటికీ నాకు ఆనంద కారణం. వారం రోజులు తిరిగే లోపుగానే కబురు పంపి, తన తమిళ చిత్రంలోను (వఱుమైయిన్ నిఱంసివప్పు), తెలుగులో 'ఆకలి రాజ్యం'లోను ఒక స్టేజి సాంగుకి, నాచేత హిందీ పాట రాయించి, జానకి చేత పాడించారు. "తూ హీ రాజా మై హూ రానీ" అనే ఆ గీతానికి ఎం.ఎస్.విశ్వనాథం భలే మెలోడియస్, ట్యూను కట్టారు. అలాగే 'ఇళయరాజా' 'నందు' అనే "తమిళ చిత్రం"లో నాచేత జానకి పాడే "కైసే కహూఁ" అనే యుగళ గీతం హిందీలో, తన ట్యూన్సుకి రాయించారు. జానకి పాడిన పాట విని, అభినందించి బప్పీలహరీ తమ సంగీతంలో అనేక చిత్రాలలో హిందీ పాటలు ఆమెని బొంబాయికి పిలిపించి మరీ పాడించారు. జానకి, లక్ష్మీకాంత్ ప్యారేలాల్ మొదలైన ఇతర సంగీత దర్శకుల పాటలు కూడా హిందీలో చాలా పాడి, అక్కడి వాళ్ల ప్రశంసలని చూరగొన్నారు. అలాటి వెన్నో సంఘటనలు, ఏసు, బాలూ, ఇద్దరూ జంటగా ఒక వేదికపై ప్రత్యేకంగా జరిపిన ఘనమైన మ్యూజిక్ కాన్సర్ట్‌లో జానకి కూడా పాలుగొని, మధ్యలో నేనూ హిందీలో రచించిన "సబ్‌కుఛ్‌మైనే పాయాలేకిన్" అనే భజన ఘజల్ (విశ్వరంజని అని నేను నామకరణం చేసిన "విటపి" రాగచ్ఛాయలలో) అనితర సాధ్యంగా పాడి, ప్రేక్షకశ్రోతల్ని పారవశ్యసాగరాన ముంచితేలించారు. అదినేనెన్నడూ జన్మజన్మలకీ మఱువలేని ఆత్మానుభూతి. ఏం కంఠం! ఎంతటి రేంజ్!! అన్ బిలీవబుల్.

ఇటీవల "ఉషె" అనే టి.వీ. కన్నడ ఛానల్‌లో "అమరమధుర" అనబడే పాత పాటల ప్రత్యేక కార్యక్రమంలో ప్రతిరోజూ జానకి నేను పాడిన సోలోలూ, డ్యూయెట్లు అవీ రెగ్యులర్‌గా వింటూ, పాటలలోని ప్రతీ ప్రత్యేకాంశాన్ని అధ్యయనం చేస్తూ, ఆ పాటలలోని వైశిష్ట్యాన్ని నా యుగళ గీతాలకి, జానకి అందించే అధిక తమ మాధుర్యాన్ని, సూక్ష్మవివరాలనీ అభినందిస్తూ ఆనందిస్తూ వీలైనప్పుడల్లా ఫోనులో నా కృతజ్ఞతలని నివేదించుకుంటూ వుంటాను. ఆమె గొప్పగొప్ప గాయనీగాయకులెందరితోనో అత్యద్భుతమైన యుగళ గీతాలు, త్రిగళ గీతాలు పాడారు. మేమిద్దరమూ పాడిన యుగళ గీతాలలో తమదైన ప్రత్యేకత, స్పష్టంగా స్ఫురిస్తుందని మా



బాలు దంపతులతో జానకి దంపతులు



భర్త రాంప్రసాద్‌తో....

యిద్దరి అగణితాభిమానులు మెచ్చుకుంటూ, అనుదినం అభినందిస్తూ వుంటారు. దానికి కారణం మా యిద్దరి భావనా పాఠశాలలో (School of Thought) గల సామరస్యం (Report) స్వారస్యం (Taste), మాధుర్యం (Melody), భావాధిక్యం (Expression) లతో బాటు కామన్ వేవ్‌లెంగ్త్, ప్రతీ పాటలోనూ వేయాలని అనుకొన్న సంగతుల్ని, ఒకరికన్నా ఒకరు ముందుగా ఆరోగ్యకరమైన పోటీలో పాల్గొని, డ్యూయెట్స్‌కి కొత్త అందాలని సంతరించి యిచ్చిన విధానాలని అభిమానులు ఆనందాతిరేకంతో అభినందించేటప్పుడు వాళ్లు ఎంత బాగా స్టడీ చేశారో తెలుసుకుని, "చేసిన కృషి" వమ్ము కాకుండా విజయవంతమైనందుకు అమిత సంతృప్తి కలుగుతూ వుంటుంది. మనసులో ప్రోత్సాహోత్సాజ్యోతి నిరంతరం వెలుగుతూ వుంటుంది. ఇదంతా దైవనిర్ణీతం అనిపిస్తూ వుంటుంది।

ఒకే మాటలో "జానకి ప్రత్యేక వ్యక్తిత్వం గల ప్రతిభా సంస్థ" ఇటీవల ఒక ఆలయ సంస్థకై, తక్కువ వాద్యాలతో, మాధవపెద్ది సురేశ్ స్వరపరచిన "గాయత్రీ సహస్రనామస్తోత్రం" రికార్డు చేయించి, అపూర్వ రాగాలలో అవలీలగా ఆలపించిన సన్నివేశాన్ని నేను ప్రత్యక్షంగా వరికించినప్పుడు శతశత పరిపూర్ణతని సాధించేందుకుగానూ, నిర్దుష్టంగా రూపొందించేందుకుగాను, ఆమె వహించిన ఓర్పూ, దీక్షా, ఏకాగ్రతా చూసి, నేను పొందిన అనుభూతి అనుభవైక వేద్యం! చిన్న పెద్దతెరలకై సురేశ్ స్వర రచనలను పాడిన సందర్భాన ఆమెకు రెండు ప్రత్యేకమైన అవార్డులు (నంది) కూడా లభించాయి.

''అటావల'' నేను సంగీత దర్శకత్వం నిర్వహించిన "మహా సాధ్వి" అనే కన్నడ చిత్రానికి, ఆమె నా స్వరరచనలు నాలపించిన వైనం అనదృశ్యం. సంగతులు (flourishes) వేయడంలో ఆమెకి సాటి ఆమెయే. అప్రయత్నంగా సునాయాసంగా ఎంతటి లైట్నింగ్ స్పీడ్ బిరకావేసినా ప్రతీ స్వరమూ స్పష్టంగా వినబడే రీతిగా, బ్లఫింగ్ ఏ మాత్రం చెయ్యకుండా సంగతులు నిజశైలిలో పాడి ఆశ్చర్య చకితుల్ని చేసి, ఆడియన్సుని మెస్మరైజ్ చేయగల వండర్‌ఫుల్ మెజీషియన్ ఈ యునీక్ (Unique) మ్యూజీషియన్. నేటి తమిళనాడు ముఖ్యమంత్రియై పరిపాలిస్తున్న నాటి మేటి చిత్రనాయకి ''జయలలిత''కై జానకి పాడిన 'మావనమగళు' చిత్రంలోని కన్నడం పాట "ఆవుదు ఆవుదు ఆవుదు" విన్నప్పుడు, శ్రీకృష్ణుని మోహన వేణురవమే మృదువుగా, మధురాతి మధురంగా, రవళిస్తూ వుందనే భావం ఎవరికైనా కలుగుతుంది. అలాటి గీతాలు, జీవన సంగీతయాత్రలో ఆమె దిగ్విజయాలకి సువర్ణ సోపానాలు. ''హేమావతి'' అనే చిత్రంలో ఎల్.వైద్యనాధన్ స్వరపరచిన ఒక శాస్త్రీయ సంగీత బద్ధ సంగీతం, లైనులైనుకీ రాగం మారే తీరులో, ఆభోగీ, తోడి బాపతు, బిరకాలూ, స్వరాలూ, సుధలొలికించే విధాన జానకి

వంశీరవమే నీ గళ స్వరం
వసంత శోభా నిలయం హృదయం!!
నిరవద్య స్వరదాయకీ!
నిరుపమ గాయకి! జానకీ!!

***

నీ ప్రతి గీతం, మాధుర్యమయం!
నీ ప్రతికావ్యం ఔదార్య మయం!!
. నీజీవనం కళాసేవకంకితం!
స్నేహ సువర్ణ సుగుణాలంకృతం!!

***

గంధర్వాంగన ! భువికి వచ్చితివి!
గాన మణినిధులవెన్నో తెచ్చితివి!!
కవితలకి, నవస్ఫూర్తినిచ్చితివి!
కవిగాయక రచనలను మెచ్చితివి!!

***

నినుపొగడేందుకు చాలవు మాటలు!
నీ ప్రతిభ కొలువ జాలవు పాటలు!!
నీ తలపులు వరహాల మూటలు!
నీవు వేసితివి ప్రగతికి బాటలు!!

***

కోకిలకి నీవు నేర్పిన గానము!
కోట్ల రసికులకి, అమృతపానము!!
నాయికలకి నీ కంఠదానము
హాయిని, స్థాయిని పెంచు విధానము!!

***

తంబూర శృతికీ నీశృతి జీవము!
తఱగక పెరిగే నిధి నీ భావము!!
నీ స్వరచనలకు లేదుపమానము!
నీ సాధనలకు పరిమితిగానము!!

***

మాజోహారులగైకొనుము!
మహిళామణి మా వినతిని వినుము!!
ఆగని నది, నీ గాన వాహిని!
సాగనిమ్ము సంతతము దానిని!!!

రచన మరియు
సమర్పణ
పి.బి.శ్రీనివాస్

అమోఘంగా గానం చేశారు. ఏ మాత్రం బెసిగినా, అపస్వరమనబడే అన్యస్వరాలు పలికే అవకాశాలు చాలా వున్నాయి. కాని, ఆమె ఈజ్‌తోనూ పోయిజ్‌తోనూ (with ease and poise) ఏ ప్రయాసా లేకుండా తక్కువ వ్యవధిలో రికార్డింగు, ముగించి, అందరినీ "అచ్చెరువు చెరువులో" ముంచి తేల్చారు. ఆ పాట విని మెచ్చుకోలేని వారు అరసజ్ఞులు అని ఖచ్చితంగా నిర్వచించవచ్చు.

స్వదేశంలోనే కాక, అనేక విదేశాలలో కూడా ఆమె కీర్తి సుగంధం దశ దిశలా వ్యాపించింది. ఇటీవల ఒక ప్రఖ్యాత తమిళ దిన పత్రికలో జానకి, కొడుకు కోడలూ, తమ ఆరాధ్య దేవతగా ఆమెను ప్రశంసించిన వ్యాసం చదివితే, ఇట్టే తెలుస్తుంది. ఇంటా బయటా కూడా, ఎవ్వరి మనస్సునీ నొప్పించక తానొవ్వక, తప్పించుకు తిరుగు ధన్యురాలని అనిపించక మానదు. ఆ దంపతుల ప్రశంసలో సుంతైనా అతిశయోక్తి కాని, కాపట్యం గాని కనిపించదు.

ముద్దుల మనవరాలైన, అమృతవర్షిణీ అప్సరలతో ఆమె తనూ చిన్నపిల్లలా వ్యవహరిస్తూ ఆడుకుంటూ, కేరింతలు కొడుతూ వుంటే చూడ ముచ్చటగా వుంటుంది.

మనుష్యుల నడకలనీ, నడతలనీ, వ్యవహరించే విచిత్ర విభిన్నరీతులని సదా గమనిస్తూ వాటినిట్టే అనుకరించగల "ఆమె" ప్రత్యేక ప్రజ్ఞ. పాటలు పాడేటప్పుడు, ఎవరి ఏ పాత్రకే లాగున పాడితే ఔచిత్యం చెడదో అలా పాడేందుకు అన్నివిధాలా, తోడ్పడుతూ వుండే ప్రత్యేకత.

జానకి పాడిన త్యాగరాజ కీర్తనల కేసెట్ వింటే, పాత్రశ్రోతలకి క్రొత్తగా తోచినా, సునిశితంగా పరిశీలిస్తే ఒక ప్రత్యేకత గోచరించక మానదు. సాహిత్య స్పష్టత తగినంతగా మాత్రమే గమక ప్రాధాన్యమూ కొట్టొచ్చినట్టు కనిపిస్తాయి. వినిపిస్తాయి. వాహ్వా అనిపిస్తాయి.

అన్నమాచార్య కీర్తనల కేసెట్ కూడా జానకి గానంతో వెలువడింది. అందులో తన పిన్నితో, ఆమె సహోదరీ పుత్రుడు జి.బాలకృష్ణ కూడా సహగానం కావించి, కేసెట్‌కి అత్యధికమైనవన్నె చేకూర్చారు.

కొత్తలో నాతో పాటు ఎన్నో ప్రైవేట్ సాంగ్స్ పాడి ప్రభావాన్ని ఇనుమడింప జేసిన జానకి, తదుపరి, ఇతర గాయకులతో కూడా పాడి, ప్రతి పాటలోనూ తమదైన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుని నిరూపిస్తూ వస్తున్నారు.



ఇప్పటి లివింగ్ లెజెండ్, ఎస్.పి.బి అప్పట్లో కొత్త గాయకుడే. ఒక సంగీత స్పర్ధలో న్యాయనిర్ణేతలు బాలూకి రెండవ స్థానం యిచ్చిన తరుణాన, అతడే ప్రథమ స్థానానికి అన్ని విధాలా అర్హుడు అని సకారణంగా వాదించి, గెలిచారు. గెలిపించారు.

ఆ విధంగా బాలూకి ఆరంభంలోనే మనసారా ప్రోత్సాహం యిచ్చిన కళాభిజ్ఞులలో శ్రీమతి జానకిది ప్రథమ శ్రేణిలో ప్రముఖ స్థానమే అని నిర్మొగమాటంగా వ్రాక్రుచ్చ వచ్చు. ఈ విషయం తఱుచూ సభలలో వివరించడం బాలూకి సహజంగా అబ్బిన సుగుణం.

ఇటీవల నేను తమిళంలో సరాలు (గజళ్లు) రచించి స్వరపరచి, అధునాతన మహాద్భుత గాయకుడైన "ఓ.ఎస్.అరుణ్" (O.S. Arun) ఇచ్చిన ఒక క్లాసికల్ కాన్సర్టుకి విచ్చేసిన జానకి, ఆ దివ్యగానం విని, అత్యంత ప్రభావితురాలై, స్టేజి పైకి శరవేగంతో వెళ్లి, అతనిపైన కురిపించిన కరెన్సీ నోట్ల వర్షం, ప్రేక్షక శ్రోతృ గణాలని ముక్కుమీద వేలేసుకునేలా చేసింది. అంతటిది ఆమె రసజ్ఞత. నచ్చిన కళాభిజ్ఞ తన బాహాటంగా మెచ్చుకోవడం, ఆమెకే తగిన ప్రత్యేకాంశం!

రికార్డింగులలో వ్యత్యాసాల వలన, కొందరి గొంతుకలు గుర్తు పట్టలేనంతగా మారినా, పాట వినేటప్పుడు ఏదో ఒక ఆనవాలుని ఆధారం చేసుకొని, ఇట్టే పసికట్టేస్తారు జానకిగారు. She has a very sound and splendid knowledge of Sound - స్టేజి మీద ప్రసంగించేటప్పుడు కూడా Crisp గా To the point మాట్లాడుతూ, మధ్యమధ్య హాస్యరస ప్రధానాలైన రిమార్కులతో, వక్తృత్వ పరీక్షలో కూడా నూటికి వెయ్యి మార్కులు సంపాదించగలిగిన "భాషణ కళా భూషణి" ఔచిత్య సంయుత సుభాషిణి. సుహాసిని ఆమె నవ్వులు, పెదవుల నుండి రావు. అంతరాత్మ నుండి పెల్లుబికి, పొరలు పొరలుగా వఱదలై వస్తాయి. వరదలై విలసిల్లుతాయి. నిష్కలష్మ దరహాసాలు.

ఆమె ఒక్కొక్కప్పుడు సూటిగా పొడిచే దెప్పిపోట్లు కూడా, కవ్వించి నవ్వించి, మనుషుల్ని కుదిపేస్తాయి. "హ్యూమరసం"లో కూడా ఆమె "స్పెషలిస్టే".

వివిధ భాషలలో కవితలూ, గీతాలూ వ్రాయడం, వఱస కట్టి పాడడం పాడించడం ఈమెకు గల స్పెషల్ హాబీ - ఒక్కొక్క ట్యూనూ మధుర మధురసాల జిలేబీ, తీర్చితీర్చి మెఱుగులుదిద్ది, Final Shape తృప్తికరంగా వచ్చేదాకా వఱుసలని మార్చి మెఱుగు చేకూరుస్తూ చక్కని బాణీలు సమకూర్చడంలో సాటిలేని సిద్ధ హస్తురాలు.

లతా ఆశాలలో గల ప్రత్యేకతలన్నీ సంతరించుకుని తనదైన ప్రత్యేక శైలిని మలచుకున్న ఈమె కంఠస్వరమే ఈమెకు గల గొప్ప ఎస్సెట్టు. నాలో ఇదొక లింగరింగ్ థాట్. అబ్సెషన్. హాంటింగ్ సాంగ్స్ పాడడానికి అతి సముచితమైన వాయిస్సు. మోడ్యులేషన్ అనే స్పెషల్ ఫీచర్ వలన ఈమె గానం, ఎడారిలో ఒయాసిస్సు. ఆ కంఠధ్వని వినిపించడంతో బాటే కనిపిస్తుంది. దివ్యమైన ఓజస్సు.

ఈమె పంథాలో ముందుకు సాగి మున్ముందు నూతన గాయనీ మణులు సంగీత లోకంలో వెలుగులీనుతూ, వెలుగొందాలని ఆశిస్తున్నాను. ఈనాడు కూడా ఈమెకి, ఏకలవ్య శిష్యత్వం నెఱపే కళాకారిణులు ఎంతో మంది వున్నారు. కాని, జానకి, నిజానికి చేతిబొటన వ్రేళ్ళనడిగే గురువెంత మాత్రం కారు.

పైగా, వారి పురోభివృద్ధిని అనుదినం ఆకాంక్షించే మనస్వినియైన దిగ్దిగంత వ్యాప్త యశస్విని. ఈమెకీ ఈమె బంధుమిత్ర పరివారాలకీ, సర్వేశ్వరుడు సదా ఆయురారోగ్యైశ్వర్య ధనధాన్య సమృద్ధిని కలగజేస్తూ ఆశీర్వాద సుమ నిరంతర వర్షం కురిపిస్తూ సర్వశుభములూ చేకూర్చాలని నేను మనసారా ప్రార్థిస్తున్నాను. తథాస్తు!!

**- డా॥ పి.బి.శ్రీనివాస్**

## ఆరాధన

రచన: ఆరుద్ర | సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

ఆడదాని ఓరచూపుతో - జగాన
ఓడిపోని ధీరు డెవ్వడూ
నిజానికి జగేలని వయారి
నిన్నుచూడ కరగి పోదువోయ్
మిటారి నవ్వులే మిఠాయి తీపులు
కటారి రూపులోన కైపులున్నవి
రంగేళి ఆటకు రడీగ ఉన్నది కంగారు ఎందుకోయీ॥ఆడ॥
ఖరీదు లేనివి ఖరారు అయినవి
గులాబి బుగ్గలందు సిగ్గులున్నవి
మజాల సొగసులె ప్రెజంటు చేసెద
సుఖాల తేలవోయీ ॥ఆడ॥

## సిరి సంపదలు

రచన: ఆచార్య ఆత్రేయ | సంగీతం: మాస్టర్ వేణు

పువ్వు నవ్వెను పున్నమి నవ్వెను
పులకరించి ఈ జగము నవ్వెను
కొలను నవ్వెను కోరిక నవ్వెను
నవ్వలేక నేనున్నానూ
వయసు నవ్వెను సొగసూ నవ్వెను
నవ్వురాకనీ మనసే నలిగెను
వలపు నవ్వెను తలపు నవ్వెను
పగ రగిలీ అవి బలియైపోయెను ॥పువ్వు॥
కడుపుతీపితో కన్నబిడ్డకై
హితవు కోరి యేగిన తండ్రికి
చేయని నేరం శిక్ష వేసెను
మాయని పాపం నా పాలాయెను ॥పువ్వు॥
కలిమీ చెలిమీ వెలసిన యిల్లూ
వెలుగుమాసి వెలవెలపోయెను
లోకం నవ్వెను శోకం మిగిలెను
లోలోపల నా గుండె లవిసెను ॥పువ్వు॥

## చంద్రహాస

రచన: దాశరథి | సంగీతం: యస్. హనుమంతరావు

ఓ వీణ చెలీ నా ప్రియ సఖీ
ఈ ఒంటరి తనము ఏలనో
నా చక్కని రాజెట దాగెనో ॥ఓ వీణ॥
మలయ మారుతము మంటలు రేపె
మల్లెలు మొల్లలు ముళ్లై కలచె
చిలక పలికితే చికాకు కలిగే
హృదయము తొందర పడసాగె ॥ఓ వీణ॥
కన్నుల కదలెను ఆతని రూపు
మనసున మెరిసెను ఆతని వలపు
అంతట వినపడె ఆతని పిలుపే
మరువను ఎన్నడు ఆ తలపు ॥ఓ వీణ॥

## మురిపించే మువ్వలు

రచన: ఆరుద్ర | సంగీతం: ఎస్.ఎం. సుబ్బనాయుడు

నీ లీల పాడెద దేవ
మనవి ఆలించ వేడెదదేవ
నను లాలించు
మా ముద్దు దేవ ॥నీ లీల॥
సిందూర రాగంపు దేవ
దివ్య శృంగార భావంపు దేవ
వళ్లి చెలువాలు
నినుకోరు నీవురావ -ఎలమి ॥నీ లీల॥
అనుపమ వరదాన శీల
వేగ కనుపించు కరుణాలవాల ॥నీ లీల॥
1. సగమపని ॥నీ లీల॥
2. నిస్సనిదపమ గామగరిసని పానిసగమప
మగరిస నిదమపగరిని ॥నీ లీల॥
3. సారిస్స నిసరిస్స నినిస పపనినిస మమపపనినిస
గగసగగస నినిస పపని మమప
గగమమపపనినిసస గరినిస
4. పానిదపమ గరిసని సగగ్గ సగగ్గ సగమపగరిసని సగస
నినిప మమప నినిప నినిపస పనినిపస నిదగరిసనిసగస
5. గామపానిసా
నిసగరిసరిని సారిసనీ రీగరినీ సారిసనీ
గరినిగ్గరిగ నిరిగరి నిగరినీ
నిరిరి నిసస నిరిరి నిసస నిదపా
నిన్నిసా ఆ... అ... ఆ...
రిన్నీసపాని మాప గామపనిసరి ఆ... అ...
సాని పానీ సారిసనీ సారిసనీ
పానిపస పానిపని మాపమ పానిప నీపనిస పానిపనీపస
మగా పమా
సారిసనీ నీసనిసా సారిసనీ
సారిస సారిస సారిస గరిగరిసని గరిసనిసరిస్సనిదపమ పనిపమ
సానిదపమ పనిపమ గరిరిస సగమపా గమపనిపా
సనిగరిసనిపరీ సరిసనిసా సనిగరిరిసనిదమపని॥నీ లీల॥

## స్వర్ణమంజరి

రచన: సముద్రాల | సంగీతం: ఆదినారాయణరావు

ఆడేను పాడేనుగా... ఆనందమీనాడెగా...
ఇక చైత్ర వినోదాల హాయిగా... (2)
ఆడేను పాడేనుగా ఆనందమీనాడెగా
కడలి పొంగే తరంగాలపైన నిలిచి నర్తించలేనా
నిలిచి నర్తించలేనా
నింగికెగిరే విహంగాల వెంట జంటగా సాగిపోనా
జంటగా సాగిపోనా
భువిని దివిని జతకావింపగా
ఆడేను పాడేనుగా... ఆనందమీనాడెగా

## బంగారు తిమ్మరాజు

రచన: వేటూరి సంగీతం: కోదండపాణి

ఆ... ఆ... ఆ... ఆ... ఓ... ఓ... ఆ... ఆ...
ఈ వింత... పులకింత... ఈ వింత పులకింత నాలోన కలిగేను
నిను కనినంత రారా రాజా వన్నెలరాజా ఓ... ఓ...
ఈ వింత... పులకింత... ఈ వింత పులకింత
నాలోన కలిగేను నినుకనినంత ఓ...ఓ...
కోరికలూగే ఊయలలు గుండెలో పూచే మల్లెయలు ॥2॥
కన్నుల్లో కెంపులు కదలికలో సొంపులు
ఊరుకోదు వయసు నన్నూరించే సొగసు
ఊగించి తూగించి నీ పై మనసు
ఈ వింత...పులకింత నాలోన కలిగేను
నిను కనినంత...ఆ...ఆ...
పరువాలన్నీ నీ వశము మై మరపించే పరవశము ॥2॥
నిలువనీదు మైకము నీవే నా లోకము
జాలమేల రారా అందాలు దోచుకోరా....
కవ్వించి కవ్వించే తరుణమిదేరా
ఈ వింత... పులకింత... ఈ వింత పులకింత నాలోన కలిగేను
నిను కనినంత రారా రాజా వన్నెలరాజా ॥ఈ వింత॥

## సప్తపది

రచన: వేటూరి సంగీతం: కె.వి. మహదేవన్

ప: నెమలికి నేర్పిన నడకలివి
మురళికి అందని పలుకులివి
శృంగార సంగీత నృత్యాభినయవేళ
చూడాలి నా నాట్యలీల ॥నెమలి॥
చ: కలహంసల కిచ్చిన పదగతులు
ఎలకోయిల మెచ్చిన స్వరజతులు
ఎన్నెన్నో వన్నెల వెన్నెలలు
ఏ వేవో కన్నుల కిన్నెరలు
కలిసి మెలిసి కళలు విరిసి మెరిసిన
కాళిదాసు కమనీయ కల్పనానల్ప
శిల్పమణి మేఖలను శకుంతలను ॥నెమలి॥
చ: చిరునవ్వులు అభినవ మల్లికలు
సిరిమువ్వలు అభినయ దీపికలు
నీలాల కన్నుల్లో తారకలు
తారాడే చూపుల్లో చంద్రికలు
పురులు విరిసి మరులు కురిసి మురిసిన
రవి వర్మ చిత్రలేఖనా లేఖ్య
సరస సౌందర్య రేఖను శశిరేఖను ॥నెమలి॥

## గుడి గంటలు

రచన: నార్ల చిరంజీవి సంగీతం: ఘంటసాల

నీకనుదోయిని నిద్దురనై... నీకనుదోయిని నిద్దురనై
మనసున పూచే శాంతినై ॥నీకను॥
ఎడబాయని నీడగా తోడవుతా నీకలలకు నేనే జోడవుతా
నీకనుదోయిని నిద్దురనై... మనసున పూచే శాంతినై
నీ కలలన్నీ నావాయె నా యవ్వనరాగం నీదాయె...
వలపుల గుడిలో జంటలురాగే జంటగ రమ్మని పిలిచాయి...
ఇరువురిని... పిలిచాయి...
నీ కనుదోయిని నిద్దురనై మనసున పూచే శాంతినై
కాటుక కళ్ళె కానుకగా నా బుగ్గల సిగ్గే హారతిగా
హృదయము నీకే అంకితమవగ నీ బిగి కౌగిలి చేరెదను...
కరిగెదను... కరిగెదను...
నీ కనుదోయిని నిద్దురనై... మనసున పూచే శాంతినై
ఎడబాయని నీడగా తోడవుతా నీ కలలకు నేనే జోడవుతా...
ఆ... ఆ... ఆ... ఆ...

## నర్తనశాల

రచన: సముద్రాల సంగీతం: సుసర్ల దక్షిణామూర్తి

ప: నరవరా ఓ కురువరా
వీరుల నీకు సరి లేరనీ
సరసులలో జాణవనీ
విన్నారా కన్నారా కనులారా ॥నరవరా॥
చ: సురపతీ నెదిరించి రణానా
పశుపతీ మురిపించి బలానా
సాటిలేని వీరుండన్న యశమునుగన్నా
అర్జున ఫల్గుణ పార్థ కిరీటీ, బిరుదు గొన్న విజయా ॥నరవరా॥
నినుగనీ తలపూచే ఉలూచీ
కొనుమనీ చెయిసాచె సుభద్రా
నీదూ వన్నే చిన్నేగన్నా చెలువల మిన్నా
అలరుల విలుతుని ములుకుల గురియై
వలపులమ్ము కొనురా ॥నరవరా॥

## అత్తగారు - కొత్త కోడలు

రచన: ఆత్రేయ సంగీతం: జి.కె.వెంకటేష్

వెన్నెల తెచ్చాడు మా పాపడు నవ్వులు పంచాడు
నాకు మీకు - మీకు నాకూ - అందరికీ -మన
కందరికీ యింటికీ -
నా కంటికీ ॥వెన్నె॥
మిలమిలలాడే కన్నులతో -
జిలిబిలి మెరుపుల చూపులతో
మనసులు మబ్బులు కరిగించీ -
మమతల జల్లులు చిలికాడూ ॥వెన్నె॥
బుడిబుడి నడకలు నడిచాడు -
పులకిస్తుంది భూదేవి
ముద్దుల మూటలు మాటలతో
మురిసిపోవును విద్దెల రాణి ॥వెన్నె॥

# యస్. జానకి గానం చేసిన సినీ గీతాలు

## లవకుశ

రచన:సముద్రాల    సంగీతం: ఘంటసాల

విరిసే చల్లనీ వెన్నెలా
మరల ఈనాడు మా కన్నులా
చెన్నుమీర జానకమ్మ
అంకమ్మున -వామాంకమ్మున
మా కన్నుదోయి విందుచేసె
మా రాముడు - కరుణా ధాముడు
మదినెన్నో వింత సంబరాలు మీరగా ॥విరిసె॥
మరువగరానీ పండుగ నేడు
మా పాలికీ - సర్వ జీవాళికి
మా ఊరూనాడూ వెల్లి విరిసె
ఉల్లాసము -మధురోల్లాసము
ధరపొంగీ పోయీ ఆటలాడే హాయిగా ॥విరిసె॥

## బంగారు పంజరం

రచన:దేవులపల్లి కృష్ణశాస్త్రి    సంగీతం: యస్.రాజేశ్వరరావు

గట్టుకాడ, ఎవరో! -సెట్టు నీడ, ఎవరో!
నల్ల కనుల నాగసొరము వూదేరు ఎవరో! ॥గట్టు॥
పోటుపాటు సూసుకుని -ఏరు దాటి రావాలా
ముళ్ళురాళ్ళు ఏరుకోని మళ్ళతోవ నడవాలా
ఆగలేక, రానకొడక -సైగ సేసేవెందుకు?
సెగెందుకు?
ఏటిగట్టుకాడ - మావి సెట్టునీడ
ఎవరో...
హోయ్! నల్ల కనుల నాగసొరము వూదేరు ఎవరో
పైరుగాలీ పడుసుపైట పడగలేసీ ఆడేను!
గుండెపైని గుళ్ళపేరు ఉండలేక వూగేను!
తోపుయేనక రాన కొడక -తొంగి సూసే వెందుకు
నీవెందుకు ?-సైగెందుకు?
ఏటి గట్టుకాడ -మావిసెట్టునీడ
ఎవరో...ఎవరో...
హోయ్! నల్ల కనుల నాగసొరము వూదేరు ఎవరో...

## నీరాజనం

రచన: సి.నారాయణరెడ్డి    సంగీతం:ఓ.పి.నయ్యర్

ఘల్లు ఘల్లునా గుండె ఝల్లునా
పిల్లఈడు తుళ్ళి పడ్డదీ...
మనసుతీరగా మాటలాడకా
మౌనం ఎందుకన్నదీ ॥2॥ ॥ఘల్లు॥
క్షణమాగక తనువూగెను
ఈ సంధ్యా సమీరాలలో
అనురాగమే తల ఊపెను
నీలాకాధ తీరాలలో ॥క్షణ॥॥ఘల్లు॥
ఆ...అహోహో...ఆ...
కలగీతమై పులకించెను
నవకళ్యాణ నాదస్వరం
కథ కానిది తుదిలేనిది
మన హృదయాల నీరాజనం ॥కల॥॥ఘల్లు॥

## అంతులేని కథ

రచన: ఆచార్య ఆత్రేయ    సంగీతం: ఎమ్మెస్ విశ్వనాధమ్

కళ్ళలో వున్నదేదో కన్నులకే తెలుసు
రాళ్ళలో వున్న నీరు కళ్ళకెలా తెలుసు
నాలో వున్న మనసూ నాకుగాక ఇంకెవరికి తెలుసు
నీటిలో ఆరే నిప్పును కానూ
నిప్పునకాగే నీరైన కానూ
ఏదీ కానీ నాలో రగిలే
ఈ అనలాన్నీ ఆర్పేదెవరో ॥కళ్ళ॥
తానే మంటై వెలుగిచ్చు దీపం
చెప్పదు తనతో చెలరేగు తాపం
నే వెళ్ళు దారి ఓ ముళ్ళదారి
రాలేరు యెవరూ నాతో చేరి ॥నాలో॥
వేసవిలోనూ వానలు రావా
కోవెల శిలకు జీవం రాదా
జరిగేనాడే జరుగును అన్నీ
జరిగిననాడే తెలియును కొన్నీ ॥నాలో॥

## దేవాంతకుడు

రచన: ఆరుద్ర    సంగీతం:అశ్వత్థామ    గానం: పి.బి. శ్రీనివాస్‌తో యుగళం

ఎంత మధురసీమ, ప్రియతమా
సంతతము మన మిచటే సంచరించుదామా
విసువీధుల తారకలే విరజాజుల మాలికలై
కనులముందు నిలువగా - నీ కురులలోన ముడిచెదనే
గగన గంగ అలలలోన - కదలియాడు తామరలే
కరములందు వచ్చి జేర - నీ చరణపూజ చేయుదునా
ఎటుచూచిన అందమే - చిందును మకరందమే
యీ వన్నెల వెన్నెలలో - ఓలలాడి సోలుదుమా
కమ్మని యీ వనమందున కలసి మెలసి యాడుదమా
కల్పవృక్ష ఛాయలోన - కాపురము చేయుదుమా

## ఎం.ఎల్.ఎ. (తొలి పరిచయం)

రచన: ఆరుద్ర    సంగీతం: పెండ్యాల    గానం:ఘంటసాలతో యుగళం

నీ ఆశ అడియాస
చేజారే మణిపూస
బ్రతుకంతా అమవాస
లంబాడోళ్ళ రాందాసా
తలచినది ఒకటయితే
జరిగినది వేరొకటి
చితికినది నీ మనసు
అతుకుటకు వేరెవరు ॥ నీ ఆశ॥
గుండెలలో గునపాలు
గుచ్చారే నా వాళ్ళు
కన్నులలో గోదారి
కాలువలే కట్టింది ॥నీ ఆశ॥

## మురళీకృష్ణ

రచన: ఆచార్య ఆత్రేయ   సంగీతం: మాస్టర్ వేణు

మోగునా... ఈ వీణ, మూగవోయిన
రాగహీన, అనురాగహీన ॥మోగు॥
పాటలెన్నో నేర్చినదీ - ప్రభువు రాకకై వేచినదీ
వచ్చిన ప్రభువు వినని మెచ్చకనే వెడలిపోయెను
బ్రతుకే వెలితి చేసెనూ ॥మోగు॥
ఆదిలోనె అపశ్రుతి పలికెను
నాదమంతా ఖేదమాయెను
స్వరములు ఏడు సముద్రాలై ముంచివేసెనూ
తంత్రులు తెంచివేసెను ॥మోగు॥
దేవుడు లేనీ కోవెలగా
జీవితమంతా శిథిలము కాగా
ప్రభువు వెళ్ళిన అడుగుజాడలే
వెతుకుచుంటిని శూన్యంలో ॥మోగు॥

## పూజా ఫలము

రచన: సి. నారాయణ రెడ్డి   సంగీతం: యస్. రాజేశ్వరరావు

పగలే వెన్నెల - జగమే ఊయెల
కదలే ఊహలకే కన్నులుంటే
పగలే వెన్నెల - జగమే ఊయెల
నింగిలోన చందమామ తొంగిచూచె
నీటిలోన కలువభామ పొంగిపూచె
ఈ అనురాగమే జీవనరాగమై
ఎదలో తేనెజల్లు కురిసిపోదా ॥పగలే॥
కడలి పిలువ కన్నెవాగు పరుగుదీసె
మురళిపాట విన్న నాగు శిరసునూపె
ఈ అనుబంధమే మధురానందమై
ఇలపై నందనాలు నిలిపిపోదా ॥పగలే॥
నీలిమబ్బు నీడలేచి నెమలి ఆడె
పూల బుతువు సైగచూచి పికముపాడె
మనసే వీణగా ఝుణఝుణ ప్రైయగా
బ్రతుకే పున్నమిగా విరిసి పోదా ॥పగలే॥

## బావా మరదళ్ళు

రచన: ఆరుద్ర   సంగీతం: పెండ్యాల

నీలి మేఘాలలో గాలి కెరటాలలో
నీవు పాడే పాట వినిపించు నీ వేళ
ఏ పూర్వపుణ్యమో నీ పొందుగా మారి
అపురూపమై నిలచె నా అంతరంగాన ॥నీలి॥
నీ చెలిమిలోనున్న నెత్తావి మాధురులు
నా హృదయ భారమునే మరపింపజేయు ॥నీలి॥
అందుకోజాలని ఆనందమే నీవు
ఎందుకో చేరువై దూరమవుతావు ॥నీలి॥

## పాండవ వనవాసం

రచన: సముద్రాల   సంగీతం: ఘంటసాల

ఓ వన్నెకాడ
ఓ వన్నెకాడ నిన్నుచూచి నా మేను పులకించెరా ఓ వీరా
నన్నేలి కులికించరా ॥ఓ వన్నెకాడ॥
మరులు పెంచే మంచిగంధం
మల్లెపాన్పు వేచేనోయీ
నీ దయగోరి నిలచేనోయీ ॥ఓ వన్నెకాడ॥

---

ఉరుకుల పరుగుల దొరా
మగసిరికిది తగదురా
ఉరుకుల పరుగుల దొరా నీ మగసిరికిది తగదురా
ఉరుకుల పరుగుల దొరా
చూడరా యిటు చూడరా
సరియీడుజోడు వన్నెలాడినేరా.. ఓయ్
వలపుగొలిపే బింకాల
కళలతనిపే పొంకాల
వదలిపోబోకురా ॥ఉరుకుల॥

---

తాళలేరా మదనా మదనా మదనా
నే తాళలేరా మదనా మదనా మదనా మదనా
నే తాళలేరా మదనా
విరులశరాల వేగితిచాల విరహమోర్వజాల
ఇలలో లేని అమర సుఖాల
తేలజేతు వేగ ఎదనుగదియర
తాళలేరా మదనా మదనా మదనా మదనా
నే తాళ నే తాళ, ఇక తాళలేరా మదనా ॥

## మంచి మనసులు

రచన: ఆచార్య ఆత్రేయ   సంగీతం: కె.వి. మహదేవన్

ఓహో ఓహో పావురమా - వయ్యారి పావురమా
మావారి అందాలు నీవైన తెలుపుమా ॥ఓహో॥
మనసు మధురమైనది - మమతలు నిండినది
సొగసు నే నెరుగనిది - చూడాలని వున్నది
అరువుగ నీ కనులు - కరుణతో ఇవ్వగలవా
కరువుతీర ఒక్కసారి కాంతునమ్మ వారినీ ॥ఓహో॥
వలపుకన్న తీయని - పలుకులు వారివి
తలచుకున్న చాలును - పులకరించు నా మేను
మగసిరి దొరయని - మరునికి సరియని
అందరు అందురే - అంత అందమైనవారా ॥ఓహో॥
అందరి కన్నులు - అయ్యగారిమీదనే
దిష్టితగల గలదనీ - తెలిపిరమ్మ కొందరు
అన్నది నిజమేనా? అల్లిన కథలేనా?
కన్నులున్న నీవైనా ఉన్నమాట చెప్పుమా ॥ఓహో॥

## భూకైలాస్

రచన: సముద్రాల సంగీతం: సుదర్శనం గానం: ఘంటసాల

ద్వారపాలుర మరల దరిదీయు కృపయో
ధరలోన ధర్మము నెలకొల్పు నెపమో
రాముని అవతారం - రవికుల సోముని అవతారం
రాముని అవతారం
రవికుల సోముని అవతారం
సుజనజనావన ధర్మాకారం
దుర్జన హృదయ విదారం ॥రాముని॥
దాశరథిగ శ్రీకాంతుడు వెలయు
కౌసల్యాసతి తపము ఫలించు
జన్మింతురు సహజాతులు ముగ్గురు ॥జన్మింతురు॥
లక్షణ, శత్రుఘ్న, భరత
చదువులు నేరుచు మిషచేత
చాపము దాలిచి చేత
విశ్వామిత్రుని వెనువెంట
యాగము కావగ జనునంట
అంతముజేయునహల్యకు శాపం ॥అంతము॥
ఒసగును సుందరరూపం ॥రాముని॥
ధనువో జనకుని మనసున భయమో
ధారుణి కన్యా సంశయమో
దనుజులు కలగను సుఖగోపురమో ॥దనుజులు॥
విరిగెను మిథిలా నగరమున ॥రాముని॥
కపట నాటకుని పట్టాభిషేకం
కలుగును తాత్కాలిక శోకం
భీకర కానన వాసారంభం
లోకోద్ధరణకు ప్రారంభం
భరతుని కోరిక దీరుచు కోసం
పాదుకలొసగే ప్రేమావేశం
నరజాతికి నవనవ సంతోషం ॥నరజాతి॥
గురుజన సేవకు ఆదేశం ॥రాముని॥
అదుగో! చూడుము! బంగరు జింక
మన్నెచనునయ్యో లంక
హరనయనాగ్ని పరాంగనవంక
అరిగిన మరణమె నీకింక
రమ్ము రమ్ము హే భాగవతోత్తమ
వానరకుల పుంగవ హనుమ ॥రమ్ము॥
ముద్రిక కాదిది భువన నిదానం
జీవన్ముక్తికి సోపానం
రామ రామ జయ రామరామ జయ
రామ రామ రఘుకుల సోమ
సీతాశోక వినాశన కారీ
లంకా వైభవ సంహారీ
అయ్యో రావణ భక్తాగ్రేసర
అమరంబౌనిక నీ చరిత
సమయును పరసతిపై మమకారం
వెలయును ధర్మవిచారం ॥రాముని॥

## ఉయ్యాల - జంపాల

రచన: ఆరుద్ర సంగీతం: పెండ్యాల గానం: లీల, బృందం

అందాలరాముడు ఇందీవర శ్యాముడు
ఇనకులాబ్ధి సోముడు ఎందువలన దేముడు
తండ్రిమాటకై పదవుల త్యాగమే జేసెను
తన తమ్ముని బాసకై తాను బాధ పొందెను
అందాలరాముడు అందువలన దేముడు
అనుభవించదగిన వయసు అడవిపాలు జేసెను
అడుగు పెట్టినంత మేర ఆర్యభూమి చేసెను
అందాలరాముడు అందువలన దేముడు
ధర్మపత్ని చెర బాసగా దనుజుని దునుమాడెను
ధర్మము కాపాడుట కా సతినే వీడెను
అందాలరాముడు అందువలన దేముడు

## మీనా

రచన: ఆరుద్ర సంగీతం: రమేష్‌నాయుడు గానం: సుశీల

శ్రీరామ నామాలు శతకోటి
ఒక్కొక్క పేరు బహుతీపి - బహుతీపి
తండ్రి ఆనతి తలదాల్చు తనయుడు
దశరథరామయ్య స్తవనీయుడు
కడుమేటి విలు విరచి కలికిని చేపట్టిన
కల్యాణరామయ్య కమనీయుడు - కమనీయుడు॥శ్రీరామ॥
సుదతి జానకితోడ శుభ సరస మాడేటి
సుందర రామయ్య సుకుమారుడు
కోతిమూకలతో లంకపై దండెత్తు
కోదండరామయ్య రణధీరుడు - రణధీరుడు ॥శ్రీరామ॥
పవమాన సుతుడు పాదాలు పట్టగా
పట్టాభిరామయ్య పరంధాముడు
అవనిలో సేవించు ఆశ్రితుల పాలించు
అచ్యుతరామయ్య అఖిలాత్ముడు - అఖిలాత్ముడు॥శ్రీరామ॥

## లవకుశ

రచన: సముద్రాల సంగీతం: ఘంటసాల గానం: లీల, సుశీల

శ్రీరామ సుగుణధామ
రఘువంశ జలధి సోమ
సీతా మనోభిరామ
సాకేత సార్వభౌమ ॥శ్రీరామ॥
మందస్మిత సుందర వదనారవింద రామ
ఇందీవర శ్యామలాంగ వందిత సుత్రామ
మందార మరందోపమ మధుర మధుర నామ ॥శ్రీరామ॥
అవతారపురుష! రావణాది దైత్య విరామా
నవనీత హృదయ ధర్మనిరత రాజలలామా
పవమాన తనయ సన్నుత పరమాత్మ పరంధామా ॥శ్రీరామ॥

## లవకుశ

రచన: సముద్రాల సంగీతం: ఘంటసాల గానం: పి.లీల, పి. సుశీల

రామ కథను వినరయ్యా
ఇహపర సుఖములనొసగే సీతా ॥రామ॥
అయోధ్యా నగరానికి రాజు దశరథ మహరాజు
ఆ రాజుకు రాణులు ముగ్గురు కౌసల్య, సుమిత్ర, కైకేయి
నోము ఫలములై వారికి కలిగిరి కొమరులు నల్వురూ
రామ లక్ష్మణ భరత శతృఘ్నులు ॥రామ॥
గడియయెని రఘురాముని విడచి
గడుపలేని ఆ భూజాని
కౌశిక యాగము కాచి రమ్మనీ
పనిచెను నీరదశ్యామునీ ॥రామ॥
తాటకి దునిమి జన్నముగాచి
తపసుల దీవన తలదాల్చి
జనకుని యాగము చూచు నెపమ్మున
చనియెను మిథిలకు దాశరథీ ॥రామ॥
మదనకోటి సుకుమారుని కనుగొని
మిథిలకు మిథిలయే మురిసినదీ
ధరణిజ మదిలో మెరసిన మోదము
కన్నుల వెన్నెల విరిసినదీ ॥రామ॥
హరుని విల్లు రఘునాథుడు చేకొని
ఎక్కిడ ఫెళ ఫెళ విరిగినదీ
కళకళలాడే సీతరాముల
కన్నులు కరములు కలసినవీ ॥రామ॥

## లవకుశ

రచన: సముద్రాల సంగీతం: ఘంటసాల గానం: పి.లీల, పి. సుశీల

వినుడు వినుడు రామాయణగాథ
వినుడీ మనసారా
ఆలపించినా ఆలకించినా
ఆనంద మొలికించే గాథ ॥వినుడు॥
శ్రీరాముని రారాజు సేయగా
కోరెను దశరథ భూజాని
పౌరులెల్ల ఉప్పొంగిపోయిరా
మంగళవార్త విని కారు చిచ్చుగా మారెను కైక
మందర మాట విని మందర మాట విని ॥వినుడు॥
అలుక తెలిసి ఏ తెంచిన భూపతి
నడిగెను వరములు ఆ తన్వీ
సలుపవలయు పట్టాభిషేకమూ భరతునకీ పృథివీ
మెలగవలయు పదునాలుగేడులూ రాముడు కారడవీ
చెలియ మాటకు ఔను కాదనీ
పలుకడు భూజానీ కూలే భువిపైని ॥వినుడు॥
కౌసలేయు రావించి మహీపతి
ఆనతి తెలిపెను పినతల్లీ
మోస మెరిగి సౌమిత్రి కటారీ
దూసెను రోసిల్లీ
దోసమనీ వెనుదీసె తమ్మునీ
రాముడు నయ శాలి
వనవాస దీక్షకు సెలవు కోరె
పినతల్లి పదాలవ్రాలి... ఓ... ॥వినుడు॥
వెడలినాడు రాఘవుడు అడవికేగగా
పడతి సీత సౌమిత్రి తోడు నీడగా
ఘోడు ఘోడునా అయోధ్య గొల్లుమన్నదీ
వీడకుమా మనలే నని వేడుకొన్నదీ
అడుగలబడి రాఘవా ఆగమన్నదీ
అడలి అడలి కన్నీరై అరయుచున్నదీ ॥వినుడు॥

## లవకుశ

రచన: సముద్రాల సంగీతం: ఘంటసాల గానం: పి.లీల, పి. సుశీల

శ్రీరాముని చరితమునూ తెలిపెదమమ్మా
ఘన శీలవతీ సీతకథ వినుడోయమ్మా ॥శ్రీరామ॥
చెలువుమీర పంచవటీ సీమలో
తమ కొలువు సేయ సౌమిత్రి ప్రేమతో
తన కొలువుతీరె రాఘవుడు భామతో ॥శ్రీరామ॥
రాముగనీ ప్రేమగొనె రావణు చెల్లీ
ముకు చెవులు గోసె సౌమిత్రి రోసిల్లీ
రావణుడా మాటవినీ పంతము పూనీ
మైథిలినీ కొనిపోయె మాయలు పన్నీ ॥శ్రీరామ॥
రఘుపతినీ రవిసుతునీ కలిపెను హనుమా
నృపు జేసెను సుగ్రీవునని రామ వచన మహిమ
ప్రతి ఉపకృతి చేయమనీ పనిచెను కపులా
హనుమంతుడు లంకజేరి వెదకెను నలుదెసలా ॥శ్రీరామ॥
నాథా రఘునాథా పాహి పాహి
పాహియని అశోకవనిని శోకించే సీతా
దరికి జని ముద్రికనిడి తెలిపె విభునివార్త
ఆ జనని శిరోమణి అందుకొని పావనీ
లంక కాల్చి రామునికడకేగెను రివ్వు రివ్వుమనీ ॥శ్రీరామ॥
దశరథ సూనుడు లంకను డాసీ
దశకంఠు తలలు కోసి అతని తమ్మునీ రాజును జేసీ
సీతను తెమ్మని పనిచె చేరవచ్చు యిల్లాలిని చూసీ
శీల పరీక్షను కోరె రఘుపతీ
అయోనిజపైనే అనుమానమా
ధర్మమూర్తి రామచంద్రుని యిల్లాలికా యీ పరీక్షా
పతియానతి తల దాలిచి అగ్ని దూకె సీతా
హుతవాహుడు చల్లబడీ శ్లాఘించెను మాతా
సురలు పొగడ ధరణిజతో పురికి తరలె రఘునేతా॥శ్రీరాముని॥

## కథానాయిక మొల్ల

రచన: సి.నారాయణరెడ్డి సంగీతం: కోదండపాణి గానం: పి. సుశీల

రఘుకుల తిలకా నీ ఆనతి
రచియించితి రామాయణ సత్కృతి
ఆ కృతి వరియించిన పతివి నీవే
అతులిత కైవల్య గతివి నీవే!....
జగమే రామ మయం! మనసే
అగణిత తారక నామ మయం ॥జగమే॥
నీల జలద రమణీయ రూపం
నిగమాంచల మందిర మణిదీపం
సుందర జానకి వందిత చరణం
సురముని శరణం! భవతాప హరణం! ॥జగమే॥
ఆ చిరునవ్వే అమృతపు జల్లు
అఖిల జగములేలు ఆ చేతి విల్లు
అతని గానమున అలరారు కావ్యం
అన్ని యుగాలకు నవ్యాతి నవ్యం ॥జగమే॥
ఎవని కమల కమనీయ పదము!చూ
పించె అహల్యకు ముక్తి పదము!
ఎవని చంద్రికా మృదుల కరము! అం
దించెను శబరికి దివ్యవరము
ఎవని ఏలుబడి ఇంటికొక్క గుడి నిలిపెనో
ఎవని రాజ్యమే రామ రాజ్యమె వెలిసెనో!
ఆ రాముడు నా అంతరంగమున నిండగా
అహము మరచి, ఈ యిహము మరచి
జన్మాంతర బంధములెల్ల విడిచి
ఆ మహాజ్యోతిలో లీనముకానా
ఆ మహాప్రభునిలో లీనముకానా
ఓ రామా! రఘురామా!కైవల్యరామా!

## శ్రీ రామాంజనేయ యుద్ధం

రచన: ఆరుద్ర  సంగీతం: కె.వి. మహదేవన్  గానం:డా॥ఎమ్.బాలమురళీకృష్ణ,పి.లీల

అ: మేలుకో శ్రీరామ మేలుకో రఘురామ (2)
 మేలుకొని వేగ మమ్మేలుకోవయ్యా (2)
కో॥ మేలుకో (3)
ఆ: కులదైవమగు స్యూర్యుడుదయించువేళాయె
 అరవిందలోచనా మేలుకో మేలుకో (2)
అ: మునికోటి సురకోటి మునివాకిటను చేరి
 నిను కొలువ నిలిచేరు మేలుకో...
కో: మేలుకో... మేలుకో...
అ: రామ మేలుకో
ఆ: వరద మేలుకో (2)
అ: తెల్ల ఏనుగు వచ్చి ముంగిట నిలిచేను
 నల్లని మా స్వామి మేలుకో
ఆ॥ ఎల్ల లోకాలను ఏక చక్రమ్ముగా
 చల్లగా ఏలుకొన మేలుకో
కో॥ మేలుకో (3)
ఆ: పదునాల్గు వర్షాలు వనవాస మొనరించి
 వడలి పోయిన స్వామి మేలుకో
అ: అలరావణుని చంపి అవనినే కాపాడి (2)
 అలసి పోయిన స్వామి మేలుకో
కో॥ మేలుకో (3)
ఆ: పన్నీటి జలకాల నిన్ను సేవించుకొన
 పడతి జానకి వేచె మేలుకో (2)
అ: అఖిల భువనమ్ములు అభిలషించే శుభము
కో॥ అభిషేఖ సుదినమిదె మేలుకో (3)

## భక్తశబరి

రచన : దేవులపల్లి కృష్ణశాస్త్రి  గానం:పి.బి.శ్రీనివాస్

ఏమి రామకథ -శబరీ శబరీ
ఏదీ మరియొకసారి
ఏమి రామకథ - రామ కథా సుధ
ఎంత తీయనిది - శబరీ -శబరీ !  ॥ఏమి॥
రవికుల శశియై -రాఘవుడై
రాముడయీ -గుణధాముడయీ
అవతరించునట హరి మనకై
దాశరథీ - దయా జలధీ...  ॥ఏమి॥
వాలు కనుల ఆ జానకినీ
ఓర కనుల ఒకసారి గని
కేల శివుని విల్లందుకొనీ
లీల విరిచెనట - నీల నీరద
శ్యాముడట - కళ్యాణ రాముడట  ॥ఏమి॥
మౌని భార్య మర్యాద చెడి
ధూళిపడి శిలయైన జాలిపడి
దీనురాలి తన పదముల తాకి
ప్రాణ మొసుగు -కారుణ్య ధాముడట  ॥ఏమి॥

## శ్రీ రామాంజనేయ యుద్ధం

రచన: ఆరుద్ర  సంగీతం: కె.వి. మహదేవన్  గానం: పిసుశీల,బి.వసంత

శ్రీ కరమౌ శ్రీ రామ నామం జీవామృతసారం
పావనమీ రఘురామ నామం భవ తారకమంత్రం
దధిక్షీరమ్ములకన్నా ఎంతో మధుర మధుర నామం
సదా శివుడు ఆ రజతా చలమున సదా జపించే నామం
కరకుబోయ తిరగేసి పలికినా కవిగా మలిచిన నామం
రా... మరా... మరామ... సీతా...
రామ రామ రామ సీతా  ॥శ్రీ కరమౌ॥
రాళ్ళు నీళ్ళపై చీల్చిన నామం
రక్కసి గుండెల శూలం  ॥శ్రీ కరమౌ॥
 వేయి జపాల కోటి తపస్సుల విలువ ఒక్కనామం
 నిండుగ దండిగ వరములోసంగే రెండక్షరమ్ముల నామం
 ఎక్కడ రాముని భజన జరుగునో
 అక్కడ హనుమకు స్థానం
 చల్లని నామము మ్రోగె చోట
 చెల్లదు మాయాజాలం
 రామ రామ రామ సీతా
 రామ రామ రామ (2)  ॥శ్రీ కరమౌ॥

## శ్రీ రామాంజనేయ యుద్ధం

రచన: ఆరుద్ర  సంగీతం: కె.వి. మహదేవన్  గానం:పి.సుశీల,బి.వసంత

శ్రీయుతమౌ శ్రీరామ పాదం శ్రితజన మందారం
పావనమీ రఘురామ పాదం పాపవినాశకరం
కలుషమ్ముల ప్రక్షాళన చేసే గంగ చలించిన పాదం
అసురమదమ్మును పాతాళానికి అణచివేసిన పాదం
రాతిని నాతిని చేసిన పాదం
అడవికి అందం పోసిన పాదం
నీ చరణమ్మే శరణమ్మనగా ఇచ్చును పెన్నిధానం॥శ్రీయుతమౌ॥
 అవలీలగ జలధిని దాటిన మేటి
 పవనకుమారుడు పట్టే పాదం
 బ్రహ్మేంద్రులు కొలిచే పాదం
 పరబ్రహ్మ పదానికి మూలం
 తాను ధరించిన పాదుకలకు ధర పట్టము కట్టిన పాదం
 తమ్ముడు భరతుని తరతరాలకు ధన్యుని చేసిన పాదం॥శ్రీ॥

## శాంతినివాసం

రచన:సముద్రాల(జూ) సంగీతం: ఘంటసాల  గానం: పి.బి. శ్రీనివాస్, పి. సుశీల

శ్లో॥ శ్రీరామచంద్రః శ్రిత పారిజాతః
సమస్త కళ్యాణ గుణాభిరామ
సీతాముఖాంభోరుహ చంచరీక
నిరంతరం మంగళమాతనోతు
శ్రీరఘురాం! జయరఘురాం సీతా మనోభిరాం
అన్నదమ్ములా ఆదర్శమైన ఆలు మగలా అన్యోన్యమైన
తండ్రి మాటను నిలుపుటకైనా
ధరలో మీరే దశరథరాం  ॥శ్రీ॥
వెలయునేయెడా నీ దివ్యమూర్తి
వెలిగే నాయెడ - ఆనందజ్యోతి
వెలసి మా గృహం శాంతినివాసం
సలుపవె శుభగుణ శోభితరాం  ॥శ్రీ॥

## వాగ్దానం

రచన: శ్రీ శ్రీ సంగీతం: పెండ్యాల గానం: ఘంటసాల

శ్రీ నగజాతనయం సహృదయం
చింతయామి సదయం
త్రిజగన్మ హోదయం శ్రీ నగజాతనయం॥

శ్రీరామభక్తులారా! ఇది సీతాకల్యాణ సత్కథ. నలభై రోజులనుంచి చెప్పిన కథ. చెప్పినచోట చెప్పకుండా చెప్పుకొస్తున్నాను. అంచేత కించిత్తు గాత్రసౌలభ్యానికి అభ్యంతరం ఏర్పడినట్లు తోస్తుంది. నాయనా! కాస్త పాలు, మిరియాలు ఏమన్నా?

ఒకడు: చిత్తం - సిద్ధం.

భక్తులారా! సీతామహాదేవి స్వయంవరానికి ముల్లోకాల నుంచి విచ్చేసిన వీరాధివీరుల్లో అందరినీ ఆకర్షించిన ఒకే ఒక దివ్యసుందరమూర్తి... ఆహా! అత డెవరయ్యా అంటే -

రఘురాముడు రమణీయ వినీల ఘనశ్యాముడు
వాడు నెలరేడు సరిజోడు మొనగాడు
వాని కనులు మగమీల నేలురా
వాని నగవు రతనాల జాలురా ॥వాని॥
వాని జూచి మగవారలైన మైమరచి
మరుల్కొనెడు మరోమరుడు, మనోహరుడు
రఘురాముడు!
సనిదని సగరిగరి రిగరి
సగరి రిగరి సగగరిసనిదని
సగగరి పనిదని
రిసనిద రిసనిద నిదపమగిరి
రఘు రాముడు
సనిస సనిస రిగరి సరిసనిస
పదనిస
సనిగరి సనిస సనిరిసనిదని
నిదసని దపమ గామాదా
నిని నిని నిని నిని
పస పస పస సపస
సప సపా సపా
తద్దిత్తంరి కిటతక
రఘురాముడు రమణీయ వినీల
ఘనశ్యాముడూ...
శభాష్ శభాష్

ఆ ప్రకారంగా విజయంచేస్తున్న శ్రీరామచంద్రమూర్తిని అంతః పుర గవాక్షమునుండి సీతాదేవి ఓరకంట చూచినదై చెంగటనున్న చెలికత్తెతో -

ఎంత సొగసుగాడే,
మనసింతలోనె దోచినాడే
మోము కలువరేడే - ॥మోము॥
నా నోముఫలము వీడే
శ్యామలాభిరాముని చూడగ -
నా మది వివశమాయె నేడే ॥ఎంత॥

ఇక్కడ సీతాదేవి ఇలా పరవశయైయుండగా అక్కడ స్వయంవర సభామంటపంలో జనకమహీపతి సభాసదులను జూచి, అనియె నిట్లు -

ఓ యనఘులారా ! నా అనుగు పుత్రి సీత
వినయాదిక సద్గుణవ్రాత, ముఖవిజిత లలిత జలజాత
ముక్కంటి వింటి నెక్కిడ జాలిన - యెక్కటి జోదును నేడు
మక్కువ మీరగ వరించి మల్లెలమాల వైచి పెండ్లాడు...

అని యీ ప్రకారం జనకమహారాజు ప్రకటించగానే, సభలోని వారందరూ ఎక్కడివా రక్కడ చల్లబడిపోయారట. మహావీరుడైన రావణాసురుడు కూడా 'హా ఇది నా ఆరాధ్య దైవమగు పరమేశ్వరుని చాపము. దీనిని స్పృశించుటయే మహాపాపము' అని అనుకొనినవాడై వెనుదిరిగిపోయాడట. తదనంతరంబున-

ఇనకుల తిలకుడు నిలకడ గల క్రొక్కారు మెరుపువలె నిల్చి
తన గురువగు విశ్వామిత్రుని ఆశీర్వాదము తలదాల్చి
సదమల మదగజ గమనము తోడ స్వయంవర వేదిక చెంత
మదన విరోధి శరాసనమును తన కరమును బూనినయంత
ఫెళ్ళుమనె విల్లు - ఘంటలు ఘల్లుమనె -
గుభిల్లుమనె గుండె నృపులకు
ఝుల్లుమనియె జానకీ దేహము
ఒక నిమేషమ్మునందె
నయము జయమును భయము విస్మయము గదురా...
శ్రీమద్రమారమణ గోవిందో హరి!

భక్తులందరూ చాలా నిద్రావస్థలో వున్నట్లుగావుంది.
మరొక్కసారి - జై శ్రీమద్రామారమణ గోవిందో హరి!
భక్తులారా! ఆ విధంగా శ్రీరామచంద్రమూర్తి శివధనుర్భంగము గావించినాడు.
అంతట -

భూతలనాథుడు - రాముడు
ప్రీతుండై పెండ్లియాడె పృథుగుణమణి
సంఘాతన్ భాగ్యోపేతన్ సీతన్
భూతలనాథుడు - రాముడు
ప్రీతుండై పెండ్లియాడె -
శ్రీమద్రమారమణ గోవిందో హరి

## సంపూర్ణ రామాయణం

రచన: కీ.శే. పాలగుమ్మి సంగీతం: కె.వి. మహదేవన్ గానం: ఘంటసాల

సర్వమంగళ గుణ సంపూర్ణుడగు నిన్ను
నరుడు దేవునిగాగ నరయుగాత
రామ నామము భవస్తోమ భంజన దివ్య
తారకనామమై తనరుగాత
పది కొంపలులేని పల్లెనైనను
రామభజన మందిరమొండు వరలుగాత
కవులెల్ల నీదివ్య కథ నెన్నోరీతుల
గొనియాడి ముక్తి గైకొంద్రుగాత
ఎట్టి వ్రాతయు శ్రీరామ చుట్టబడక
వ్రాయబడకుండు గావుత
రామ వాక్యమనిన తిరుగనిదని యర్థమగును గాత
రమ్య గుణధామ రఘురామ రామ రామ

పవమాన సుతుడు బట్టు
పాదార విందములకు
నీ నామ రూపములకు
నిత్య జయ మంగళమ్



ఏప్రిల్ 21 శ్రీరామ నవమి సందర్భంగా అభిమానుల కోసం... హాసం

